శ్రీ బి.వి.సింగరాచార్య పీఠికతో

వినుకొండ
వల్లభరాయ కృతము

# క్రీడాభిరామము



ఇంటింట సరస్వతీ పీఠం :

సంప్రదాయ సాహితి—20

వినుకొండ వల్లభరాయని

# క్రీడాభిరామము

అనుబంధము :

శ్రీనాథుని వీధి నాటకము, చాటువులు





సమాలోకనము :

బి. వి. సింగరాచార్య



గౌరవ సంపాదకులు :

బొమ్మకంటి వేంకట సింగరాచార్య

బాలాంత్రపు నళినీకాంతరావు

# వినుకొండ వల్లభరాయుడు

యం. శేషాచలం అండ్ కో
మచిలీపట్నం. మద్రాసు. సికింద్రాబాద్




ESS 20




ESS -20

EMESCO SAMPRADAAYA•SAAHITI
(Emesco Classics)

KREEDAABHIRAAMAMU

by
VINUKONDA VALLABHARAAYADU

Publishers :
M. SESHACHALAM & CO.

EMESCO POCKET BOOK

First Edition : June 1972

Cover Design :
*BAPU*

Printers :
SRI KALA PRINTERS
Madras - 33

Distributors :
ANDHRA PRADESH BOOK DISTRIBUTORS,
Raashtrapathi Road, Secunderabad.

Soft Cover Rs. 2-50
Library Edition Rs. 4-25

# విషయానుక్రమణిక



ప్రస్తావన : రూపక భేదమగు వీథీ ప్రశస్తి (1), కృతికర్త ప్రశంస [ప్రరోచనము] (1), వల్లభామాత్యుని పాండితీ వైభవాదికము (6), మూలగ్రంథమగు ప్రేమాభిరామ ప్రశంస (8), దేశభాషలందుఁ దెనుఁగు లెస్స (9), పాత్ర ప్రవేశ సూచనము (9), సూత్రధారోక్తి (10).

కథా ప్రారంభము : గోవింద మంచనశర్మ, టిట్టిభసెట్టి ప్రవేశము (12), శీతోపద్రవము (13), ప్రస్థాన కాలోచిత

# ప్రకాశిక

ఎమెస్కో సంప్రదాయ సాహితీ ప్రచురణలలో ఇంతవరకు తెలుగు సాహిత్యంలో సువిఖ్యాతములైన పందొమ్మిది కావ్యాలు వెలువరించాము. మన ప్రాచీన సాహిత్యంపట్ల ఆధునిక సాహిత్య రసజ్ఞుల ఆసక్తిని, అభిరుచిని పునరుజ్జీవింపజేయటం ఆవసరమనీ, 'దేశభాష లందు తెలుగు లెస్స' అన్న అనుపమ ఖ్యాతికి ప్రధాన హేతువులైన ప్రాచీన కావ్యాల పరిచయం నవ సాహిత్యకులకు ఆవశ్యకమనీ, దానివల్ల వారి సాహితీ రసజ్ఞత పరిపుష్టమై, తెలుగు పలుకుబడుల ఒడుపులు, ఒయ్యారాలు వారు చక్కగా గ్రహించి ఆనందించగలరనీ విద్వన్మిత్రులు మాకు చిరకాలంగా చేస్తూ వచ్చిన సూచనలను అనుసరించి ప్రారంభించిన ఈ ప్రచురణలు సహృదయామోదం పొందుతూం డటం విశేషం. వివిధ పత్రికలలో వెలువడుతూన్న సమీక్షలు,సాహితీ ప్రియు లెందరో పంపిన అభినందన లేఖలు, అన్నింటికన్న ఈ పుస్తకాలు చురుకుగా పంపకం అవటంలో పాఠకుల, పుస్తక విక్రేతలు చూపుతూన్న ఉత్సాహం - ఈ ప్రచురణల అగత్యాన్ని, ఆదిలో సాహితీ హితైషులైన విద్వాంసులు చేసిన సూచనలోని ఔచితిని నిస్సంశయంగా ధ్రువపరచటం మరొక విశేషం.

సంప్రదాయ సాహితీ ప్రచురణలను అభినందించిన కొందరు మిత్రులు మాకు కొన్ని సూచనలు కూడా చేశారు. ఈ కావ్యాలు టీకా తాత్పర్యాలతో ప్రచురిస్తే చాలినంత భాషాజ్ఞానం లేని పాఠకులకు కూడా ఉపయోగకరంగా ఉంటాయని కొందరూ, కనీసం కొన్ని కఠిన పదాలకైనా అర్థాలు (లఘుటీక) ఇవ్వటం మంచిదని మరి కొందరూ సలహా లిచ్చారు. పీఠికలు ఆయా కవుల్ని గురించి ప్రత్యేక

కృషి చేసిన పలువురు విద్వాంసులచేత వ్రాయించటం మంచిదన్నది మరొక సలహా. ఈ ప్రచురణలయందు ఆదరభావంతో చేసిన ఈ సూచనలకు కృతజ్ఞులం.

అయితే, ఈ ప్రచురణల ఆశయం సాధ్యమైనంత తక్కువ వెలకు, సులభంగా చేతబట్టి చదువుకొనటానికి వీలయిన, ముచ్చటైన, చిన్ని సంపుటాలుగా, ముఖ్యంగా నవ సాహిత్యకులకు అనువుగా, విస్తృతంగా పంపకం చేయటం - అని ఆదిలో మేము చేసిన వివరణ దృష్ట్యా ఈ సూచనల ఆచరణీయతను పరిశీలించవలసి ఉంది.

సంప్రదాయ సాహితి: ప్రథమ దశకము—(1. మను చరిత్రము, 2. వసుచరిత్రము, 3. ఆముక్తమాల్యద, 4. పాండురంగ మాహాత్మ్యము, 5. శృంగార నైషధము, 6. పారిజాతాపహరణము, 7. శ్రీకాళహస్తి మాహాత్మ్యము, 8. ప్రభావతీ ప్రద్యుమ్నము, 9. విజయ విలాసము, 10. హర విలాసము) ప్రచురణ పూర్తి చేసి, వాటిపట్ల పాఠకలోకంలో వ్యక్తమయిన ఆసక్తిని పురస్కరించుకొని, అలాగే ఈ పరంపరలో మరికొన్ని ప్రముఖ కావ్యాలు - పిల్లలమఱ్ఱి పిన వీరభద్రకవి శృంగార శాకుంతలము, మొల్ల రామాయణము, సారంగు తమ్మయ వైజయంతీ విలాసము, పింగళి సూరన కళాపూర్ణోదయము రెండు సంపుటములుగాను; బిల్హణీయము, అహల్యా సంక్రందనము, రాధికా సాంత్వనము, శశాంకవిజయము ప్రచురించి, ఇప్పుడు క్రీడాభిరామమనే ఈ సువిఖ్యాత శృంగార కావ్యమును అందిస్తున్నాము.

ఇక్కడితో సంప్రదాయ సాహితి పందొమ్మిది కావ్యాలు (20 సంపుటాలు) వెలువరించాము. ఇతర ప్రసిద్ధ కావ్యాలుకూడా వీలు వెంబడిని ఇలాగే ముచ్చటైన సంపుటాలుగా ప్రచురించగలము.

ఈ ప్రచురణలకు సదా మీ సహకారం ఆశిస్తూన్న

భవదీయుడు,

యం. యన్. రావు

# సమాలోకనము

## బి. వి. సింగరాచార్య

క్రీడాభిరామం మిగిలిన కావ్యాలవంటిది కాదు. ఇటువంటి కావ్యం తెలుగులో ఇంకొక్కటి కూడా లేదు. ఈ చిన్న (296 పద్య గద్యల) ఏకాశ్వాస ప్రబంధంపైన మన పండితులు పెంచిన తీవ్ర దీర్ఘతర తర్జన భర్జనలు ఇంకే కావ్యాన్ని గురించి సాగింది లేదు.

తెలుగులో ఇదొక గొప్ప కావ్యం. గొప్ప కావ్యానికి ఒక లక్షణం-సమకాలిక ప్రజల జీవన విధానాలను ప్రతిఫలించడం. ఈ లక్షణం ఈ కావ్యానికి ఒప్పినంతగా ఇంక ఏ ప్రాచీన తెలుగు కావ్యానికీ నప్పదు. ఏనాడో, సంస్కృత పురాణ గాథానువాదనమే సర్వ కవితా విధానంగా సాగుతూన్న సమయంలో రచితమైన ఈ కావ్యానికి, ఈ ఆధునిక కవితా లక్షణం ఇంతగా అతకటం వింత.

ఒకనాటి (14 వ శతాబ్ది తొలి పాదంలోని) ఓరుగల్లు పట్టణం, అందులోని వివిధ వర్గాల ప్రజల విశ్వాసాలు, మూఢ విశ్వాసాలు, ఆచారాలు, దురాచారాలు, భోగాలు, క్రీడా వినోదాలు వాస్తవికంగా కళ్ళకు కట్టినట్టు చిత్రిస్తాడీకవి. నాటి శిష్టుల దుష్ట సంప్రదాయాలను, కవి సమయాలను ఒడుపుగా అవహేళన చేస్తాడు.

క్రీడాభిరామ రసికుడి మనస్సు ఆరునూరేళ్ళ చరిత్రని అధిగమించి ఎగిరిపోయి, ఆనాటి ఓరుగల్లు పట్టణంపైన చక్ర భ్రమణాలు చేస్తూ, చూస్తూన్నట్టు అనిపిస్తుంది-ఈ కావ్యం చదువుతున్నంతసేపూ.

### ఎమెస్కో పీఠికలు

ఎమెస్కో సంప్రదాయ సాహితీ పరంపరలో వెలువడే కావ్యాలకు పీఠికా రచనలో ఒక ప్రత్యేక పద్ధతి ఉంది. తొలి పది

కావ్యాలకు పీఠికలు రచించిన కవిసమ్రాట్టు శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు పెట్టిన ఒరవడి అది. మన ప్రాచీన సాహిత్యంతో ఎక్కువ పరిచయంలేని నవ రసజ్ఞులకు మన ప్రబంధ సాహిత్యంలో అభిరుచి కలిగించటానికి ఉద్దిష్టమైన ఈ ప్రచురణలకు ఇది అవశ్యకమని తోచి, ఆ విధంగా పీఠికలు రచింపజేయడం ఆచారం అయింది.

## స్వల్ప కథలో స్వభావోక్తి సౌభాగ్యం

పీఠికలో, కావ్యంలోని కథను సంగ్రహంగా తెలిపి, అందలి అందాలను ముందుగా పాఠకులకు చవి చూపించటం ఆదినించీ ఎమెస్కో సంప్రదాయ సాహితి పద్ధతి. క్రీడాభిరామం 'వీథి' అనే ఏకాంక రూపక ప్రభేదం 'ప్రేమాభిరామా'న్ని అనుసరించి కూర్చిన ఏకాశ్వాస ప్రబంధం అవటంవల్ల ఇందులో కథ అత్యల్పం. అన్నీ వర్ణనలు - ఆనాటి ఓరుగల్లు పట్టణంలో వివిధ దృశ్యాల వర్ణనలు. ఇందులో ప్రధానపాత్రలైన మంచన, టిట్టిభసెట్టి ఓరుగల్లు నగరంలోకి పోతూ దారిలో వారి చూపులను ఆకట్టుకొన్న దృశ్యాలు వర్ణిస్తారు. వారికి ఎదురైన వేశ్యల, వ్యభిచారిణుల వర్ణనలు, మంచి పాకంలో పడిన పసందైన ఇతర వర్ణనలు ఎన్నో ఉన్నాయి. అక్కడక్కడ ఆవర్ణనలలో శృంగారం పచ్చిగా ఉన్నా, అందులో కవి చూపిన చమత్కారం వాటికి శోభ నిచ్చి కావ్యాన్ని రసజ్ఞులకి ఆస్వాద్యం చేస్తుంది. అది లేని పచ్చి శృంగారం వేటూరి వారన్నట్లు 'చెట్ట' కవికి. కాని, క్రీడాభిరామం ప్రౌఢమయిన బహు రసజ్ఞ పండిత మనోజ్ఞమైన ప్రశస్త కావ్యం.

## వస్తు నిర్దేశ కౌశలం

నాటక ప్రారంభంలో తెరలోంచి వినిపిస్తుంది:

"రసజ్ఞ శేఖరా! మధుపా! విరిసిన అరవిందాన్ని విడిచి పోయి, అడవిలో చెట్ల చేమల్లో భ్రమిస్తున్నావా? నీ వివేకమంతా నిప్పచ్చరమై పోయిందా? ప్రేమతో వస్తావు. మురిపిస్తావు. మళ్ళీ కనిపించకుండా పోతావు. మళ్ళీ మళ్ళీ వస్తావు, పోతావు. మంచిరాజా! నువ్వు నిజంగా మా పాలిట మాయలేడి వయిపోయావు."

కామమంజరి తన ప్రియుడైన మంచనకు పంపిన ప్రేమోద్దీపక సందేశ గర్భితమైన మదన (ప్రేమ) లేఖలోని భావమిది (39-40). శర్మ టిట్టిభ సెట్టికి చదివి వినిపిస్తాడు. చిక్కని భావంతో వ్యంగ్య వైభవంతో కూడిన ఈ రెండు పద్యాలలో కవి కథావస్తు నిర్దేశం మనోహరంగా చేశాడు.

ఈ మంచిరాజు కాసల్నాటి 'బ్రాహ్మణ శ్రేష్ఠుడు'—గోవింద మంచన శర్మ; గన్నేరు పూజాయ నీర్కావి దోవతి గట్టి, గొజ్జంగి పూలరసంతో మేదించిన గంగమట్టితో లలాటాన నీటుగా బొట్టుపెట్టి, జరీపట్టు కండువా వల్లెవాటు వేసి, తెల్లగా మెరుస్తూన్న జన్నిదంతో, ఇంత ముచ్చట ముడితో, చిగురు పెదవుల మీద చిరునవ్వు చిందు లాడుతుండగా సాక్షాత్తు మన్మథుడులాగ ప్రవేశిస్తాడు, తన అనుగు చెలికాడు టిట్టిభ సెట్టితో.

ఈ మంచన శర్మకు ఓరుగల్లు నగరంలో కామమంజరి అనే పునర్భువు (వేశ్య) ప్రియతమ. ఆమె నాతడు, ప్రేయసీ ప్రియులకు ప్రియతమమైన వసంత కాలంలో వదిలి వెళ్ళి, గ్రీష్మ వర్షర్తువులు ఎక్కడెక్కడో గడిపి, తిరిగి కామమంజరిపై తలపుబారి వస్తున్నాడు. సూత్రధారుడు ఈ విషయం సూచించి తప్పుకోగా, గోవింద శర్మ, టిట్టిభసెట్టి ప్రవేశిస్తారు.

దృశ్యం: ఏకశిలాపుర ద్వార దేశం. సమయం: చలికాలం. విరహుల చిత్తాలను వేగిరించే కాలం.

వస్తూనే గోవిందశర్మ చలిగాడు కలిగించే కలగుందులను గురించి ప్రౌఢమైన, తెలుగు సాహిత్యంలో ఎంచి చూపదగిన నాలుగు పద్యాలు (45-48) విసురుతాడు.

## టిట్టిభసెట్టి రసికత

"టిట్టిభ! రాత్రి సుఖంగా నిద్ర పట్టిందా? తెల్లవారవస్తూంది. ఇదే మన ఏకశిలాపుర నగర ప్రవేశానికి శుభ ముహూర్తం" అంటాడు మంచన.

ఇక్కడ "ప్రక్కలు వంచి వంచి" అన్న పద్యం చాలా గొప్పది

అక్కణ్ణించి వాళ్ళకి ఎన్నో శుభ శకునాలు ఎదురవుతాయి. గోవిందశర్మ 'ధాత్రీసుర తిలకుడు' గదా! అతనికి శకున శాస్త్ర పాండిత్యానికి మాత్రం కొదువేముంటుంది?

ఎడమ దిక్కునుంచి కోటడు (గుడ్లగూబ) కూస్తుంది. చెట్టు మీద పూలకొమ్మ మీంచి నెమలి 'కెంగో' అంటూ కొసరి కొసరి కూస్తూంది. కోడి, ఏట్రింత, కొంకనక్క ఎదురైతే ప్రయాణికులకు శుభం. ఇవి ఎడమ ప్రక్కనించి పలికితే, ఇక వారికి 'కొంగు బంగారమే'

ఇంతలో కోడికూత విని, సెట్టి రసికత ఉట్టిపడే పద్యం (54) పాడతాడు. 'మన్మథుడు రాత్రి తెల్లవార్లూ ఈ ఏకశిలాపురంలోని యువతీ యువకులచేత సంకుల సమరాలు చేయించి చేయించి, 'తెల్లవారుతూంది; ఇక మీ యుద్ధాలు విరమించండి!' అని కోడిచేత 'ధర్మదార' (యుద్ధం ఆపుచేసే వేళని సూచించడానికి ఊదే కాహళి) పట్టిస్తున్నాడు చూశావయ్యా! మంచనయ్యా!" అంటాడు.

ఆపైన, శీతకాలంలో పల్లెటూరి భోజన సౌష్ఠవాన్ని గురించిన ఒక పద్యం (56) ఉంది, కాని ఇది సందర్భోచితి లేక, ప్రక్షిప్తం అనిపిస్తుంది. కుక్కుట కాహళిని గురించి టిట్టిభ సెట్టి చతురోక్తికి వెను వెంటనే మంచన తాను కామమంజరితో కలిసి ఉన్నప్పుడు ఆమె అలుక చెందటం, తెల్లవారులు ఆమె అలుక దీర్చి తీరాసుఖిస్తుండగా పాపజాతి కోడికూసి విఘ్నం కలిగించటం—చెప్పి ఉంటేనే సరిగా అతుకుతుంది.

మంచన గడిచిన ఆమని వేళ తాను తన ప్రియురాలైన వేశ్యను విడిచిపోవటం, గ్రీష్మ, వర్షాకాలములు గడపడం చెప్పి, ప్రావృట్కాలంలో ప్రవాసినుల అవస్థను చిక్కని పద్యం (60) లో చెబుతాడు. ఈ పద్యం శాలివాహన సప్తశతిలోని ఒక శ్లోకానికి

అనువాదం కనుక, శ్రీనాథుడు అనువదించిన 'సప్తశతి' లోనిది అయి ఉండవచ్చని కొందరు పండితుల ఊహ. (శ్రీనాథుడి సప్తశతి ఇప్పుడు దొరకటం లేదు) ఆ మూల శ్లోకాన్ని ప్రేమాభిరామ కర్తే స్వీకరించి ఉండకూడదా అనే అనుమానానికి జవాబు లేదు.

ఇంతలో ఉషోదయం అవుతుంది. ఆ మొదలి సంజ, "సొబగు వీడి కల్జెటు సోకినట్టి కామమంజరి నెమ్మోము కాంతి వోలె" ఉన్నదంటాడు, ప్రియా విరహార్తిలో వేగిరపడుతూన్న మంచన. ఆ తరువాతి రెండు పద్యాలలోని సూర్యోదయ వర్ణన మనోజ్ఞంగా ఉంది. ముఖ్యంగా "ఓరుంగంటి పురంబు సౌధములపై ...." అన్న పద్య రమణీయత ఫిట్జ్ జెరాల్డ్ రుబాయీలలోని (Awake, for the morning...) అనే అద్భుత పద్యాన్ని స్మరింప జేస్తుంది.

## శ్రీనాథ పద్య వ్యంగ్యానుకరణం

సంధ్యా సమయం గనా! ఎంత ప్రియ వేశ్యా విరహజ్వరార్తుడైనా గోవింద శర్మ భూసుర వరుడు గనుక, "సంధ్యాగ్ని హోత్ర క్రియా కలాపంబులు ఇట క్రితంబె నిర్వర్తింపబడె" అంటాడు.

తరువాత పుర ప్రవేశానికి శుభ ముహూర్త ప్రసక్తి తీసుకు వచ్చి, శ్రీనాథుడు భీమఖండంలో వ్యాసాది మహర్షులు దక్షిణ కాశీ నగర ప్రవేశ సందర్భములో శుభముహూర్తములను గురించి చెప్పిన "గార్గ్య సిద్ధాంత ...." (66) అనే పద్యం కొంచెం మార్పు చేసి చెపుతాడు.

ఈ కావ్యం శ్రీనాథకృతం అనడానికి ఇది కూడా ఒక సాక్ష్యంగా చెపుతారు - ఆ పట్టుదల గల పండితులు. కాని, అక్కడ వ్యాసాది మహర్షులు; ఇక్కడ ఇద్దరు ధూర్త విటులు. అక్కడ దక్షిణ కాశీ, భీమేశ్వరస్వామి దర్శనం లక్ష్యం. ఇక్కడ వేశ్యావిట సంగమం.

శ్రీనాథుని పద్యాన్ని Parody (హాస్యానుకరణం) చేసి

వల్లభరాయుడు ఇక్కడ వాడుకొన్నాడని చెప్పడం సబబుగా కనిపిస్తుంది.

అంతటి పవిత్ర సన్నివేశంలో చెప్పిన పద్యాన్నే శ్రీనాథుడిటువంటి సందర్భంలో మళ్ళీ వాడి, పరిహాస భాజనం చేస్తాడనుకొనడం భావ్యం కాదు.

పైగా, ఇక్కడ చెప్పిన (గార్గ్య, బృహస్పతి, వ్యాస, విష్ణు) మతాలు నాలుగూ మంచన నగర ప్రవేశ ముహూర్తానికి అనుకూలంగానే ఉన్నట్టు కవి ప్రస్తరించటం కూడా ఈ హాస్యానుకరణకు దోహదకారి. ఉషఃకాలమే కనుక గార్గ్య మతానుసారం సరిపోయింది. మంచి శకునాలెన్నో ఎదురయాయని లోగడ చెప్పాడు గద! ఆ విధంగా బృహస్పతి మతానుసారంగాను శుభముహూర్తమే వ్యాస మతం 'మనః ప్రసాదాతిశయం!' ప్రియురాలిని కలుసుకోవటానికి పోతున్న మంచనలో అది పుష్కలంగానే ఉంది. ఇక విష్ణు మతం విప్రజన వాక్యం. స్వయంగా తానే విప్రవరుడు గనుక, వేరే విప్రుడితో అవసరమే లేదు?

సరే, అన్నివిధాలా మంచి ముహూర్తాన ఓరుగల్లు నగరం వెలిపాళెం (వెలుపలనున్న గూడెంలో) ప్రవేశిస్తారు. ఆ నగరం బాహ్య కటక లక్ష్మికి ఇత్తడి కడియం (ఆరకూట కటకం) లాగ ఉందిట ఆ మేదరివాడ.

ఆ వాడ చివర, వెదురు కఱ్ఱల పీట మీద కూచుని ఉన్న ఒక మేదరి వేశ్య గోవింద శర్మ కంటబడుతుంది. ఆమెను వర్ణిస్తాడు (68-71). స్వభావోక్తి సౌందర్యం ఉన్నా - శృంగారం కొంత పచ్చిగా ఉన్న పద్యాలివి.

## ముదురు పాకపు శృంగారం

ముందుకి పోతూండగా వాళ్ళకి బుతుస్నానానికి వస్తూన్న ఒక చండాలాంగన ఎదురవుతుంది. ఆమె అందాన్ని వర్ణిస్తాడు.

ఆపైన కర్ణాటాంగన ఎదురైతే ఆమెతో అతిసాహసంగా ఛలోక్తు లాడుతాడు.

ఆపైన మైలసంత (నిమ్నజాతులకు ఉద్దిష్టమైన సంత)లో సుసర భేత్ (రోమహారి) అనే మందును గురించి మంచన టిట్టిభుల సంభాషణ హాస్యం ముదిరి మొగం మొత్తే శృంగారంగా పరిణమిస్తుంది.

తరువాత, వెలిపాళెంలో ఇంటి ముంగిట ముచ్చటగా ముగ్గులు పెట్టి, గొబ్బెమ్మలు పెట్టడానికి గోమయం (ఆవుపేడ)తో ఉండలు చేస్తూన్న ఒక కాపు ముద్దరాల్ని చూసి మంచన చేసే వర్ణనలో (82-81) చమత్కారం పుష్కలంగా ఉన్నా ముదురు పాకపు శృంగారం కనిపిస్తుంది

ఇంకా కొంతదూరం వెళ్ళేసరికి, చేటికతో సహా ఎదురైన కర్ణాటాంగన వర్ణన (86-88), ఆమెతో గోవిందప్ప చేసే సాహస రసిక ప్రసంగం (89-95) అతి ప్రౌఢంగా ఉన్నాయి. ఆ పద్యాలు యథాతథంగా చదువుకుని ఆనందించవలసినవేగాని, విప్పి చెప్పుకొన దగినవి కావు.

## జూదగాళ్ళ ఒడుపులు

మరి కొంచెం ముందుకి పోగా ఒకచోట జూదగాళ్ళ చుట్టూ చేరిన పెద్ద గుంపు కనిపిస్తుంది. జూద పద్ధతి, దాని దుష్ఫలితాలు, పైపందాలు కాయించే దళారుల మోసకారితనం వివరిస్తాడు(97-99) శర్మ. జూదరుల పాట్లను వివరించే "సంగా సంగ...." అన్నది గొప్ప పద్యం.

తరువాత సంపెంగ నూనె అమ్మే కరణ కాంత వర్ణన(101) ఉంది. ఆమె కంఠం సరస్వతీ వీణా నాదానికి పాణింధమము (loud speaker) లాగ ఉన్నదట.

ఆ పైన నూనె గానుగ మీద కూచుని ఎద్దును తోలుతూ గిరగిర తిరుగుతూన్న ములికినాటి కలికిని గూర్చిన వర్ణన (102-104) ప్రతిభావంతంగా ఉంది. మందరగిరితో సముద్ర మథనం చేస్తున్న

ప్పుడు గిరగిర తిరుగుతూ పైకి వచ్చిన మహాలక్ష్మిలాగ సాక్షాత్క రిస్తుంది ఆమె మంచనకి. అతడు విట చక్రవర్తిగద! ఈ పద్యాల్లో "మీన విలోచనంబులను....'' ఉన్నది మాకు దొరికిన శ్రీనాథుని చాటువులలో కూడా కిపించింది (చూ. పుట 102. పద్యం 107). శృంగార పద్యాలు వ్రాసి పెట్టుకొనే మహా రసజ్ఞులు తమకు నచ్చిన పద్యములన్నీ ఎంచి వ్రాసుకొనటంలో ఇది జరిగి ఉండవచ్చు. చాటువులలో ఇది సంభవమే గద!

తరువాత ఉత్తరంగా పోయి మోహరి (సైనికుల) వాడలో ప్రవేశిస్తారు. చక్కగా కత్తరిస్తూ తీర్చి పెంచిన పూలచెట్లు, కోకిలలు, కలహంసలు, వానకోయిలల మధురనాదాలు ఈ విట ద్వయానికి స్వాగతం చెపుతాయి.

అక్కడ కంచెల (రవిక) లు కుట్టించుకొనడానికి వచ్చిన వెల యాంద్రతో ఒక సౌచికుడు (దర్జీ) సాగిస్తున్న శృంగార చేష్టలు గమనిస్తాడు మంచన.

మరికొంత ఉత్తరంగా పోతే అక్కడొక అరుగు మీద, చెలికి పేలు చూస్తున్న మరో అందకత్తె మంచన దృష్టి నాకర్షిం చింది. ఆయింటి ముందరే కూచుని పసుపు నూరుతూన్న తరుణీ రత్నాన్ని గూర్చి మంచన చేసే వర్ణన (110) శృంగార రసికులు చాలా మంది కంఠస్థం చేసి ఉంచుకునే పద్యరత్నాలలో ఒకటి.

## నాటి ఓరుగల్లు వైభవం

తరువాత వాళ్ళు బాహ్య కటక వీథి దాటి, ఓరుగల్లు మహా నగర ద్వారం దగ్గిరికి వస్తారు. ఇక్కడ మంచన చెప్పిన పద్యం (112) నాటి ఓరుగల్లు మహా నగర వైభవాన్ని స్ఫురింపజేస్తుంది. "పెద్ద గవని (ద్వారం) వస్తూ పోతూన్న ఏనుగులు, రథాలు, గుఱ్ఱాలు వగైరాలతో అతి సమ్మర్దంగా ఉంది. అందువల్ల క్రంత త్రోవ (మనుష్యులు మాత్రం పోయే చిన్న ద్వారం) గుండా సందుల్లోంచి పోదాం. అక్కడ మనకు వేశ్యావాటిక తగుల్తుంది. సరసాలాడుతూ

మెల్లగా పోవచ్చు. అక్కలవాడలో మధ్యాహ్న సమయంలో గాలి వేడుక ఉండదు," అంటాడు సెట్టితో.

పల్నాటివీరుల వీరావేశాల అవహేళన

ఇద్దరూ అలుసరి (కోటకొమ్మ) క్రిందుగా పోయి పలనాటి వీర పురుషుల సంస్మరణ చిహ్నంగా నిర్మించిన శివాలయ వీథిని చేరుకుంటారు. అక్కడ ఒక గాయని, పల్నాటి వీర చరిత్ర ద్విపద ప్రబంధమును "ద్రుత తాళంబున" పాడుతూ, వీరగుంపి (వీర గాథలు పాడు వారు ఉపయోగించే ఒక తాళ వాద్యం)పై "తక ధిం ధిం ధిం కిటాత్కార సంగతి" వాయిస్తూ ఆడుతూంది. ఆమెకు వంత పాడుతూ గర్జిస్తూ, గంతులు వేస్తూ వీర రసానుగుణంగా అభినయిస్తున్నారు మరికొందరు పురుషులు. అది చూసి వర్ణిస్తాడు మంచన. దాంతో ఆగక తాను పలనాడులో చూసిన దృశ్యాలు, పల్నాటి వీరుల పౌరుషమూ వివరించి చెప్పి, వారంతా నశించి పోవడానికి కారణాలు చెపుతాడు (116-126). ఇక్కడ వీరావేశ పూరితులను అవహేళన చేస్తాడు (పద్యాలు 119, 123, 124). భోగ పురుషుల సిద్ధాంతాలు వేరు గదా! ఇక్కడ మంచన పాత్ర పోషణలో గొప్ప ఔచిత్యం కనిపిస్తుంది.

నాయకురాలి దుర్మంత్రం, కోడిపోరు, చాపకూటి కుదుపు కారణ మంటాడు పల్నాటి వీరుల వినాశానికి. "మగ సింగంబులు సంగరాంగణముల" మడిసి పోగా, అక్కడి కాపుగుబ్బెతలు పుంభావ (ఉపరతి) ప్రసంగాల్లో మగ సింగాలుగా పేరు మోశా రంటాడు.

ఆపైన ఎదురుగా గచ్చుచేసిన చిత్రంపు గద్దెపలకమీద వ్రాసియున్న బ్రహ్మన్న మొదలైన పలనాటి వీరుల చిత్రాలను సెట్టికి చూపిస్తాడు.

చివరికి, "ఈ వీరపురుషులు మనకు కార్యసిద్ధి సేయుదురు గాక, వదవద!" అనే హాస్యోక్తితో ముందుకు నడుస్తాడు.

ఎదురుగా ఏకవీరాదేవి దేవాలయ గోష్ఠం కనిపిస్తుంది. ఏకవీర

అంటే పరశురాముని తల్లి, జమదగ్ని మహర్షి పత్ని. ఆమెకు గుడులు కట్టి దేవతగా కొలవటం దేశంలో చాలాచోట్ల ఉన్నది. గోవింద మంచన శర్మ ఏకవీరను స్తోత్రం చేస్తాడు (127-128). ఆ శిష్టాచార సంపన్నుడు అందరు దేవతలకు భక్తుడే! ఇంతలో వాళ్ళు ఆలయం దగ్గరికి వస్తారు. ఏకవీరాదేవి ఎదుట నిలిచి, ఏక తంత్రీ వాద్యం మీటుతూ వివిధ రాగాలలో చవులూరిస్తూ పరశురాముని గాథలు పాడుతూన్న జవనీడు (ఒక జాతి వీధి గాయకుడు)కనిపిస్తాడు. ఇంకొక చోట ఒక మాలెత "మద్వానద్ధ ఘంటా" వాద్యాలకు అనుగుణంగా కోకిల నాదంతో ఏక వీరాదేవిని స్తోత్రం చేస్తూ ఉంటుంది. ఇంకా ఎందరో పాడుతూ ఆడుతూ ఏకవీరను కొలుస్తూంటారు (130-132.)

పై పద్యాలు మంచన చెపుతున్నవో, కవి వివక్షితమైనవో స్పష్టంగా లేదు. ఏమైనా మన శృంగార పురుషుడు ఏకవీర సన్నిధికి వెళ్ళేసరికి అతనికి గొప్ప సందేహమే కలిగింది. "సెట్టి! పెద్ద సమస్యే వచ్చిందే! దగ్గరికిపోయి చూసిగాని దేవికి మ్రొక్కరాదు. ఆ దేవి "వ్రీళా (సిగ్గు) శూన్య కటీర మండలము"ను "దేవీ శంభళీ వ్రాతమును (తార్పుడు కత్తెల్ని) చూస్తే తీరా మనకు కామావేశం కలుగుతుందేమో!" అంటాడు. ఇక్కడ కూడా కవి ఆశయం ధూర్త శృంగారాన్ని రోత కలిగే రీతిగా చిత్రించడమే అనిపిస్తుంది.

తరువాత సొగసుగా అలంకరించుకొని వచ్చే కాపువెలది వర్ణన (134). ఉరుమ (మృదంగమును బోలిన తాళవాద్యం,) వాయిస్తూ కామవల్లీ (లక్ష్మి) నారాయణ ప్రణయ కీర్తనలు పాడే ఒక జక్కుల పాటకత్తె ఒయ్యారమును గూర్చిన వివరణ ఉన్నాయి. వీటికీ వక్తృ వివక్ష కనిపించదు.

ఆపైన ఏడుగురు అక్కలు (యక్షకన్యలు) చేసే ఆరాధనా నృత్య వర్ణన (137-138) "సంతానార్థి అయిన ఆ యింటి యజమాని యక్ష కన్యల నృత్యం ఏర్పాటు చేశాడు కాబోలు! ఈ మాణిభద్ర దేవతలూ, కామవల్లీ మహాలక్ష్మి మనకు ఇష్ట కార్యసిద్ధి చేకూరుస్తారు"

అంటూ వాళ్ళకు నమస్కరించి మంచన ముందుకు నడుస్తాడు. ఆరుగురు అక్కల తరువాత ఆదిలక్ష్మి కామవల్లిగా జన్మించినదట. పెళ్ళిళ్ళలో అక్కల కొలువు జరిపే ఆచారం ఉన్నది. కొంత దూరం వెళ్ళి సెట్టి ఒక చోట మంచనను ఆపి, "అక్కడ డమరు డిండిమాది వాద్యాలతో ఏదో మహార్భాటం సాగుతూన్నట్టుంది. ఏమిటిది?" అని అడుగుతాడు. అక్కణ్ణించి మైలారుదేవత ఆరాధనను గురించిన పద్యాలు (142-147)

మైలారు వీరభటుల ప్రచండ భక్తి

ఈ మైలారుదేవత శివ ప్రతిరూపం; వేటాదేవారు ఆరాధించే దేవుడు, "భైరవునితోడి జోడు." ఓరుగల్లులో మైలారు దేవాలయం ఉంది. శైవావేశంగల వీరభటులు ఆదేవాలయం ముందు కణకణ మండే చంద్రమల్లెల (నిప్పుల) గుండాలలోంచి నడచి పోవటం, వాడి అలుగులు పాతిన పెద్ద పాతరల్లో పైనించి ఉట్టి చేరులు పట్టుకొని వ్రేలాడుతూ ఉవ్వెత్తుగా దూకటం, వీపు చర్మాన్ని గాలానికి గుచ్చుకొని ఉయ్యాలలు ఊగటం, గండకత్తెరలు మ్రింగటం, నారసాలు పొడుచుకోవటం, అరచేతులతోనే (కర్పూర) హారతులివ్వటం మొదలైన సాహసకృత్యాలుచేస్తూ ఉంటారు. వారిని 'మైలార వీర భటులు' అంటారని వివరించి చెప్తాడు మంచన.

ఆ ప్రక్కనే కొందరొక గొరగపడుచుచేత అర్థాభినయంతో కూడిన గొండ్లి (ఒక విధమైన మండలాకార నృత్యం) ఆడిస్తుంటారు. ఆ పిల్ల వెనక్కి మొగ్గవేసి, నీటి తొట్టిలో తలముంచి, అడుగున ఉన్న ముంగర ముక్కున గుచ్చుకొని లేస్తుంది. నాలుకకొనతో అలవోకగా నల్లపూసల పేరు గుచ్చుతుంది.

తరువాత మైలారుదేవత ప్రస్తుతి, ఆ ఉత్సవారాధనా విధాన వర్ణన ఉన్నాయి (145-146). ఆ ఉత్సవంలో సాగే నృత్యంలో మస్తుగా మద్యం సేవించిన నర్తకులు "అకరో! యమ్మకరో! యమక్కరో! యదీ! యట్టట్టకో!" అంటూ గట్టిగా అరుస్తూ తప్పెట్లు తళ్ళె తాళాలు 'ఇంపు సొంపు రంపిల్లగా,' "జక జుంజుం జక

జుంజు జుమ్ము మనుచుఁ" వాద్యాలు మ్రోగగా అత్యావేశంతో ఆడు తున్నారు.

ఆపైన వారు భైరవాలయం, చమదేశ్వరి నగరు, వీర భద్రేశ్వరాలయ మండపం, బౌద్ధ విహారం, ముసానమ్మ - కొమర సామయ్య - పాండవుల గుడుఁ, తురకల మసీదు, మేరు శృంగాల వలె బంగారు కలశాలతో మెరుస్తూన్న కేశవస్వయంభువుని ఆలయమూ చూస్తారు. మరి కొంత దూరాన కనిపించిన భైరవాలయాన్ని సమీ పించి, నమస్కరించి స్తోత్రం చేస్తాడు మంచన (151).

మధ్యాహ్న కాల మయింది. ఎండ నిప్పులు చెరుగుతూంది (153). ఈ చండాతప వర్ణన ('వ్రాలెన్ దిక్కులు....") పద్యంలో మొదటి రెండు పాదాలలో కనిపించే సమాసం శ్రీనాథుని హర విలాసం లో కూడా కనిపిస్తున్నది. అది భట్ట మురారి అనర్ఘ రాఘవం (సంస్కృత నాటకం) లోంచి ఆయన సంగ్రహించి తెచ్చుకున్నది.

అయితే, క్రీడాభిరామకర్త వ్యస్త పదాలతో కూర్చిన చివరి రెండు పాదాలే అంతకన్న మనోహరమైనవి. ఆ మధ్యాహ్నపు టెం డలో 'కొలని తామర పూలలోని మైరేయం (మధువు) కూడా కాగి కాగి ఉండటంతో తుమ్మెదలు వాటిని ముట్టడానికి భయపడుతున్నా" యంటాడు. ఆ పద్యంలో ప్రథమార్ధంలో ఉన్నది అర్థస్ఫూర్తి లేని శబ్దానుప్రాసల సమాసార్భటి; ద్వితీయార్ధం ప్రసన్న ప్రకరణౌ చిత్యసంపన్నమైన గాఢ భావన. శ్రీనాథుని వ్యంగ్యంగా పరిహసించ డానికే వల్లభామాత్యుడు ఇలా కూర్చాడనవచ్చు.

పూటకూటింటి భోజన సౌష్ఠవం

ఇంతలో ఆకాశంనించి వ్రేలాడుతూన్నట్టు కనిపిస్తూన్న ఆంధ్రోర్వీశు సౌధముపై గడియారం పదహారు గంటలు కొట్టటం లెక్కపెడతాడు మంచన. అవి గడియ (24 నిమిషాలు)లను సూచించే గంటలు అయి ఉండాలి. పదహారు గంటలు కొట్టిన వేళ- అనగా దాదాపు మిట్ట మధ్యాహ్నం వేళ.

"ఆకలి వేస్తూంది. మంచి పూటకూటింటికి పోయి భోజనం చేసేద్దాం సెట్టీ" అంటాడు మంచన. ఆనాటి పూటకూటి యిళ్ళల్లో పుష్పశరుడు (మన్మథుడు) నిత్యం బంధకీ జారుల (వేశ్యావిటుల)కు సంధి విగ్రహ యానాదులలో రాయబారిగా సాయపడుతూ నిత్యం హాజరుగా ఉంటాడు (157) అంటాడు గోవిందప్ప.

ఇలా అంటూ పోతూండగా స్విష్టకృతుగా భోజనంచేసి తెల్లటి ఆకులకు సున్నం రాచి మడిచి నోటికి అందించుకుంటూ వస్తూన్న బ్రాహ్మణుడు ఎదురవుతాడు.

కరణదేశపు జాణడులాగున్నాడు. మదించి తిన్నాడు. ఇక "ఏడకో తిరగ" (ఏ సానినో వెతుక్కుంటూ) పోతున్నాడు. అని మంచన వ్యాఖ్య. ఇంతలో ఆ బాపడు దగ్గరికి రాగా, "మంచి పూట కూటిల్లు" చూపమని అడుగుతాడు. అతడు ఇకణ్ణి మించిన రసికుడు.

"ఆహారానికా? విహారానికా? లేక రెండింటికీనా?" అని అడిగి, ఆహారానికైతే "అదుగో ఆ లక్ష్మణవఝ్ఝలవారి యింట ఒక రూకకు మంచి భోజనం పెడతారు. విహారానికి కూడా అక్కడ మంచి "కుఱుబోడ ముండ రత్నం" ఉందని, ఆమె ఒడుపులు, ఒయ్యారాలు వివరిస్తాడు. ఇక్కడ రెండు మూడు పద్యాలు మంచి ఒడుపుగా సాగినాయి, ఆనాటి శిష్టుల దుర్వర్తనల వ్యంగ్యావహాళన కవి ఆశయం (169). "కప్పుర భోగి వంటకము ..." అన్న(166) పద్యం ఆనాటి బ్రాహ్మణ భోజన సౌష్ఠవాన్ని వ్యక్తం చేసే మంచి పద్యం.

మిత్రులిద్దరూ లక్ష్మణ వఝ్ఝల పూటకూటిఇంటికే పోయి "చంకల బంటిగా" భోజనంచేసి, అక్కడి వేడుకకత్తెని చూసి 'మరోమారు వద్దాం' అనుకుంటూ పోతూండగా, ఒక పుష్పలావిక ఎదురై గోవిందశర్మకి ఒక మొగలిపూవు ఇస్తుంది. ఆ మొగలిపూవు వర్ణన (173) ప్రౌఢమైన సీస పద్యం. శివుని కంటి చిచ్చున కాలిన మన్మథుని బూదిలాగ ఉన్న కమ్మపుప్పొడి తావి ఘనమైన మొగలి పూవు అంటాడు కవి. అపైన గోవిందశర్మ ఆ మొగలి పూవుని గురించి చెప్పిన పద్యం (175) ఇంకా బాగుంది.

గోవిందశర్మ ఆ పూవు తీసుకొని, పుష్పలావికి వెలయిచ్చి, 'చందమామ కొంత నాలిక యగు ఒక లేతరేకు' తీసి సిగలో దాల్చి మిగిలినవి బ్రాహ్మణులకిచ్చి ముందుకు సాగిపోతాడు. ఇక్కడ (176-177) మధ్య కొంత గ్రంథపాతం ఉన్నట్టు కనిపిస్తుంది.

## మహారాజ భోగినితో మంచన సాహసిక రాసిక్యం

తరువాత హఠాత్తుగా, "అదుగో మన్మథుడు శత్రువులపై గెలుపు సాధించడానికి విజృంభించే నాటకంలో ప్రస్తావనా ప్రథమ నాందీశ్లోకం అయిన వేశ్యవాటిక. మంచి గంధంతో కలియంపి చల్లి, కుంకుమ పూవుతోను, కర్పూరంతోను రంగవల్లికలు తీర్చి, తామర పూతోరణాలు కట్టిన ఈ ఇల్లెవరిదో! శోభనం ఉట్టిపడుతూంది!" అంటాడు మంచన.

అది మదన వేద విద్యోపాధ్యాయి, ఏకశిలా పురమునేలే 'ప్రతాపరుద్ర ధరణీ శోపాత్త గోష్ఠి ప్రతిష్ఠా పారీణ' అయిన మాచల్దేవి అనే వేశ్య భవనం. అప్పుడామె చిత్రశాలా ప్రవేశం చేస్తుంది. మీరువెళ్ళి చూడవచ్చు అంటారక్కడివారు. "ఆ మహారాజ భోగిని వైభవాన్ని నాటకాలుగాకూడ వ్రాసి ఆడతారు; సెట్టీ! పోయి చూద్దామా?" అంటూ ఇద్దరూ చిత్రశాలలోకి ప్రవేశిస్తారు. అక్కడ నఖశిఖ పర్యంతం అలంకరించుకొని, హంసతూలికాతల్పం మీద కూచుని ఉన్న, హావ భావ విలాస విభ్రమ నిధియైన మాచల్దేవిని కనులార చూసి, మహారసికుడైన మంచన ఆమె సౌందర్య ప్రశంసాపూర్వకమైన ఆశీర్వాదం చేస్తాడు. "నీ ప్రశస్తి ఢిల్లీ సురతాణికి కూడా" లేదంటాడు. "ఆదిలక్ష్మికి నీకును భేదమేమి? యుదధి జనియింప కుండుట యొకటి దక్క" అంటాడు.

ఆమె ఈ నవమన్మథాకారుడైన మంచనను చూసి, కంకణాలంక్రియా ఝణాత్కారాలు పెల్లు కాగా, రెండు చేతులెత్తి, "అయ్యగారికి జోహారు," అంటూ నమస్కరిస్తుంది. గోవిందుడు విటశేఖరుడే కాడు. గుండెలుదీసిన బంటు కూడాను. ఆమె తనను ఆస కితో

ఆప్యాయంగా చూపిన చూపు మోపు చేసుకొని, "అగరు ధూ పాధివాసి తాభ్యంకరంబు" నీ మన్మథచ్ఛత్ర మండపంబు (మరునిల్లు) సర్వ యోషి దసామాన్య సౌష్ఠవము, ఓర్గంటి కటక విటుల కామగావుత' అని ఆశీర్వదిస్తాడు ఆ మహారాజభోగినిని అతి సాహసంగా.

ఆమె మహా రసజ్ఞురాలు. కోపగించుకోలేదు. తలచుకొంటే అతని తల తీయించి వేయగల దామె. అతని రసికతా గాఢతను గ్రహించి, అతని కులగోత్రాదులడిగి కుశల ప్రశ్న చేస్తుంది (188). సంభాషణాత్మక మైన మంచి సీసపద్యం. "విచ్చేసి కూర్చుండు" దంటుంది. అతడు సంధ్య వార్చుకొనడానికి పోవాలంటాడు. మాధ్యాహ్నికం కాబోలు! నైష్ఠికుడు కదా!

## శృంగార చిత్రకాల

మిత్రులిద్దరు చిత్రశాలలోని "చిత్తజుని శౌర్య మెఱిగించు చిత్రా"లన్నీ చూస్తారు. ఆ పురాణ శృంగారగాథల చిత్రాలను అభివర్ణించే పద్యం (191) జ్ఞాపకం పెట్టుకో దగినది. ఆ చిత్రకారుని ప్రజ్ఞను పొగడి మంచన అక్కణ్ణించి బయలుదేరి పోతూ, దూరాన పిందువార (వావిలి) లతా కుంజాన్ని చూపి, తన ప్రియురాలి గృహాన్ని గుర్తుపట్టి పోగా, అక్కడ దాస దాసీ జనులు అతనికి ఎదురు వచ్చి తీసుకుపోతారు. ఏదో మహోత్సవ పారీణ అయిఉన్న ఆ వారవనితాతిలకం అతనికి అర్ఘ్యపాద్యాది సత్కారాలు చేస్తుంది. ఆ పైన దీర్ఘ వియోగానంతరం కలుసుకొన్న ప్రియతమ వేశ్యా విటుల సంభాషణ పద్యం (194) మంచి ఒడుపుగా నడుస్తుంది. "మన గృహంబున ఈ శోభనమేమి?" అంటే "అత్రిసమాన! నీ యనుగు గాదిలి కూతురు చూచు నద్దమున్" అని జవాబు చెపుతుంది.

## మదనరేఖకు ముకుర వీక్షణం

వారకాంతలు ఈడేరిన తమ ఆడుబిడ్డలకు ముకుర వీక్షోత్సవం చేయడం ఆచారం. ఆనాడు వారికి అద్దం చూపి, "మన్మథవేద దీక్ష" ఇచ్చిన మీదటనే వారికి విట భోగార్హత కలుగుతుంది.

సోమయాజి అరణి సంగ్రహము చేసుకోకుండా యజ్ఞంచేయనట్లే, ముకుర వీక్షా విధానం జరగకుండా వేశ్యకన్యలు వృత్తికి పూనుకోరట. "లంజెవారికి శ్రీ మహాలక్ష్మి గాదె దర్పణము" అంటుంది. అంతే కాదు. "వివర్త వాదాలన్నిటికీ దర్పణమే దృష్టాంత భూమి గదా!" అని తన తత్వశాస్త్ర పాండిత్యంకూడా వ్యక్తం చేస్తుంది. "మంచి సమయానికొచ్చారు. మీబిడ్డ 'మదనరేఖ'ను దీవించి, స్వయంగా ఒడిలో బెట్టుకొని ముకుర వీక్షణం చేయించండి! వదనరేఖా వైభవమున చంద్రుని దొరగూర్చుకొన్న ఈ మదనరేఖకి ధూర్త దేవత అయిన తండ్రి పోలిక వచ్చింది. అదృష్టవంతురాలవుతుంది అన్నారు సాముద్రిక శాస్త్రవేత్తలు. ఈ సమయానికి మీరు రావడం నిజంగా దాని అదృష్టమే! తండ్రివి, గురువువి సజ్జనుడవు. క్రొత్త లంజల కాముకుడవు. ఉత్తముడవు" అంటుంది కామమంజరి. ప్రియునిపై ఆమెకు గల గాఢ గౌరవానురాగాలతోపాటు అతనిపై తన కోపంకూడ ఏకంగా వ్యక్తంచేసే ప్రౌఢమైన పాత్ర పోషణ విన్యాసంతో గాఢ భావ బంధం గల పద్యం (199).

మంచన తన బిడ్డ మదనరేఖని ఒడినిడుకొని ముకురవీక్షణం చేయించి, "సెట్టీ! బిడ్డ పసుపు కుంకుమకు ఒక వెండి నాణెం ఇయ్యి" అని ఇప్పిస్తాడు. మంచనకు సెట్టి చెలికాడే కాదు. Financier కూడాను.

తరవాత, కామమంజరి ప్రియుని దగ్గరజేరి చేసే ప్రసంగం (203) కూడా కామమంజరీ మనస్తత్వ మంజులంగా ఉంది. "ఎక్కడెక్కడకు వెళ్ళారు? ఎంద రతివలను వలపించారు? ఇన్నాళ్ళకు మళ్ళీ "పాయసం బొరగించిన పాతవట్టు" పై తలపు మళ్ళించాడా దైవం?" అంటుంది.

## శ్రీకాకుళపు తిరునాళ్ళలో వ్యభిచార విశృంఖలత

శ్రీకాకుళపు తిరునాళ్ళకు వెళ్ళానని చెప్పి, అక్కడి విశేషాలన్నీ వివరిస్తాడు మంచన. శ్రీకాకుళేశ్వరుని పుట్టుపూర్వోత్తరాలు చెపుతాడు, ఆ తెలుగురాయడు "జార చోర మహాధూర్త చక్రవర్తి,

దేవ వేశ్యా భుజంగుఁడు!" అని; తిరునాళ్ళ సమయంలో అక్కడసాగే విశృంఖల వ్యభిచారాలను శృంగార పరతంత్రులకు నిత్యానుసంధాన యోగ్యమైన ప్రగాఢ పాకంలో అభివర్ణిస్తాడు (208-212).

ఈ శ్రీకాకుళపు తిరుణాళ్ళ పద్యాలలో వ్యంగ్య హాస్య బంధురమైన సాంఘిక విమర్శ (205, 208, 212, 214) ఉన్నది. జుగుప్స కలిగించే ధూర్త శృంగారం (209-211) ఆ వ్యంగ్య విమర్శను పటుతరం చేస్తున్నది

ఈ పద్యాలు శృంగారపురుషులకు ఉద్వేగకారులయినా, కవి ఆశయం సాంఘిక విమర్శే అనిపిస్తుంది.

మరొక విషయం-శ్రీనాథుడు 'వల్లభాభ్యుదయం'లో శ్రీకాకుళపు తిరుణాళ్ళలో విటీ విటుల స్వైర విహారాలను చాలా పచ్చిగా వర్ణించినట్లు మానవల్లి కవిగారు తమ 'క్రీడాభిరామ' పీఠికలో తెలిపారు. దానిని క్రీడాభిరామకర్త అవహేళనాత్మకంగా అనుకరించాడని, ఆ విధంగా గోవిందశర్మలో శ్రీనాథ రసికతను వ్యంగ్యం చేశాడని భావించవచ్చు.

ఈ పద్యాలలో మధ్య మధ్య కొన్ని వచనాలకు (213-215) సందర్భౌచిత్యంలేదు. 218 గద్యానికి ముందు కొంత గ్రంథ పాతం ఉన్నట్టు కన్పిస్తుంది. కాని, వ్రాత ప్రతిలో ఇలాగే ఉన్నది.

అపైన ఏకాంతంగా కామమంజరి తన ప్రియునితో ఆదే నిష్ఠురోక్తులు, దానికి గోవిందశర్మ చెప్పే సమాధానం (216-217) శృంగార రసజ్ఞ మనోజ్ఞంగా ఉన్నయి.

## గరళ విద్యాధిరాజు

అక్కడ్ణుంచి, "కార్యాంతర వ్యాసంగంబున ఆర్యవాటికి" పోయి వస్తానని మంచన బయలు దేరుతాడు. దారిలో మిత్రులిద్దరూ మార్గం మధ్యలో 'నాగ సొరము' వాద్యం విని తదనుగుణంగా ఆడుతూన్న పాములను చూస్తారు. మంచన ఆ పాములాటను వర్ణించే

మన పురాణగాథలలోని భోగేంద్ర వైభవాన్ని కూడా ఒక సీసపద్యం (221) లో ఒడుపుగా ప్రస్తుతిస్తారు.

ఆ పైన, "అహితుండిక (పాముల నాడించువాడు) గరళ విద్యాధిరాజు" అయిన పాముల మెంగడి వేషాన్ని వర్ణించే మంచన పద్యం.(223)అత్యద్భుత స్వభావోక్తి రామణీయకము గలది. తరువాత అతడు నాగసారం ఊదేటప్పుడు చేసే అభినయాన్ని గూర్చిన పద్యం (224) ఇంకా ఒడుపైనది. పాముల మెంగడు నాగసారం ఏదో ఊదెయ్యటం కాదు. భోగులకు ఉత్తేజం కలిగించే 'నాగసింధు', 'వరాట' మొదలైన రాగాలు వివిధ తాళ గతులలో ఆవేశంతో వినిపిస్తున్నాడు. వాటిని గమనించి ప్రస్తుతించడంలో గోవిందశర్మ సంగీత శాస్త్ర పరిచయం, రసజ్ఞత వ్యక్తం అవుతున్నాయి.

## పొట్టేళ్ళ చటులాటోపాలు

అక్కణ్ణుంచి వాళ్ళు ముందుకు పోయి, ఒక మండపంవద్ద తూర్పునాటి గడిదు (గడకట్టి ఆడువాడు)పాడుతూ గుమ్మెట వాయిస్తూ ఆడుతూన్న ఆట చూస్తారు. ఆపైన ఇంకా ముందుకుపోయి పొట్టేళ్ళ పోరులో వాటి చటు లాటోపాలను వర్ణించటంలో మంచన కవితా కౌశలం కనిపిస్తుంది. మన దేవతలను, వేశ్యలను, విటులనే కాదు; పాములు, పొట్టేళ్ళు, కోళ్ళు మొదలగు వాటినికూడా అద్భుతంగా శ్రీనాథ కవితోద్ధతితో స్తోత్రం చేయగలడు. ఆ స్తోత్రాలు మన మహాకవులు చేసిన ప్రశస్త దేవతాస్తుతుల స్థాయిలో చేయగలడు. పోరాడి పోరాడి డిల్లవడి మూర్ఛిల్లిన ఆ మేష కంఠీరవాలను అతడు చేసిన స్తోత్రం (232) ప్రాచీన తెలుగు సాహిత్యంలో అపురూపమైన హాస్య పద్యంగా ఉదాహరింపబడగినది.

"హాహా! నృపాల సింహాసనాధిష్ఠాన రత్న కంబళ కాభిరామ రోమ!" అంటూ ప్రారంభమైన ఆ పద్యం "మేలుమేలు! గొఱ్ఱె మిండగీఁడ!' అనే సంబుద్ధితో ముగుస్తుంది. ఆ విట సార్వభౌముడికి గొఱ్ఱెలలో కూడా మిండగాని తనమే మెండుగా కనిపిస్తుంది.

## అద్భుత పరిహాసం

ఆపైన వారు చూపిన కోడి పందెపు వర్ణన కూడా అసదృశ స్వభావోక్తి సుభగంగా సాగి, హాస్య రసావధిని చూపించే ఈ కావ్యానికి మకుటాయమానమైన గొప్ప పద్యం (236)తో ముగుస్తుంది.

శౌర్య సాహసములతో పోరి సంగ్రామ రంగంలో మరణించిన వీరులకు స్వర్గ భోగములు, అక్కడ అప్సరలతో సంభోగము ప్రాప్తిస్తాయన్నది సుప్రసిద్ధ విశ్వాసం, కవి సమయం ఉంది గదా! ఆ సిద్ధాంతాన్ని కోడిపుంజులకు పట్టించి, లోకోత్తరమైన హాస్యం సాధిస్తాడు కవి. ఇంతకు పూర్వం, పల్నాటి వీరుల గాథలను వివరించే సందర్భంలో ఈ కవి ఆ వీరుల ఆత్మ వినాశక వీరావేశాలను మంచన ముఖతః పరిహసించాడు గదా! ఈ కోళ్ళు, గొర్రె పొట్టేళ్ళ పోరుల వర్ణనను దానితో సమన్వయించుకోవాలి. ఇక్కడ ఆ జగజెట్టి కోడి పుంజుల సమర పరాక్రమాన్ని అభివర్ణించే దీర్ఘ గద్య (235),దానికి ముందున్న గీతము ఉత్తమ రచనా సంవిధానము గలవి.

## పద్మినీజాతి వేశ్య - జోగి మిండడి జోస్యం

తరువాత వారు దక్షిణముఖంగా పోతుండగా మాధవశర్మ కూతురు మధుమావతీ దేవి మందిరం కన్పిస్తుంది. "చూశావా సెట్టీ! ఆమె దేవకన్య, పద్మినీ జాతి స్త్రీ" అని ఆమె అసదృశ సౌందర్యాన్ని అభివర్ణిస్తాడు మంచన.

ఆమె వద్దకు ఒక యోగి వచ్చి రోవట్టు (వేశ్య కిచ్చే శుల్కం) చెల్లించి ఆ రాత్రి ఆమెతో రమించి సంతసించి, మేడమీద గోడపైన ఒక తెలుగుపద్యం వ్రాసి పోయాడట. అందులో ఆమె పూర్వాపర జన్మల క్రమం వివరించాడు. ఆమె పూర్వం అలకాపురిలో అంగార వర్ముడనే గంధర్వుడి పుత్రిక. ఈమధుమావతి ఆ గంధర్వికి అపరావతారం. పై జన్మలో ఈమె దక్షారామంలో 'చిన్నిపోతి' అనే జగన్మోహినిగా జన్మించి, సదాశివునితో గలిసి, ఆ పై జన్మలో వేంగి మండలంలో ఒక చెంచుల కులంలో కడిమి కత్తులమ్మిగా పుడుతుంది-అని

ఆ పద్యం (242) సూచిస్తూంది. శ్రీనాథుడు తాను మెచ్చిన స్త్రీలను గురించి అతిశయోక్తులతో ప్రస్తుతించిన అనేక పద్యాలకు అవహేళనాత్మక అనుకృతి ఇది.

"ఆ మధుమావతి చెల్లెలు మదాలస మా మామ మీసాలప్పయ్య ద్వివేదుల కొడుకు శ్రీధరుడికి ప్రియురాలు. వాడూ ఇక్కడే ఉంటాడు రా పోదాం!" అని సెట్టిని లోపలికి తీసుకుపోతాడు మంచన.

వాళ్ళు ముగ్గురు లోపల ఎక్కడో 'గాజటోవరి (అద్దాల గది)లో చిరుబురులాడుకొంటూ ఎడమొగం పెడమొగాలుగా ఉండటం చూస్తాడు మంచన. (తాళపత్ర ప్రతిలో ఇక్కడ (244) కొంత గ్రంథ పాతం. సూచితం ఇతర ముద్రిత ప్రతులలో ఇది సూచితం కాలేదు.)

మీసాలప్పయ్యగారు అగ్రహారికుడు. ఆయన కుమారుడు భోగ పురుషుడై అగ్రహారాన్ని అమ్మి తెచ్చి మదాలసను భోగిస్తూంటాడు. ఇతడు హంసతూలికా తల్పంమీద నిద్రిస్తున్న మదాలసను, అర్ధరాత్రి వేళ మధుపాన మత్తయైన మధుమావతిని భోగించడంతో వారిలో వారికి కలతలు పుట్టినయి.

మధుమావతి ఆ కథంతా మంచనకు చెప్పుకొంటుంది. "నీకు చెల్లెళ్ళం కదా! మిబావమరది చేసిన దుష్టచేష్టలు చూశావా! పాడిపంతా లెరిగిన పెద్దవు, మాకు ప్రాయశ్చిత్తం విధించు," అని కోరుతుంది. మంచన విటజన ధర్మసూక్ష్మం చెప్పి వారిని ఓదారుస్తాడు.... "వార కాంతను తల్లి, దాసి, అప్ప, చెలియలు, కూతురు, దాద యని కేళికా గేహంబున బరిహరించుట విట ధర్మంబుగాదు....వావి లేదు లంజ వారి యంట!" అని విటధర్మ సూక్ష్మం వివరించి, వాటిని సమాధాన పరచి, వారి నతులందుకొని అక్కణ్ణించి కదులుతాడు. ఈ కథ మంచి రసవంతంగా సాగింది. మంచన చెప్పే జారధర్మం మాత్రం రోత పుట్టించి, అట్టి విశృంఖల విహారాలపై ఏవగింపు, వైముఖ్యం కల్పిస్తుంది (252, 253).

ఇక్కడ "కొడుకులు కూతులుం గలిగి" (256)అన్న చంపక

మొకటి సందర్భోచితి లేనిదిగా కనిపిస్తుంది. దీనికి ముందు వెనుకల ఏదైనా గ్రంథ పాఠం ఉన్నదేమో! ఉన్నట్టు వ్రాతప్రతిలోనూ సూచితం కాలేదు.

తరువాత సూర్యాస్తమయ వర్ణన అదీ విటభావ భావనోచితం గానే సాగుతుంది ఇక త్వరగా కామమంజరి ఇంటికి చేరుకోవాలి. కార్తాంతికుని (జ్యోతిష్కుని) శుభముహూర్తం సమీపిస్తుంది— అంటూ ముందుకు సాగుతారు. వారిలో కుహూశీ చషకంబు (అకు గిన్నె)లతో నారికేళ మధువుగ్రోలి, మత్తిల్లి పుష్పగంధికా నృత్యం చేస్తూన్న పల్లవాధరలను, మరొక చోట "సురపొన్న క్రీనీడ క్రీడా భరంబునఁ గన్నియలం గూడి కందుక క్రీడ యొనర్చుచున్న ఆట కత్తెల సోయగము"ను చూస్తారు. ఆ విధంగా "పంచకాంచన కందుక త్రయము"తో క్రీడిస్తున్న ఆ బాలల అంగ విన్యాసాలను అభివర్ణిస్తూ మరో పద్యం (258) విసురుతాడు మంచనశర్మ. ఇంక కొంతదూరం పోయేసరికి ఒక 'నట్టువని'కోడలు గోడమించి నిక్కి, తనవైపు చూస్తూండటం గమనించి, మంచన టిట్టిభయ్యకు చెపు తాడు - ఆమె తనకు పూర్వ పరిచిత అని; కామువు కారణంగా ఏపు సడలి ఉన్నదనీ (ప. 260).

తరువాత, దారిలో కనిపించిన ఒక రైతును చూపి, "మాఘ మాసం (చలినెల) పులిలాగ వచ్చి పడుతూన్న సమయంలో శాలువ అమ్మి, ఎద్దుని కొనుక్కొన్నాడీ రైతు. ఔన్లే! పొగలేని చలి కుంపట్లు, చెలి రొమ్ము లున్నాయిగా! లేకపోతే చలికి భయపడకుండా ఎలా ఉంటాడు రైతు?" అంటాడు. ఈ పద్యానికి (262) కూడా మూలం సప్తశతిలో ఉన్నది.

ఆపైన, అక్కలవాడలోని టక్కులాడుల మేని పసలను వివ రిస్తాడు మంచన,

తరవాత వేశ్యావాటినించి బయటపడి భైరవాలయ ద్వారం వద్దకి వచ్చేసరికి, అక్కడ వార విటసత్తములంతా చేరి, ఏదో పంచా యితీ నడిపిస్తూంటారు.

## XXXII

## మోసం చేసిన వేశ్యమాత

"ఏమిటి ధర్మచర్చ సాగిస్తున్నట్టున్నా?"రని మంచన విచారించగా వాళ్ళు చెపుతారు :

"ఈ ముసలి వేశ్య ముందుగా తన కూతుర్ని మోజుగా చూపించి, ఈ తుండీర ద్విజశ్రేష్ఠుడి (తమిళ బ్రాహ్మణోత్తముడి) వద్ద రోవట్టు (వేశ్యాశుల్కం) గుంజి, తరువాత ఆ పిల్లను ఉంచుకున్న ప్రియుణ్ణి రప్పించి,దాన్నివాడి శయ్యకు తార్చి,తన దాపి నలంకరించి, ఈ విప్రుడికి ఆతిథ్యం ఇవ్వడానికి పంపింది. పాప మీ వెర్రి బాపడు పొద్దున్నే లేచి, ఈ మోసం కనిపెట్టి తగూ పెడితే, ఈ ముసలి వగ్గు లక్ష్యపెట్టక పోయేసరికి, అతడు వచ్చి, తలవరుల (భటుల)కు ఫిర్యాదు చేశాడు. వారు వెళ్ళి ఈమెను పిలుచుకు వచ్చారు" అని.

"ఆదేమిటి బాబూ! కాకతి మహారాజులుంగారు సాయంగా కబురెట్టినా ఒల్లని మా పిల్లది మీకేమైనా మన సిచ్చిందా బాబుగారూ? మమ్మల్ని ఇల్లా అల్లరి పెట్టకండి అయ్యగారూ!"అని మొత్తుకుంటుంది.

కాని, అక్కడ చేరిన విట ధర్మవేత్త లందరూ ఆ జలభి చేసిన మోసాన్ని గుర్తించి, దానికి శిక్ష సూచించమని విటధర్మ విజ్ఞానియైన మంచనని అర్థిస్తారు. ఈ ముసలి ముండకు తల గొరిగించడమే తగిన శిక్ష అని తీర్పుచెప్పి, వేశ్యమాతల మోసాలకు తగిన ఇతర శిక్షలను కూడా వివరిస్తాడు (269-270). అనంతరం ఆ శృంగార యాత్రికు లిద్దరూ ఆ పెద్దలవద్ద సవినయంగా సెలవు తీసుకుని తృతీయ పురుషార్థ సాధన తత్పరులై వేశ్యావాటికి తరలిపోతారు.

ఇక్కడ సాయంకాలం, అంధకారం, తారకోదయం వర్ణనలు కవి చేసినవిగానే సాగుతాయి-వచనంలో (273).

## మంచన శివభక్తి తత్పరత

మంచన ఆ వేశ్య వాటికలో తాను కామమంజరిని పూర్వం కలిసిన వివిధ సంకేత స్థలాలను చూస్తూ, ఎదురైన కుంటెన కత్తె

లకి కనుసన్నలతో తన రాక ప్రకటిస్తూ, కాలోచితాలంకరణములతో కనిపించే బహు విప్రవాస విలాస కన్యారత్నాలు తప్ప, పురుషు లెక్కడా కనిపించని ఆ ప్రాంతాన ఉన్న ఒక్క తమ్మడిసాని మందిరంలో ఆగి, ఆ పూజారి వితంతువుచేత కామమంజరికి కబురు పెట్టి, వీరభద్రేశ్వరాలయం వెనక ఉన్న బొడ్డన (దిగుడు) బావివద్ద సాయంకాల సంధ్యానుష్ఠానం పూర్తి చేసుకుని, దేవతలందరిలో ఈశ్వరుని ప్రశస్తిని ప్రస్తుతించి, వీరభద్రేశ్వరుడికి మ్రొక్కుతాడు (274) ఇది అద్భుతమైన శివస్తోత్రం. అన్యదేవతలకు మొక్కినా పరమశివుడే గోవిందశర్మకు ఇష్టదేవత - శ్రీనాథుడికిలాగే

ఇక్కడినించి తాళపత్ర ప్రతి లేఖకుడే సూచించిన లుప్త భాగాలు (పద్య పాదాలు, వచనంలో పంక్తులు) నాలుగైదు చోట్ల ఉన్నాయి. వాటిని ఇంతవరకు ఎవ్వరూ పూరించలేదు అదృష్ట వశాత్తు మరొక సమగ్ర ప్రతి లభిస్తే తప్ప వాటిని పూరించడం సాధ్యం కాదు. అలాంటి చోట్ల మిగిలిన అన్ని ప్రతులలో ఉన్నట్టే ఇందులోను చుక్కలుపెట్టి సూచించాము.

ఆ తమ్మడి సాని ఇంటివద్ద, ప్రియురాలి రాకకోసం ఎదురు చూస్తూండగా మంచనకు మదన వేదన అధికం అవుతుంది. లోగడ కామమంజరితో తాను పొందిన అద్భుతానుభూతులను టిట్టిభసెట్టికి వివరిస్తాడు.

ఒక అర్ధరాత్రి కామమంజరి దట్టపు నీలి చేల కచ్చ బిగించి, దిండుగా గట్టిన గుబ్బ చన్కట్టున తోపు (ఎరుపు) టంగి తొడిగి, కర్ర కత్తి చేత పట్టుకుని, భటుని వేషంలో వచ్చి తనకు విస్మయం కలిగించిన చిత్ర సన్నివేశం (278) వివరిస్తాడు.

దాంతో-కామమంజరీ సందర్శనోత్కంఠతో 'అతి సంకులంబైన' చిత్తంతో ఉవ్విళ్లూరుతూన్న మంచన మదన తాపాన్ని మరింత రగిలించడానికి చంద్రుడు ఉదయిస్తాడు.

అక్కడ తమ్మడి (తంబళ్ళ) సాని పోయి చెప్పగానే, కామ

మంజరి పరమ హర్షోత్కర్షమున ప్రాణనాయకుడు వచ్చుట గని, వీరభద్రేశ్వరార్చనా నెపంతో బంగారు పళ్లెంలో గంధాక్షతలు, పచ్చ కప్పురపు పిడెము తీసుకుని; తెల్లని కొత్త చీరతో, పట్టు జరీ కంచు కంతో సవిలాసంగా రాకా చంద్రోదయానంద దేవతలా వస్తుంది. రాగానే గోవిందుని శ్రీపాదాలకు భయ భక్తి లజ్జలతో నమస్కరిస్తుంది.

గోవిందశర్మ అమితానందంతో "ఒడల పులకంబులు నారు వోయగ" ఆమెను సంభావించి అనునయిస్తాడు.

ముగింపు సొంపు

ఆ పూజరి వారి యింటి ముందు వెన్నెలలో కూమని, కట్టాణి ముత్తెం లాంటి ఆ తమ్మడిసాని కూతురును కూర్పు నేర్పు విచారించి, ఆ పిల్లని మంచన శర్మ తన వలపు చెలికాడైన టిట్టిభసెట్టికి గూర్చ డానికి నిశ్చయించాడు.

"సన్నపు టెలుంగునం బూజరి సానిని బిలిచి, కనక నిష్కంబుతోఁ గూడఁ గర్పూరంబు వీడియం బచ్చేడియ చేతిలోనం బెట్టి," ఆ పిల్ల సౌందర్యమును రసికజన హృద్యములైన రెండు పద్యాలలో (287-288) మెచ్చి, పసిడి టంకము (నాణెము) పరిరంభ పణంగా, 'నీ కూతుర్ని టిట్టిభునితో కూడింపు'మని, "కన్నెరికం బుడుప వేరే రెండు నొన్నాటంకంబులు కూడా ముట్ట చెపుతాము. చుట్టాల కెవరికీ ఈ విషయం పొక్కకుండా చూస్తాంలే!" అని చెప్పి ఒడబరుస్తారు.

అనంతరం, ఆ జార దంపతులు, చిక్కని వెన్నెలలు కాస్తూ, మన్మథోద్దీపనం చేస్తూన్న చంద్రునికి గొజ్జంగి నీటితో అర్ఘ్యమిచ్చి, పచ్చకర్పూరం పైకి జిమ్మి - మొక్కుతారు.

కథను అక్కడితో ఆపి-భరతవాక్యం చెప్పటం కవి అనల్ప శిల్ప నైపుణికి చిహ్నం.

## XXXV

## తెలుగుల తొలి నాటకం

నిన్న మొన్నటివరకూ-19 వ శతాబ్ది తృతీయ పాదంవరకూ-తెలుగులో నాటకం అన్నది లేదు. ఆధునిక ఆంధ్ర వాఙ్మయ యుగ కర్తగా సన్నుతిగన్న కందుకూరి వీరేశలింగం పంతులుగారి అభిజ్ఞాన శాకుంతలానువాదమే తొలి తెలుగు నాటకంగా చెప్పుకుంటున్నాం. అంతకు పూర్వం ప్రసిద్ధ సంస్కృత నాటకాలు అనువదించడానికి అయినా ఎందుచేతనో మన పూర్వ కవులు పూనుకోలేదు. సాహిత్య పోషకులైన ప్రభువులు నటులను, నాటక ప్రదర్శనలను ప్రోత్సహించే సంప్రదాయం తెలుగు దేశంలో లేకపోవటమే హేతువు అయి ఉండాలి.

తెలుగు కవులలో తొలిసారి దృశ్య కావ్య రచనకు పూనుకొన్న గౌరవం రావిపాటి త్రిపురాంతకదేవునిదే. ఈయన 14 వ శతాబ్దిలో, రెండవ ప్రతాపరుద్రుడు కాకతీయ మహా సామ్రాజ్యాన్ని పాలిస్తున్న కాలంలో-దశరూపకాల్లో ఒకటి అయిన 'వీథి' అనే దృశ్య కావ్య పద్ధతిలో 'ప్రేమాభిరామము' రచించాడు. అయితే తెలుగులో నాటక రచనా సంప్రదాయం లేకపోవడంవల్లనేమో, ఆయన దాన్ని సంస్కృతంలోనే రచించాడు. అయినా, కవి తెలుగు వాడు. పాత్రలు తెలుగువి. కథా రంగం ఆనాటి ఆంధ్ర మహా సామ్రాజ్య రాజధాని అయిన ఓరుగల్లు పట్టణం.

అయితే, ఆ 'ప్రేమాభిరామం' ఇప్పుడు దొరకటం లేదు. దొరికినది ఈ క్రీడాభిరామం. ప్రేమాభిరామాన్ని అనుసరించి దీన్ని రచించినట్లు క్రీడాభిరామ కవి చెప్పుకున్నాడు. "ఏ కవీంద్రుండు రచియించె నీ ప్రబంధ మనుచు మీరాన తిచ్చెదరైన వినుఁడు...." అంటూ దీనిని ప్రబంధంగానే పేర్కొన్నాడు-మొట్టమొదటి పద్యంలోనే. కనుక, ఆ సంస్కృత రూపకాన్ని 'అనుసరించి' తెలుగు కావ్యాల పద్ధతిలో కృతికర్త వంశ వర్ణనాదికంతో దీనిని పద్య గద్యాత్మక కావ్యంగానే సంతరించాడు. ఈ పద్య గద్యాలలో చాలా స్థలాల్లో పాత్రల సంభాషణలు కవి వివక్షిత వర్ణనలతోను, అభినయ సూచనలతోను కలిసిపోయి ఉండటం కనిపిస్తుంది. ఇది దృశ్యకావ్య

లక్షణం కాదు గద! ఆ 'ప్రేమాభిరామం' ఎలా ఉన్నదో; 'క్రీడాభిరామ' కర్త ఎంతవరకు స్వతంత్రించాడో 'ప్రేమాభిరామ' ప్రతి గాని, దానికి మఱింగంటి సింగరాచార్యులవారు చేసినట్టు చెప్పుకొన్న ద్విపదానువాదం గాని లభించినప్పుడుగాని తేలదు.

## ఆంధ్ర కవుల అనువాద కళా వైశారద్యం

ఆదినించి తెలుగు కవులు కావ్యానువాద కళలో సిద్ధహస్తులు. మూల కావ్యాలలో తెలుగు సొలుపుల నొప్పు పెట్టి, మూల కావ్యానికంటె రుచ్యములైన మౌలిక కావ్యాలుగా రూపొందించే అనువాద విధానం మనకు నన్నయగారి నాటినించీ పౌరసత్వంగా వస్తూంది. అదే పద్ధతిలో అనువదించడం వల్లనో, విశేషంగా స్వతంత్రించడంవల్ల కూడా నేమో క్రీడాభిరామ రచనలో మౌలిక రచనా రుచిరత పుష్కలంగా కనిపిస్తూంది. అతనికి పూర్వ కవులెవరూ (ఈ కావ్య కర్తగా కొందరు అనుమానిస్తున్న శ్రీనాథుడితో సహా) వాడని తెలుగు నుడికారపు సొడుపులను, జిలుగు తెలుగు పలుకుబడులను ఈతడు పుష్కలంగా వాడాడు. అనంతర కవులు పెద్దన, కృష్ణదేవ రాయలు, రామకృష్ణుడు మొదలైనవారు ఇతని పలుకుబడులను అనుకరించారు. బిల్హణీయం, అహల్యాసంక్రందనం, రాధికా సాంత్వనం, శశాంకవిజయం మొదలైన అనంతర శృంగారకావ్యాలన్నిటిలో క్రీడాభిరామ ప్రభావ ముద్ర కనిపిస్తూంది.

ఇంత ప్రశస్తమైన కావ్యం ఎందువల్లనో చాలా కాలం ఈ శతాబ్ది ప్రథమ దశకాంత పర్యంతం మరుగునపడి ఉండిపోయింది. 'ప్రేమాభిరామం' లాగానే 'క్రీడాభిరామం' కూడా కేవల నామమాత్రావశిష్టమై, అలభ్య కావ్య సంచయంలో ఒకటిగా స్మరింపబడుతూ ఉండేది. అలాంటి *రసవత్ కావ్యా లెన్నింటినో వెలుగులోకి

* భోజుని శృంగార ప్రకాశం, చతుర్భాణి, కుందమాల, భరతుని నాట్య శాస్త్రం మొదలైన అనేక సంస్కృత గ్రంథాలు; క్రీడాభిరామం, నన్నెచోడుని కుమార సంభవం, ప్రబంధమణిభూషణం, త్రిపురాంతకోదాహరణం, బద్దెన నీతి శాస్త్ర ముక్తావళి, శ్రీరంగ మాహాత్మ్యం వంటి తెలుగు కావ్యాలు వెలికి తీసి ప్రకటించా రాయన.

తెచ్చి, సంస్కృతాంధ్ర సాహిత్య సరస్వతులకు నష్ట భూషణ పునః ప్రాప్తికి తోడుపడి అసదృశ సారస్వత సేవ చేసిన మహనీయుడు కీ శే. మానవల్లి రామకృష్ణ కవిగారు తంజావూరు సరస్వతీ మహలు గ్రంథాలయంలో ఈ 'క్రీడాభిరామ' ప్రతిని గుర్తుపట్టి, ఎత్తి వ్రాసుకొని, సంస్కరించి, పరిష్కరించి 1909 లో తమ 'విస్మృతకవులు' ప్రచురణ పరంపరంలో ఒకటిగా ప్రకటించారు. ఆయన సుకృతం క్రీడాభిరామంతో పాటు చిరస్థాయి.

## ప్రేమాభిరామ కర్త

క్రీడాభిరామానికి మూలం అయిన ప్రేమాభిరామాన్ని సంస్కృతంలో రచించిన రావిపాటి త్రిపురాంతకదేవుడు 14 వ శతాబ్దికి చెందిన గొప్ప తెలుగు కవి; నన్నయ, తిక్కన, హుళక్కి భాస్కరాదులతో సమానుడని క్రీడాభిరామకర్త ఇతణ్ణి స్తుతించాడు. త్రిపురాంతకుడు తెలుగులో రచించిన త్రిపురాంతకోదాహరణం ఇప్పుడు లభిస్తూంది. అంబికా శతకం, మదన విజయం, తారావళి త్రిపురాంతకుని ఇతర కృతులు.

## వల్లభామాత్యుడు

క్రీడాభిరామకర్త వినుకొండ వల్లభరాయడు తన ఇష్టదైవం అయిన భైరవస్వామి సాక్షాత్కారం పొంది, "సిద్ధ సారస్వత శ్రీ వహించి"న వరప్రసాది. ఈయన పూర్వులు గుంటూరు సీమలోని వినుకొండ వాసులు. విజయనగర ప్రభువు రెండవ హరి హరరాయల కొలువులో ఈతని తండ్రి భాండాగార రక్షకుడు; వినుకొండకు మహాప్రధాని. వల్లభరాయడు కడప జిల్లాలోని మోపూరు గ్రామాధిపతి. మోపూరు భైరవాలయం గల క్షేత్రమని, ఈతడు భైరవస్వామి భక్తుడని క్రీడాభిరామం చిట్టచివరి పద్యం (294) సూచిస్తూంది. ఇతడు 15 వ శతాబ్ది ప్రథమార్ధంలో ఉన్నవాడని చరిత్రకారులు తేల్చారు. 1430 ప్రాంతంలో ఈ గ్రంథరచన జరిగి ఉండవచ్చు అని

పెద్దలు చేస్తూన్న సూచన. ఇతడు శ్రీనాథుడికి సమకాలికుడు. ఆయన కన్న చిన్నవాడు. కవిసార్వభౌమ కవితా ప్రభావితుడు.

శ్రీనాథుని సమకాలికుడై, ఆయన కవితోద్ధతిచే ప్రభావితుడైన వల్లభరాయడు క్రీడాభిరామంలో శ్రీనాథుణ్ణి ఎక్కడా స్మరింపక పోవడానికి కారణం గోవిందశర్మ పాత్ర నీతడు శ్రీనాథునికి వ్యంగ్యానురూప చిత్రణం(caricature) గా రూపొందించడమే అని నా భావన.

## ఎవరు కావ్యకర్త?

శ్రీనాథుని వీథి నాటకములోని పద్యాలంటూ రెండు పద్యాలు (కందుకకేళి-82. కుసుమం బెట్టిన-86) అప్పకవీయంలో కనబడుతూండటంతో, మన పండితులు కొందరికి ఇది శ్రీనాథుని రచన అయి ఉండవచ్చునని తోచింది. శ్రీనాథుని ఇతర కావ్యాలలో కనిపించే కొన్ని పద్యపాదాలు, పదబంధాలు, భావ విన్యాసాలు కూడా ఇందులో కనిపించేసరికి, అందులో శ్రీనాథ కవితాభిమానం ఎక్కువగా ఉన్న వారు ఇది శ్రీనాథ కర్తృకమే అని గట్టిగా వాదించడం ఆరంభించారు. మరికొందరు వారి అభిప్రాయాన్ని ఖండించి, ఇది వల్లభరాయని రచనే అన్నారు. ఇంకా కొందరు ఇది వల్లభరాయని రచనే, కాని శ్రీనాథుడాతనికి కొంత సాయపడి ఉండవచ్చు అన్నారు. ఈ వాదోపవాదాలలో ఎక్కువ పరిశ్రమచేసిన పెద్దలు కొందరి అభిప్రాయాలు సంగ్రహంగా ఈ పీఠిక చివర ఉదాహరిస్తున్నాము.

కొన్ని భావాలు, పదబంధాలు, పద్యపాదాలు, భావవిన్యాసాలు, కొన్ని పద్యాలు కూడా భిన్న కవులలో కనిపించడం మన తెలుగు కవితకు కొత్తకాదు. స్వతంత్ర కావ్య పద్ధతికి ఒరవడి పెట్టిన ఆంధ్ర కవితా పితామహుడే శ్రీనాథాది తత్పూర్వ కవుల పదబంధాలను భావాలను పద్య విన్యాసాలను విశేషంగా మనుచరిత్రలో వాడుకున్నాడు. శ్రీనాథ కవి సార్వభౌముడు కూడా తత్పూర్వకవుల, ముఖ్యంగా సంస్కృత కవుల భావాలను, పదబంధాలను, పద్య పాదాలను విశేషంగా వాడుకొన్నాడు. ఇది పండితులందరికీ సుపరిచితం. మరి ఇదే కారణంతో మరే సాక్ష్యం లేకుండా క్రీడాభిరామం శ్రీనాథ రచన-అని

నిర్ణయం చేస్తాం అనడం సాహసం. శ్రీనాథుడు తన కావ్యాలలో ఎక్కడా వాడని తత్సమ దేశ్య పదాలు, పద బంధాలు, నుడికారపు బొడుపులు, క్రీడాభిరామంలో విశేషంగా కన్పిస్తున్నాయి. ఇవి శబ్ద రత్నాకరంలోకి ఎక్కలేదు. క్రీడాభిరామ కర్తకు పూర్వులెవరూ ఈ ప్రయోగాలు చేసి ఉండక పోవడమూ, బహుజనపల్లి సీతారామా చార్యులువారు ఆ నిఘంటువు సంకలనంచేసే నాటికి క్రీడాభిరామం బయటపడక పోవటమూ ఇందుకు కారణాలు. ఆ శబ్దాలను శ్రీనాథుడు తన కావ్యాలలో ఎక్కడ వాడి ఉన్నా అవన్నీ శబ్దరత్నాకరంలోకి ఎక్కి ఉండేవి. ఈదృష్టితో క్రీడాభిరామంలోవి కొన్ని శబ్దాలను ఏరి పెట్టు కొన్నాను. నిజానికి ఇది శ్రీనాథ కర్తృకం కాదనడానికి ఈ ఒక్క సాక్ష్యం చాలు.

## శ్రీనాథ పద ప్రయోగ కోశ సాక్ష్యం

ఇటీవల ఆంధ్ర సాహిత్య అకాడెమీవారు "శ్రీనాథ పద ప్రయోగ కోశము" ప్రచురించారని విని, ఆ సంపుటాలను సంపా దించుకొని, ఈ శబ్దాలు శ్రీనాథుని కావ్యాలలో ఎక్కడైనా ఉన్నట్టు సూచిస్తున్నయ్యా అని ఆ సంపుటాలను శోధించాను. వారు క్రీడాభి రామం శ్రీనాథ కృతంగానే గ్రహించి, అందులోని పదాలను కూడా ఆ సూచికలో చేర్చారు. ఈ శబ్దాలన్నీ శ్రీనాథుని ఇతర కావ్యాలలో లేవని శ్రీనాథ పదప్రయోగ సూచిక కూడా తెలుపుతూంది అట్టి కొన్ని విశిష్ట ప్రయోగాలు:

| పద్యము నెం. | | పద్యము నెం. | |
|---|---|---|---|
| 22,102 | ములికినాడు | ,, | సంది |
| 17 | రైరాజు | 46 | తోపురెంటము |
| 214 | మాచకమ్మ | 51 | మాఁగిలి |
| 42 | జటిగొన్న | 52 | వలతీరు |
| ,, | లంగ | 54 | ధర్మదార |
| 45 | ఇరుచంబడు | ,, | తేపాడి |

| | | | |
|---|---|---|---|
| 62 | త్రస్తరించు | 128 | గవడపేరు |
| 68 | పదనిచ్చి | 129 | షట్టుఁబాప |
| 69 | కటకారుఁడు | 131 | జనంగమ |
| 75 | పటితాళించు | 136 | ఉరుమ |
| 80 | సజ్జికము | 147 | రంపిల్లు |
| 81 | నిర్యానము | 159 | బాఁడు, తేఁడు |
| 86 | అప్పనము | 168 | బరిపోతు (హద్దు మీరి వర్తించు) |
| 88 | నోవు | | |
| 95 | దిప్పరించు | 180 | ఎఱుంగవయ్యెదవె |
| 101 | బలితము | 206 | షల్లపిలిన |
| ,, | విజ్జోడుపడు | 226 | నల్ల, (ఆశ్చర్య వాచకము) |
| ,, | మొరవంక | | |
| 112 | గనప | 231 | ఆస్కందము |
| 115 | ఆలువరి | 240 | రోవట్టు |
| 122 | జనపపెద్దలు | 262 | సైరికుఁడు |
| 125 | త్రికూటి | 288 | దొరసెము |

ఇలాంటి ప్రయోగాలు క్రీడాభిరామంలో ఎన్నో కనిపిస్తున్నాయి. ఇవి వాటిలో కొన్ని మాత్రమే. క్రీడాభిరామ కర్త శ్రీనాథుడు కాదు అనడానికి ఇవి చాలు అనుకొంటాను. ఈ ప్రయోగాలలో, పదాలలో కొన్ని క్రీడాభిరామకర్తకు చాలా ఇష్టమైనవి. వాటిని అనేక పర్యాయాలు వాడాడు. అట్టి ఇష్టం శ్రీనాథుని రచనలయందు కనిపించదు

నా శ్రీనాథ సాహిత్య పరిచయంలాగే, శ్రీనాథ పదప్రయోగ సూచిక కూడా సమగ్రం కానట్టు కనిపిస్తుంది. శ్రీనాథుని పదప్రయోగ సూచికా కర్తలు క్రీడాభిరామాన్ని కూడా శ్రీనాథ రచనగా గ్రహిం

చారు. అయినా, క్రీడాభిరామంలోని కొన్ని పదాలు దానిలోకి ఎక్క లేదు. కనుక, ఇక్కడ సూచించిన పదాలలో ఏవైనా ఒకటి రెండు పదాలు శ్రీనాథుని కావ్యాలలో ఏ మూలైనా గుర్తించి చూపించగల సహృదయులకు వినమితుడనై సవరించుకొంటాను.

శ్రీనాథుని రచనా విధానానికి స్పష్టంగా భిన్నంగా కనిపించే కొన్ని మచ్చుతునకలు :

(1) సీ. అదె నీ కుమారిత మదన రేఖా కన్య
వదన రేఖా వైభవమునఁ జంద్రు
దొర గూర్చి కొన్నది...... (ప. 199)

శ్రీనాథు డిట్టి గునుగు సీసాలు వ్రాయడు గద!

(2) శా. కించిన్న్యూంచ దుదంచిత క్షమముగాఁ
గ్రీడించెదర్భ్యాదుమా (ప. 258)

ఇట్టి సంధులు శ్రీనాథుడు చేయడు.

(3) గీ. ....చంద్రమామ
కొండనాలికయగు నొక కొమలి పేకు (ప, 176)
కొండనాలిక, కొమలి - యిట్టి పదాలు శ్రీనాథుడు వాడడు.
''ఎచ్చోట ముచ్చిచ్చు నేడేపి నాల్కలు
కొండనాల్కల దాఁకఁ గోఁతవడియె'' (భీమ. 3-37)

'నాలిక' స్వతంత్రులు తప్ప వాడరు. ఇలాంటి అశ్రీనాథ ప్రౌఢ ప్రయోగాలు క్రీడాభిరామం నిండా తామరతంపరగా ఉన్నాయి.

పారడీ - కారికేచరు

త్రిపురాంతకదేవుడు ప్రేమాభిరామంలో ఏమి వ్రాశాడో తెలియదు. క్రీడాభిరామ కర్త విశేషంగా స్వతంత్రించాడని అనుకో దానికి ఆధారాలు ప్రస్ఫుటంగా కన్పిస్తున్నాయి. లేకపోతే - త్రిపురాం

తకదేవుడి తరువాతివాడైన శ్రీనాథుని రచనలలోని పద్యభాగాలు, విశిష్ట ప్రయోగాలు ఇందులోకి ఎక్కడం సాధ్యం కాదు. లోగడ చెప్పినట్టు, శ్రీనాథుని పద్యాలను, పదబంధాలను ఇతడు హాస్యానుకరణం (Parody) చేయడం సాధ్యంకాదు. శ్రీనాథ సాహిత్యం అంటే వల్లభామాత్యుడికి ఎంతో ఆసక్తి ఉండటంవల్లనే ఆయన కవిత్వాన్ని ఈయన (Parody) చేశాడు. ప్రఖ్యాత కవుల ప్రసిద్ధ రచనలనే 'పారడీ' చేయడానికి ఎంచుకొనటం పరిపాటి.

అంతేకాదు. శ్రీనాథుని అతిశయ శృంగార రసికత అందరెరిగినదే. అందుచేత గోవింద మంచనశర్మ పాత్రను ప్రేమాభిరామకర్త ఏవిధంగా మలచినా, ఆ పాత్రను శ్రీనాథుడికి వ్యంగ్యరూప చిత్రం (Caricature)గా రూపొందించడం కూడా క్రీడాభిరామకర్త లక్ష్యం. వల్లభాభ్యుదయంలో శ్రీనాథుడు శ్రీకాకుళపు తిరునాళ్ళలోని వ్యభిచారాలను, పల్నాటి వీరగాథలను, కోడిపందాలను వర్ణించే సందర్భంలో ఈ వ్యంగ్య చిత్రణ స్ఫురిస్తుంది.

శ్రీనాథునివలెనే గోవిందశర్మ నైష్ఠిక వేష భాషలు గలవాడు. బహు విద్యా పాండిత్యం గలవాడు ఎక్కడికి పోయినా ఎల్లరి దృష్టులూ ఆకట్టుకొనగల స్ఫురద్రూపి. వచోవైయాత్యం గలవాడు. ప్రౌఢ కవి. పేరు విష్ణువుదైనా శివభక్తి తత్పరుడు (214). శృంగార భోగ ప్రియుడు. విటసార్వభౌముడు. అతడికి తిప్పయ్యసెట్టిలాగే, ఇతడికి టిట్టిభసెట్టి పెట్టుబడిపెట్టే (Financier) అనుగు చెలికాడు. అతడు చాలాచోట్ల శ్రీనాథ ప్రౌఢ పదబంధాలను వాడటం ఈ విషయాన్నే వ్యంగ్యం చేస్తూంది-అని నా ప్రత్యయం.

వల్లభామాత్యుడే క్రీడాభిరామకర్త-అని పలువురు పండిత పరిశోధకుల నిర్ణయం. కీ. శే. మానవల్లి కవిగారు శ్రీయుతులు బండారు తమ్మయ్య, వేమూరి విశ్వనాథశర్మ, తేకుమళ్ళ అచ్యుతరావు. చిలుకూరి పాపయ్య శాస్త్రి, కుందూరి ఈశ్వరదత్తు, బి. యన్. శాస్త్రి ప్రభృతులు ఈ వాదాన్ని సోపపత్తికంగా నిరూపించారు.

శ్రీనాథుడికి సమకాలికుడు, ఆయనకన్న కొంచెం చిన్నవాడు

అయిన వల్లభామాత్యుడు 1430 ప్రాంతమున క్రీడాభిరామ రచన చేసినట్టు కనిపిస్తుంది. అప్పటికి శ్రీనాథ కవిసార్వభౌముని కీర్తి, ఆయన రచనలూ ఆంధ్రదేశం నలుమూలల వ్యాపించినయి. ఆయన కవితా విదగ్ధతను, రాజనీతిజ్ఞతను, రసికతను గురించిన కథలు అనేకం విని ఉంటాడు వల్లభామాత్యుఁడు. క్రీడాభిరామ రచనా కాలంలో ఆ శ్రీనాథుని యశోమూర్తే ఆయన ఎదుట నిలబడి, అడుగడుగున శ్రీనాథుణ్ణి స్ఫురింపజేసే విధంగా గోవిందశర్మ పాత్ర చిత్రణను నడిపించి ఉంటుంది.

## కొన్ని వ్యంగ్యానుకరణలు

"జార చోరాది ధూర్త విహార భూమి" అని శ్రీనాథుడు నైషధంలో (7-55) లోభుని గుణంగా చెప్పాడు. దాన్ని కొంచెం మార్చి, శ్రీకాకుళంలోని దేవతాధీశ్వరుడికి అంటగట్టాడు గోవింద శర్మ. అలాగే "దేవ వేశ్యా భుజంగుఁడు" అని శ్రీనాథుడు దక్షారామ భీమేశ్వరుని ప్రస్తుతిస్తే, ఇతడా విశేషణాన్ని శ్రీకాకుళాంధ్రదేవుడికి తగిలించాడు.

దక్షారామ భీమేశ్వర మహిమ వర్ణిస్తూ శ్రీనాథుడు "సంతతము దేవవేశ్యా భుజంగుఁడు" (భీమ. 2-13) అనే ఒక విశేషణాన్ని జోడిస్తాడు. తనకు ఇష్టదైవమైన భీమేశ్వరుణ్ణి కూడా 'వేశ్యా భుజంగుడు'గా అభివర్ణిస్తేగాని ఆ రసిక సార్వభౌముడికి తృప్తిలేదు.

ఆ విశేషణాన్ని గోవిందశర్మచేత శ్రీకాకుళాధీశుడికి ప్రయోగింప జేశాడు వల్లభుడు.

గోవిందశర్మ అక్కడితో ఆగడు. పొట్టేళ్ళను, కోళ్ళను కూడా విటులుగాను, కాబోయే దేవ వేశ్యాభుజంగులుగాను వర్ణింపజేసి, మంచన పాత్రను శ్రీనాథుడికి అద్భుత వ్యంగ్యానురూప చిత్రంగా రూపొందించాడు

ఇక వల్లభుని శ్రీనాథ రచనా హాస్యానుకరణ ఇంకా చాలా చోట్ల కనిపిస్తుంది. వాటిని శ్రీనాథ రసజ్ఞులు సులభంగా గుర్తు పట్టగలరు. మచ్చుకి మరి ఒకటి రెండు:

'అచ్చ వెన్నెల చాయ నవఘటింపఁగఁజాలు
నిద్దంపు వెలిపట్టు రవిక గట్టి (శృం. నై. 6-22)

ఈ పద్యం శృంగార నైషధంలో సరస్వతీదేవి నలుడికి చింతామణీ మంత్ర ముపదేశించి, ఆ మంత్రసిద్ధుడు తనను తలచు కొన్నప్పుడు - తాను అతనికి ఏవిధంగా దర్శన మిచ్చేది వివరించే ఘట్టంలోది.

ఈ బ్రాహ్మీమూర్తి స్వస్వరూప వర్ణనం మనోహరంగా ఉదాత్తంగా ఉంది. ఆ పవిత్ర వర్ణనలోని పదాలను మంచన అక్కల ఆరాధనలో నాట్యం చేస్తూన్న ఒక బాలికను గూర్చిన అసభ్యవర్ణనలో చొప్పించాడు:

"నిద్దంపు వెలిపట్టు నెఱిక తూలిన యప్డు
తొడల మించులు వెలిఁ దొంగలింప" (క్రీ. 137)

మరొకటి:

గన్నేరు పూఁజాయఁ గనుపట్టు జిలుగైన
నలిల కాషాయ వస్త్రంబు గట్టి" (శృం. నై. 8-103)

పూజా గృహానికి పోతూన్న నిషధేశుని వేష వర్ణన ఇది.

దీనిని కొంచెం మార్చి—

"గన్నేరుఁ బూఁజాయ కరమొప్పు నీర్కావి
మడుగు దోవతి పింజె విడిచికట్టి" (ప. 42)

వేశ్యా సంగమార్థియై పోతూన్న గోవిందశర్మకు అదే అలంకారం కూరుస్తాడు వల్లభుడు.

ఆ పద్యంలోనే -

"గొజ్జంగి పూనీరు కులికి మేదించిన
గంగమట్టి లలాటకమునఁ దీర్చి"

అన్న గోవిందశర్మ వేష వర్ణన -

కాశీఖండం (3-119) లో విష్ణు సారూప్యం పొందిన భక్తుని వర్ణనలోని—

"గొజ్జంగి పూనీరు కులికి మేదించిన
కమ్మ కస్తురి మేనఁ గలయ నలఁది"

అన్న అభివర్ణనకు వ్యంగ్యానుకరణం (Parody).

ఇలాగే.—

కసటువోఁ దెలిసీటఁ గడిగి యీటార్చిన
సలిల కాషాయ వల్కలము గట్టి" (హరవి. 7-111)

అంటూ అర్జునుడు మాధ్యాహ్నిక శివార్చనకై సన్నద్ధుడవుతూన్న సందర్భంలోని పదబంధాన్ని తెచ్చి—

"కసటు వోవఁగఁ దోమి కడిగి బోరగిలంగఁ
బెట్టిన తామ్రంపు బిందెవోలె" (ప-80)

నుసరభేత్తను మందు వాడిన వెంటనే - తరుణీ మర్మాంగ శోభను వెల్లడించడానికి వాడాడు.

ఈ విధంగా శ్రీనాథుడు ఉత్తమమైన స్థానాల్లో వాడిన పదబంధాలను, వాటికి వ్యతిరిక్తమైన సన్నివేశ సందర్భాలలో వల్లభుడు వాడిన చోట్లు ఈ పుస్తకంలో కోకొల్లలు.

క్రీడాభిరామ కథా సంగ్రహంలో ఇలాంటి వాటిని మరి కొన్నిటిని వివరించాను.

## కొన్ని సంశయాలు

ఈ కావ్యం అంతా క్షుణ్ణంగా చదివినవారికి కొన్ని సందేహాలు కలుగుతాయి. గోవింద మంచన శర్మకి ఓరుగల్లు నగరమంతా కొట్టిన పిండి అన్నది బహు సన్నివేశాలలో కనిపిస్తుంది. మహారాజ భోగిని మాచల్దేవి మహాభవనము ముందు మాత్రం కేవలం ప్రథమతః నగరానికి వచ్చిన పరదేశిలాగ కనిపిస్తాడు.

అలాగే, కామమంజరి అతని ప్రియురాలు. ఆమెతో చిర కాలం భోగించినవాడు ఆమెకు అతనివల్ల కలిగిన మదనరేఖ ఈడేరి ముకురవీక్ష మహోత్సవం చేసుకొనే దశకు వచ్చింది. కామమంజరి వేశ్య. ఆనాటి పట్టపగలు ఆమె ఇంటికి బాహాటంగా వెళ్ళి వస్తాడు. అతడామెకు రహస్యంగా కబురంపి ఇతర సంకేత స్థలాల్లో గుప్తంగా ఎందుకు కలువవలసి వచ్చినట్టు?

ఇలాగే కర్ణాటి, కర్ణాటాంగనల భిన్న వర్ణన, పాము లాట, పాముల మెంగడి నైపుణ్యం - భిన్నంగా వర్ణించటం.

ఇటువంటి సందేహాలు, చిన్న చిన్నవి ఇంకా ఉన్నాయి మనకు దొరికిన తాళపత్ర ప్రతి పరిశుద్ధమైనది కాదు. సమగ్రమైనదీ కాదు. మరొక సమగ్ర ప్రతి అయినా, ప్రేమాభిరామ పూర్ణ ప్రతి అయినా దొరికినప్పుడుగాని ఈ సంశయాలు తీరవు.

## చెట్ట పుస్తకమా?

మన పండితులు కొందరు ఇది చెట్టపుస్తకం అన్నారు. అనగా చెడ్డది, దుష్టమైనది, చదువరానిది అని. ఇదే నిజమైతే ఈ చెట్ట పుస్తకం కర్తృత్వాదికాన్ని గురించి ఇన్ని సిద్ధాంత రాద్ధాంతా లెందుకు? 295 పద్య గద్యలు గల ఈ చిన్ని పుస్తకాన్ని కవిసార్వ భౌముడైన శ్రీనాథుడే రచించాడని దృఢమైన ఆధారము ఏదీ లేకుండా సిద్ధాంతీకరించబూనడం దేనికి?

ఈ కావ్యంలో శృంగారం కొన్నిచోట్ల ఉగ్రగా ఉన్న మాట వాస్తవం. మన శిష్టకావ్యా లెన్నింటిలోనో దీనికి దీటైన శృంగార పాకం కనపడుతూన్న మాట ఈ పండితు లెరుగరా? క్రీడాభిరామం లోని విశిష్టతే ఇందలి పండితులు దీనిని అనితర శ్రద్ధతో చదివి, వాదోపవాదాలకు తలపడటానికి వాస్తవ కారణం అని నా మనని. కావ్యానికి ఘనత అందులోని విషయాన్ని బట్టి రాదు. రచనా సౌష్ఠ వాన్ని బట్టి గలుగుతుంది. 'క్రీడాభిరామ రచన గాఢత, ప్రౌఢిమ గలది. శ్రీనాథుని ధారావాహికమైన పద్య రచన కన్న భిన్నమైన చిక్కదనం,

భావ పౌష్కల్యం గలవి. చలిని గురించిన పద్యాలలోను వివిధ దృశ్యా లను వర్ణించే సందర్భాలలోను, పచ్చి శృంగార పద్యాల్లోనూ కూడా ఈ భావ బంధురత కనిపిస్తుంది.

ఈ ఎమెస్కో ప్రచురణ ప్రత్యేకతలు

ఆ నాటికి లభించిన తాళపత్ర ప్రతులను పరిశీలించి యుక్త మైన పాఠాలు స్వీకరించి - మన ప్రాచీన కావ్యాల తొలి ముద్రణలు రూపొందించారు పూర్వపండితులు ఆ తరువాత భిన్న భిన్న ప్రచురణ సంస్థలు ఈ కావ్యాలను పునః పునః ప్రచురించటంతో క్రమంగా కొన్ని పాఠాలు మారిపోయినయి. ఆ విధంగా భిన్న భిన్న ముద్రణల్లో వేరు వేరు పాఠాలు సిద్ధమయినయి.

ఎమెస్కో సంప్రదాయ సాహితి ప్రచురణలు ప్రారంభించే సమయంలో ఈ విషయం చర్చించి, మరల ఈ కావ్యాలను ప్రామా ణికమైన ప్రాచీన తాళపత్ర ప్రతులతో సరిచూసి, సముచితములైన మూల ప్రతి పాఠాలను పునరుద్ధరించాలని నిశ్చయించాం.

మద్రాసు ఓరియంటల్ మాన్యుస్క్రిప్టు లైబ్రరీ (ప్రాచ్య లిఖిత గ్రంథాలయము)లో లభిస్తున్న లిఖిత ప్రతులు ఇందుకు ఉపక రిస్తూ వచ్చినయి ఆ పరంపరలోని 'ఎమెస్కో' శృంగార కావ్య ప్రచురణలలో క్రీడాభిరామం కూడా ఎన్నిక అయింది. క్రీడాభిరామం పండితుల తీవ్ర వాదోపవాదాలకు లోనైన గ్రంథం. దీనికి అనేక ముద్రణలు వెలువడినయి. వాటిలో భిన్న భిన్న పాఠాలు, అధస్సూచి కలలో కొన్ని పాఠాంతరాలు కనిపిస్తున్నయి. కాని, ఈ కావ్యానికి లభ్యం అయిన ప్రాచీన తాళపత్ర ప్రతి మాత్రం ఒక్కటే. అందరికీ అదే ఆధారమైనప్పుడు ఇన్ని భిన్న పాఠములకు ఆస్కార మెక్క డిది? భిన్న పాఠాలన్నీ భిన్న భిన్న పరిష్కర్తల ఉపజ్ఞా జన్యములే ఆయివుండాలి, వీటిలో ఏది, మూల ప్రతికి ఎంత సన్నిహితమైనదో తేల్చి చూపటానికి మూల ప్రతులతో సరి చూడటం ఎమెస్కో కావ్యాల ఆనవాయితీ గదా! అందువల్ల తంజావూరు పోయి సరస్వతీ

మహలు గ్రంథాలయంలోని తాళపత్ర ప్రతిని సంప్రదించుట తప్పని సరి అయింది.

క్రీడాభిరామం శ్రీనాథ కృతమే అని నిరూపించడానికి ప్రబల కృషి చేసిన కీ. శే. వేటూరి ప్రభాకర శాస్త్రిగారు తాము ప్రచురించిన క్రీడాభిరామ పీఠికలో ఆ తంజావూరు తాళపత్ర ప్రతి ఆనాటి స్థితిని అభివర్ణిస్తూ ఇలా వ్రాశారు:

"తునాతునకలై దురుద్ధరమై ఉన్న తంజావూరి తాళపత్ర ప్రతిని బరిశోధించి ఈ గ్రంథ పాఠములను నేను జక్కఁబరచుకొని యుంటిని. నా దగ్గర నున్న పాఠములు పోయెనేని ఇక ఈ గ్రంథమును సరిపఱచుట శక్యము కాదనియే నా నమ్మకము. తంజావూరు తాళపత్ర ప్రతి ముక్కలు ముక్కలై మిక్కిలి రూపు చెడి యున్నది గాన,దానిబట్టి ఇకఁ దత్తత్పాఠముల నుద్ధరింపఁగుదురదు."

(వేటూరివారి ప్రతి; తృతీయ ముద్రణము; పుట-11)

ఆ సంశయంతోనే నేను ఆ గ్రంథాలయాధికారులకు వ్రాసి, ఆ తాళపత్ర ప్రతి ప్రస్తుత స్థితి తెలుసుకొనగా, వారి సమాధానము కొంత ఆశాజనకంగా కనిపించింది. ఆపైన ఎమెస్కో పనుపున నేను తంజావూరు వెళ్ళి, ఆ ప్రతిని తీయించి చూశాను. అమితానందంతోపాటు ఆత్యాశ్చర్యం కలిగింది; - ప్రభాకరులు అలా ఎందుకు అభివర్ణించారా అని.

## మూల ప్రతి ప్రస్తుత స్థితి

ఈ తాళపత్ర ప్రతి తంజావూరును పాలించిన విద్వత్పోషక మహాప్రభువు శరభోజి మహారాజు వద్ద (రెండవ శివాజీ రాజువద్ద కూడా) ఆంతరంగిక మంత్రిగాను, గ్రంథాలయ పర్యవేక్షకుడుగాను పనిచేయుచుండిన మధ్యస్థ సేనాధురంధర రాజశ్రీ పండిత (రామయ్య) వరాహప్పయ్య దీక్షితులు (1795-1869) వారి ఆజ్ఞచే నకలు వ్రాసి తంజావూరు సరస్వతీ మహలు గ్రంథాలయములో భద్ర పరచబడినట్టు తెలుస్తున్నది.

"నళనామ సంవత్సర చైత్రశుద్ధపాడ్యమి భానువారం" (సుమారు 116 సం క్రితం బహుశః 1856 లో) లిఖితమైనట్లు ఈ వ్రాత ప్రతి పై ఆకు (Fly leaf) పైన ఆ ప్రతి విలేఖకుడు పేర్కొన్నాడు. ఈ 32 ఆకుల ప్రతి (డి. నం. 512) మిక్కిలి ప్రాచీనంగా కనిపిస్తున్నా ఎక్కువ శిథిలావస్థలో లేదు. 'నాతి శిథిలము' అని అభివర్ణింపదగినది. కొన్ని ఆకులలో సుమారు ఏడెనిమిది చోట్ల క్రిమి దష్టములైన ఒకటి రెండక్షరాలు అస్పష్టంగా కనిపిస్తున్నాయి. 5, 27, 29, 30 ఆకులలో గ్రంథపాతాన్ని సూచిస్తూ కొన్ని పదాలు, పాదాలు పట్టే స్థలం వదిలి రాసిన చోట్లు ఉన్నాయి. ఈ స్థలాలలో మానవల్లి వారి ప్రతి మొదలు మిగిలిన అన్ని ముద్రణములలోను చుక్కలు పెట్టి గ్రంథపాతాలు సూచించారు. చివరి ఆకులు మూడు మాత్రం కుడి చివరి ప్రక్క మూడింట ఒకవంతు త్రుటితమై నష్టమైనయి. మానవల్లివారు ఆ ప్రతిని చూసిన నాటికీ నేటికీ నడుమ, ఆ చివరి మూడు ఆకులలోని చివరి భాగాలు మాత్రమే నష్టమైనవి.

ఆ నాటి వ్రాతకు మచ్చు

గీ. అతం డెంతంటివాండు ప్రెమాభిరామ
మనగ నెంతటి యది దాని ననుసరించ్చి
విధి యను రూపక మది వెరపు లెక
తిప్పవిభువల్లభుండెట్లు తెనుంగ్గు జెసె.

ఆ తంజావూరు ప్రతిలో ఉన్నది ఉన్నట్టు నకలు ప్రతి తయారు చేయించుకొని స్వయంగా పోలిచి చూసుకొని తీసుకు వచ్చాను. దాని ననుసరించి, వివిధ ముద్రిత ప్రతులతో పోలిచి చూసి పరిష్కృతమైనది ఈ - ఎమెస్కో ముద్రణ. ఈ ప్రతి పరిష్కరణాదులలో మాకు విశేషంగా సాయపడిన మిత్రులు విద్వాన్ తీర్థం శ్రీధరమూర్తిగారికి మా ధన్యవాదములు. పరిష్కరణ, పాఠ విర్ణయములను గూర్చిన వివరణ ఇందులో వేరుగా ఇచ్చాము.

## లఘుటీక

ఈ కావ్యంలో ఇప్పటికీ నిఘంటువుల కెక్కనివి ఎన్నో పదాలు కనిపిస్తున్నయి. వీటిలో కొన్ని పదాలకు వావిళ్ళవారి ముద్రణలో శ్రీ బండారు తమ్మయ్యగారు అర్థాలు ఆ ముద్రణ చివర లఘుటీకలో సూచించారు. కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు మరి కొన్ని పదాలకు అర్థాలు సాధించారు. మరికొన్ని ప్రతులలో వీటిలోనే కొన్ని శబ్దాలకు అర్థాలను పీఠికలలో వివరించారు. ఇప్పటికీ సాధ్యములు కాని శబ్దాలు ఈ కావ్యంలో చాలా మిగిలి ఉన్నయి. అట్టి శబ్దాలకు మరి కొన్నిటికి సందర్భోచితంగా కనిపించిన అర్థాలు ఈ కావ్యం చివరి లఘుటీకలో ఇస్తున్నాము. ఈ అర్థాలు పండితా మోదం పొందగలిగితే ధన్యులం. సంస్కరింపుకోదగిన చోటులు, చేర్పులు విద్వాంసులు సూచిస్తే కృతజ్ఞతాపూర్వకంగా స్వీకరించి ద్వితీయ ముద్రణలో సవరింపగలమని మనవి.

## శ్రీనాథుని వీథి నాటకము - చాటువులు

శ్రీనాథుని వీథి నాటకం అనే రచన ఒకటి ఉన్నట్టు మన లాక్షణికులు - అప్పకవి, కూచిమంచి తిమ్మకవి తమ గ్రంథాలలో పేర్కొన్నారు అందులోంచి ఉదాహరణ లిచ్చారు. శ్రీనాథుని వీథి నాటకం అన్న పేరుతో శృంగార చాటువులు గల ఒక చిన్న పుస్తకం (గుజిలీ ప్రతి) తాము చూపినట్టు మానవల్లి కవిగారు, మరి కొందరు క్రీడాభిరామ పీఠికా కర్తలు తెలిపారు. కాని ఎందుచేతనో వారెవరూ ఆ శ్రీనాథుని వీథీ స్వరూప స్వభావాదులను తెలుపలేదు. అందువల్ల దానిని సంపాదించి, క్రీడాభిరామంతో చేర్చి ప్రకటించడం యుక్తంగా ఉంటుందని తోచి, దాని కోసం దీర్ఘాన్వేషణ సాగించగా, చివరకు మిత్రులు శ్రీ ఆరుద్రగారి వద్ద ఒక ప్రాచీన ముద్రిత (గుజిలీ) ప్రతి దొరికింది. తరువాత, వావిళ్ళవారి ప్రతి ఒకటి సంపాదించాము. ఆపైన మరొక ప్రతి కూడా దొరికింది. శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి గారు శ్రీనాథుని శృంగార చాటువులు కొన్ని తమ పీఠికలో ఉదాహరించారు. శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారి "శ్రీనాథ కవితా

సమీక్ష''లో మరికొన్ని పద్యాలు దొరికినయ్యి. ఇవి గాక మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలో బ్రౌను దొర సంపాదించి పెట్టిన ''చాటు పద్యములు'' అన్న వ్రాత ప్రతిలో ఇదివరకు ఏ ముద్రిత ప్రతిలోను ఎక్కని మరికొన్ని పద్యాలు దొరికినయి. ఇవన్నీ చేర్చి క్రీడాభిరామంలో అనుబంధంగా ప్రకటించ గలిగినందుకు ఆనందిస్తున్నాం.

ఈ శ్రీనాథుని వీథిలో - శ్రీనాథునికి ఎదురైన వివిధ వర్ణాల సుందరాంగుల వర్ణనలు ఒక వరుసలో కనిపిస్తున్నాయి. మొదటి మూడు ప్రసిద్ధ చాటు పద్యాలు, నాల్గవ (క్రీడాభిరామము) పద్యం వదిలేస్తే బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్ర భామల వర్ణనలు వరుసగా ఉన్నాయి. తరువాత వివిధ కులాలలోని నియోగి, వ్యాపారి, వైష్ణవాది అవాంతర శాఖలకు చెందిన భామల వర్ణనలు ఉన్నయి. ద్రావిడ కర్ణాటాది అన్య దేశాంగనలను కూడా విడిచిపెట్టలేదు.

వీటి మధ్య క్రీడాభిరామంలో గల 1.కందుకకేళి.... 2.కుసుమం బడిన 3 మీనవిలోచనంబులును.... అనే మూడు పద్యాలు వచ్చి చేరినయి. వీటికి క్రీడాభిరామంలో ఉన్న స్థానౌచిత్యం ఇక్కడ కనిపించడంలేదు.

ఈ చాటువులలోని పద్యాలు ఇంచుమించు అన్నీ శ్రీనాథ కవితా శిల్ప సంపన్నాలు. కాని, కొన్ని బూతుల బుంగలు. ఆ బూతుల కోసం కాక, ఆయా పద్యాలలోని శ్రీనాథ కవిత్వ ప్రౌఢిమ కొరకు మాత్రమే ఎవరికి వారు చదువుకొని ఆనందించదగినవి. అందుకోసం గ్రంథస్థంచేసి ఉంచదగినవి.

''సరసుఁడు కఁడొ....'' ''అరవిందానన....'' మొదలైన శ్రీనాథ కవితా శోభా సంపన్నమైన పద్యా లనేకం ఈ చాటువులలో ఉన్నయి. ప్రియురాలికి ప్రేమలేఖ (12.63) పద్యాలు మనోహరంగా ఉంది.

నిజానికి శ్రీనాథుని కవితా ప్రాగల్భ్యం ఆయన కావ్యాలలో

కన్న ఎక్కువగా ఆయన చాటువులలోనే ఉన్నదనడంలో నాతో ఏకీభ వించేవారు ఇంకా చాలా మంది ఉన్నారనుకుంటాను.

## కావ్య పరమార్థం

ఈ కావ్యం చదివిన మీదట రసజ్ఞులకు కలిగే అభిప్రాయం ముఖ్యం. కావ్యంలో జుగుప్స కలిగించే వర్ణనలు ఎక్కువగా ఉన్నాయి. అలాంటివన్నీ శృంగారంగా పరిగణించి ఈసడించడం సబబు కాదు. అటువంటి పచ్చి శృంగారం అంటే, రోత (జుగుప్స) వైముఖ్యం కలిగించడమే (చూ. 252-53) ఈ రచన పరమార్థం. జుగుప్స స్థాయీ భావాలలో ఒకటి. ఆనాటి మూఢతలను, దురాచారాలను స్వభావోక్తి మంజులంగా అభివర్ణించి, వ్యంగ్యంగా వాటిని పరిహ సించడంతోపాటు అంతకు పూర్వ కవుల (ముఖ్యంగా శ్రీనాథుని) ధోరణులను, కవి సమయాలను అనుకరించి అవహేళనం చేయడం కవి లక్ష్యం.

## సారాంశం

1. క్రీడాభిరామ కర్త వల్లభామాత్యుడు, అంతకు పూర్వ కవు లెవరూ వాడని తెలుగు పలుకుబడులతో, తన తరువాతి కవులను ప్రభావితుల్ని చేసిన పద భావ విన్యాసాలతో అతి స్వతంత్ర పద్ధతిలో 'ప్రేమాభిరామ' రూపకాన్ని తెనిగించిన ప్రౌఢకవి.

2. శ్రీనాథుని పద్య పాద భావ బంధాలు అనేకం క్రీడాభి రామంలో హాస్యానుకరణ (Parody) రచనా విధానంలో వచ్చి చేరినవి.

3. శ్రీనాథకవిసార్వభౌముడికి సమకాలికుడై, ఆయనకన్న చిన్నవాడైన వల్లభరాయడు శ్రీనాథ సాహిత్య స్వభావాలకు మనోజ్ఞ వ్యంగ్యానురూప చిత్రం (Caricature) గా క్రీడాభిరామ నాయకుడు గోవిందశర్మ పాత్రను మలచాడు.

4. అశ్రీనాథ ప్రయోగాలు పుష్కలంగా కనిపిస్తున్న ఈ కావ్యం శ్రీనాథకృతం అనడం పొసగని మాట.

5. క్రీడాభిరామం తెలుగు సాహిత్యంలో అద్వితీయమైన విలక్షణ ప్రౌఢ శృంగార కావ్యం.

# క్రీడాభిరామ కర్తృత్వము-
# వివిధ పండితాభిప్రాయములు

## శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారి యభిప్రాయము

శ్రీనాథుని వీథినాటక మను చిన్న పొత్తము బజారులో నమ్మునది. ప్రాచీన గ్రంథము కాదని తోచుచున్నది. అప్పకవి శ్రీనాథుని వీథి నాటకములోనివని యుదాహరించిన రెండు పద్యములను చిత్రకవి పెద్దన వల్లభరాయని వీథినాటకములోని వనియే యుదాహరించెను. ఆ రెండును దీనిలో నున్నవి. జగన్నాథకవి రత్నాకరములో సుమారు పది పద్యములకంటె నెక్కువగా వల్లభరాయని వనియే పేర్కొనెను. అప్పకవి యుదాహరించిన "కుసుమం బెట్టిన చీర కొంగు" అను నదియు, "కందుక కేళి సల్పెడు" అనునదియు దీనిలో యథాస్థానములలో నున్నవి. కావున వానిం బ్రక్షిప్తము లని చెప్పుటకు వీలు పడదు. కావున శ్రీనాథుని వీథినాటక మిదియె - ఇంక ననేక సందేహములు కలుగుచున్నవి. శ్రీనాథుఁ డోరుగల్లు వర్ణింపఁ బనియేమి? వల్లభరాయ డెవ్వఁడు? వల్లభరాయని పేర వ్రాయ నేల?.........

ఈ నాటకమునకు రావిపాటి త్రిపురాంతకుని మూల గ్రంథము గాని, ప్రస్తావనయు నాందియుఁ గల తెలుఁగు ప్రతియుఁ గాని నాకు లభింపమింజేసి యీ క్రింది యంశము సందిగ్ధముగా నున్నది. రత్నాకరమునందు వల్లభరాయని వీథినాటకపు పద్యములలోని దని యీ క్రింది పద్య మగపడుచున్నది.

సీ. చంద్ర ఖండములతో సరి వచ్చు ననవచ్చు
 విమల దంష్ట్రా ప్రరోహముల వానిఁ,

బవడంపుఁ గొనలతోఁ బ్రతివచ్చు ననవచ్చు
  కుటిల కోమల జటా చ్ఛటలవాని,
నింద్రనీలములతో నెన వచ్చు ననవచ్చు
  కమనీయతర దేహ కాంతివాని,
నుడురాజ రుచులతో నొఱవచ్చు ననవచ్చు
  చంచ న్మ దాట్టహాసముల వాని,

గీ. పిగ్గుమాలిన మొలవానిఁ, జిఱుతవాని,
నెల్ల కాలంబు ములికినా దేలువాని,
నధిపు, మోపూర నవతార మైనవాని,
భైరవునిఁ గొల్వ వచ్చిరి భక్తవరులు

ఇందువలనఁ బ్రస్తావనమున మోపూరు భైరవుని తిరుణాళ్ళకు వచ్చిన భక్తులు 'రావిపాటి త్రిపురాంతకుని ప్రేమాభిరామమును మోపూరు ప్రభువగు వల్లభుండు నూతనముగాఁ దెనిఁగించె దాని నాడి చూపుఁ'డని యడిగినట్లు తోఁచుచున్నది. ఓరుంగల్లు పుర వర్ణనములో మోపూరు ప్రస్తావ మప్రస్తుతాంశము. కావున నాటక మధ్యమున నీ పద్యము నా ప్రతిలో విడిచిపోయె ననుటకు వీలులేదు. ఇఁక వల్లభ రాయని పేర శ్రీనాథుఁడు కృతి యిచ్చునేమో కాని, తన పేరు చెనుపక వ్రాయుటకుఁ గారణ మేమియో? గ్రంథములో శృంగార రసాతిరేక మని చెప్పినచో శ్రీనాథుని తక్కిన కావ్యములలోని వర్ణన లేమి తక్కువలే? శ్రీనాథుని వల్లభాభ్యుదయములోఁ గృష్ణా తీరమున మందు శ్రీకాకుళస్వామి తిరునాళ్ళలో జరుగు నసభ్యములు దీనికంటెఁ బచ్చిగా నున్నవి. భీమఖండములో వేశ్యా వర్ణనలు ప్రథమాంతాశ్వాసములలో నెక్కువగా నున్నవి. లేక త్రిపురాంతకుని నాటకము తెనిగించె ననుట శ్రీనాథునకుఁ దక్కువ యన్నచో నతఁడు స్వయముగా రచించినది యేది? ఈ యంశ మొక్కటియే వల్లభ రచిత మని చూపుచున్నది. ఇఁక శ్రీనాథుఁడు రచించెనేమో యనుటకుం గారణములు: మొదటిది—

గీ. "గార్గ్య సిద్ధాంత మత ముషఃకాల కలన
శకున మూనుట యది బృహస్పతి మతంబు
వ్యాస మతము మనః ప్రసా దాతిశయము"

అను మూఁడు పాదములు వీథి నాటకములోను, భీమఖండ ములోఁ దృతీయాశ్వాసమునను మార్పు లేకయే యున్నవి. భిన్నులు గ్రంథకర్త లయినచో నిట్లుండఁ దటస్థింపదు. భావచౌర్యమును గొంతవరకును, సమాస వాక్య చౌర్యమును నాంధ్ర కవులలోఁ గలవు. కాని పద్య మంతయు గ్రహింతురా? ఈ వీథియును, శ్రీనాథుని కావ్యములును పదబంధమునందును, వాక్య క్రమము నందును, అన్వయమునందును, పదసంచయమునందును సమాన ములుగా నున్నవి. పైన నుదాహరించిన భైరవుని మీఁది పద్యము భీమఖండములోఁ బ్రథమాశ్వాసమున 108 వ పద్యములో వాక్య విన్యాసమునఁ బోలిక గలదు.

"అదె దారువన భూమి యచమనేత్రుఁడు వాఁడె
సంయ మీంద్రుల పుణ్య సతులు వారె"

అను పద్యమునకు భీమఖండములోఁ బోలిక పద్యము గలదు.

క "వరుణుని శుద్ధాంతంబున
నరవిందాక్షులకు మించుటద్దం బగుచున్"

అను భీమఖండములోని పాదములు క్రీడాభిరామమున 'వరుణ రాజ శుద్ధాంత కాంతా విలాస మాణిక్య దర్పణము' అనుటకు సరి పోవును. ఇట్టి భావ చౌర్యములచేతనే శ్రీనాథుఁడు రచించె ననుటకు వీలుపడదు రెండవది — శ్రీనాథుఁడు పల్నాటివీరచరిత్రమును బాల్య దశలోఁ గొంత మాత్రమును రచించెను. దానిలోని కథా భాగమును మరలఁ గ్రీడాభిరామమున నోరుగంటి వీథులలోఁ జిత్ర ములలో వ్రాసి, వీరచరిత పాడినట్లు తత్కథ కొంత సూచింపఁబడి యున్నది. మరియు వల్లభాభ్యుదయమున నాంధ్ర వల్లభుని తిరునాళ్ళ

లోని విధవా దుర్వర్తనములు శ్రీనాథుఁడు విశదముగా వర్ణించి యున్నాఁడు. ఆ విషయమే క్రీడాభిరామమున—

"గరుడ స్తంభ ప్రతిష్ఠా కలన మొదలుగాఁ
గల్ప మంత్రోక్త పుష్ప
ధ్వర పర్యంతంబు కృష్ణా తటిని తటమునన్
ద్వాదశ క్రోశధాత్రి
పరివేషాభ్యంతర శ్రీ పరమపదమునన్
బర్వకాలంబునందున్
బరనారీ సంగమాదుల్ భగవ దనుమతిఁ
బాపముల్ గాక యుండుఁ."

ఇత్యాదులతో గేలి సేయుచున్నాఁడు. పై కారణములచే నిది శ్రీనాథ రచితమో యని సందేహించుచున్నాను. చిత్రకవి పెద్దన, ముద్దరాజు రామన, శ్రీధరుఁడు, గణపవరపు వేంకటకవి, జగన్నాథుఁడు వీరందఱును 'వల్లభరాయని వీథి నాటకములో' ననియె యుదాహరించి యున్నారు. మరియును వీథి నాటకమున మధుమావతీ గృహమున నెవ్వఁడో యొక కవి విటుఁడు దాని భూత భావి జన్మముల గుఱించి యొక పద్యమును వ్రాసెను, అందులో మధుమావతి యంగారవర్ణుని కూఁతురై, యిహ జన్మమున మధుమావతియై, భావి జన్మమున దాక్షారామమునఁ జిన్నిపోతి యను వేశ్యయై, తరువాతి జన్మమునఁ దమిలేటి ప్రాంతమునఁ జెంచుల కులమునఁ గడిమి కాత్తులయమ్మి యని జన్మించునని యున్నది. శ్రీనాథుఁడు శ్రీకాకుళాధీశ్వరుఁడగు తెలుఁగు రాయని దర్శించి యతని కంకితముగా వల్లభాభ్యుదయము చెప్పెను గదా! అప్పుడు—

శా. అక్షయ్యంబుగ సాంపరాయని తెలుంగాధీశ! కస్తూరికా
భిక్షాదానము సేయురా సుకవిరాట్ బృందారక శ్రేణికిఁ,
దాక్షారామ చళుక్య భీమపుర గంధర్వాప్సరో భామినీ
వక్షోజద్వయ కుంభి కుంభములపై వాసించు నవ్వాననల్

అని శ్రీనాథుఁడు చెప్పెను. దీనిచే శ్రీనాథునకు దాక్షారామ వేశ్యలతో సంబంధము గలదని వేఱుగఁ జెప్పనక్కర లేదు. వీథి నాటకములో చిన్నిపోతియే శ్రీనాథునకుఁ గూర్చు మగువయో యని సందియము కలుగుచున్నది. త్రిపురాంతకుని సంస్కృత ప్రేమాభి రామమున నీ యంశ మున్నదో లేదో తెలియదు. మరియు వీథి నాటకములోని శైలి చూడఁగా భీమఖండములోని పదబంధమున కంటె పటుతరమై యఖండ ధారాపాతము గలదై యున్నందునం దరువాతనే వ్రాసెనన్నచోఁ గొన్ని కారణములవలన నక్కాలము (1450) అంగీకరించుటకు వీలు లేకున్నది. అళియ రామరాయల ముత్తాత యగు సోమభూపాలున కంకిత మీయఁబడిన శ్రీధర చ్ఛందమున వల్లభరాయని వీథినాటకములోని దని "మంచెనః వింటివో" యను పద్య ముదాహరింపఁ బడియున్నది. అందుచే వల్లభరాయఁడు శ్రీనాథుని బాల్య దశలో గొప్ప కవియైనట్లు తెలియు చున్నది. శైలీ విషయమున సామాన్యమును జూపి, శ్రీనాథునకుఁ గర్తృత్వ మారోపింత మన్నచో నక్కాలపుఁ గావ్యములెల్ల నించు మించుగా సమాన పాటవమును, కవితా ధాటియును, నిరంకుశ భావములును గలిగియున్నవి పినవీరభద్రుఁడు, శివలీలావిలాసము వ్రాసిన కొమ్మనయు, ఎలుకుర్తి రామరాజును, తులసి బసువనయు, అంగర నృసింహకవియు రచించిన కావ్యములలో బిగువును, ధారా పాతమును సమానముగా నున్నవి

(మానవల్లి రామకృష్ణ కవిగారి క్రీడాభిరామ పీఠిక; పు 2-6)

## శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రులువారి యభిప్రాయము

వల్లభరాయని కృతిగా గ్రంథమున నున్నను, శ్రీనాథుఁడే దీనిని రచించెనని పెక్కు కారణములచే నేను నిశ్చయించుచు న్నాఁడను. సులక్షణ సారము, అప్పకవీయము, లక్షణదీపిక, సర్వ లక్షణసార సంగ్రహము మొదలగు లక్షణ గ్రంథములందు శ్రీనాథుని వీథి నాటకములోనివిగ నుదాహృతము లయిన పద్యము లీ క్రీడాభి రామమునఁ గలవు. శ్రీనాథుఁడే యీ గ్రంథమును రచించి, వల్లభ

రాయని పేరు పెట్టఁగా గ్రంథమున వేఱు పేరున్నను, రంగనాథ రామాయణాదులవలె నీ గ్రంథము కూడఁ గర్తయగు శ్రీనాథుని పేరనే లోకమునఁ బ్రచారము గాంచియుండుటచే నప్పకవ్యాదు లట్లు చెప్పియుండవలెను. అప్పకవ్యాదు లుదాహరించిన పద్యములు క్రీడాభిరామమున నానుపూర్వితో నున్నవి, ప్రక్షిప్తములనఁ గుదురదు. వల్లభరాయుఁడును, శ్రీనాథుఁడును సమకాలమువారు గాకపోవుదురేని, శ్రీనాథుఁడాతని పేర గ్రంథము రచించుట యసంభవ మగును. అట్టి చిక్కు లేదు. శ్రీనాథుఁడును, వల్లభరాయఁడును సమకాలమువారు. వల్లభరాయని పెద్ద తండ్రి యగు లింగన మంత్రి విద్యానగర హరిహర రాయల మంత్రి. రెండవ మూఁడవ హరిహర రాయండ్రు క్రీ. శ. 1402-1412 వఱకు నుండిరి. లింగనమంత్రి వారిలో నెవరి యొద్ద మంత్రియయి యుండినను వల్లభరాయఁడు మన శ్రీనాథుని సమకాలమువాఁడే యగును. అందును నీ క్రీడాభిరామమును కాశీఖండ రచనానంతరమే రచించెనని నేఁ దలంచుచున్నాఁడను గాన శ్రీనాథుఁడును, వల్లభరాయఁడును సమకాలము వారగుదురనుటకు సంశయింపఁ బనిలేదు.

మఱియు నీ గ్రంథమున వల్లభరాయని వాగ్వైభవ దాతృత్వాది వర్ణనము మితిమీరి యున్నది. గ్రంథకర్తయే తా నగుచో వల్లభరాయఁ డట్లా కంద పద్యాష్టకమును రచించుకొని యుండఁడు. ఆ పద్యములు భీమఖండాదులలోని కృత్యవతరణికా పద్యముల (భీమ. 1-36;71) పోలిక గలిగి యున్నవి. అందుఁ గడపటి పద్యము:

క. ఉపమించెద ధారాధర
తపజన రై రాజ రాజ ధారానగరా
ధిప ధారాధరవాహులఁ
ద్రిపురాంతక వల్లభుని వితీర్ణి ప్రౌఢిన్ (క్రీడా. 29వ)

అని యున్నది. మరియుఁ గృత్యవసాన పద్యమునఁ గాలభైరవుఁడు కవీంద్ర కాంక్షిత త్రిదశ మహీరుహమగు వల్లభరాయనికి సమగ్ర వైభవాభ్యుదయములు కృపసేయునని యాశీర్వచన మున్నది.

సూత్రధారో క్తిగాను, భరతో క్తిగా ను నయిన గ్రంథక ర్త యగువాఁ డిట్లు చెప్పుకొనుట సరసము గాదు. ఇది తానే తుమ్ముకొని, తానే శతాయుస్సని యనుకొన్నట్లున్నది. కవీంద్ర కాంక్షిత త్రిదశ మహీరుహము గావున వల్లభరాయఁడు విశేష ధన మొసఁగి, కవి యశః కాంక్షియై యేతత్కృతి క ర్తృత్వమును దనపై వేయించుకొన్నాఁడని తలఁచుట ప్రమాణ దూరము గాదు. అట్టి సంప్రదాయముగూడ నా కాలమున హెచ్చుగాఁ గలదు.

శ్రీనాథుఁడు తన గ్రంథములలోఁ గొన్ని పద్యములను, పద్య భాగములను, భావములను మార్పు చేయక యొక తీరుననే కూర్చు కొనుచు వచ్చినాఁడు. స్వరచనమే యగుటచే సరిపడిన పట్టులందు ముందు రచించిన గ్రంథములలోని కూర్పులను జేర్చుకొనుట దోషము గాదు గదా! తిక్కనాదులు గూడ నిట్లు చేసిరి ఎన్నటికిని గూడఁ గ్రీడాభిరామము శ్రీనాథకృతము గాదను వాదము పుట్టకుండుటకో యనునట్లు, శ్రీనాథకవి యనేక స్థలముల నిందుఁ దన తిక్కన గ్రంథముల రచనలను జేర్చెను. ఆ పోలిక లీ గ్రంథము శ్రీనాథ కృతమే యని చెప్పక చెప్పుచున్నవి. ఇతర కవి కృతులందలి సరస సంవిధానములను గాఁజేయు దొంగ కవులను గొందఱుందురు. వల్లభరాయఁ డట్టివాఁడై, శ్రీనాథ రచనములఁ గొన్నింటిని గాఁజేసి యుండరాదా యనరాదు. గ్రంథమామూలాగ్రముగ శ్రీనాథ రచనము గానే కన్పట్టుచున్నది. తస్కర కవుల స్వరచన మస్వరసమై పొంది పొసఁగక తెలియవచ్చుచుండును. క్రీడాభిరామమునఁ బద సంవిధానము, అన్వయ క్రమము, కారక ప్రయోగ వైచిత్రి, పద్యోప క్రమ నిర్వాహములు, ప్రతిపదము శ్రీనాథుని పేరుగ్గడించుచున్నవి. శ్రీనాథుని రచనా చమత్కారముల నెఱిఁగిన వారిది చక్కఁగా గుర్తింపఁ గల్గుదురు. అదే పనిగా నారంభించినచోఁ గ్రీడాభిరామమందలి ప్రతి పద్యము నందును శ్రీనాథుని రచనా వైచిత్ర్యమును బోల్చి చూపనగును.

(వేటూరి ప్రభాకర శాస్త్రిలువారి క్రీడాభిరామ పీఠిక, పు. 18-19)

## శ్రీ బండారు తమ్మయ్యగారి యభిప్రాయము

వల్లభరాయని కాలమున విజయనగర సామ్రాజ్యమును ప్రౌఢ దేవరాయలు (క్రీ. శ. 1423-1446) పరిపాలించుచుండెను. అతని యాస్థానముననే గౌడ డిండిమ భట్టారకుఁడు అరుణగిరినాథ నామాంకితుఁడు, కవిసార్వభౌమేత్యాది బిరుదములతో యశో డిండిమమును మ్రోగించుచుండెను. శ్రీనాథునకు యశోభిలాష మపారము. అప్పు డాతఁడు రాజమహేంద్రవరమున వేమ వీరభద్రారెడ్ల యాస్థానమలంకరించియుండెను. విద్యా వివాదమున డిండిమ భట్టారకుని జయించి, యాతని కంచు ఢక్కను బగులఁ గొట్టించినఁగాని శ్రీనాథునకు నిద్ర పట్టకుండెను. అందుచే నాతఁడు జైత్రయాత్రోన్ముఖుఁడై పలుపాట్లు పడి ప్రౌఢదేవరాయల యాస్థానమునఁ బ్రవేశమును గలిగించుకొని డిండిమభట్టు నోడించి, రాజుచేఁ గనకాభిషేక సత్కారాదుల నొంది, స్వదేశమునకు మరలి వచ్చి, కవిసార్వభౌముఁడయి విరాజిల్లెను. ఈ విజయనగర ప్రయాణ సందర్భముననే, యాతఁడు ప్రౌఢదేవరాయ సంస్థాన ప్రవేశమునకుఁ గావించిన ప్రయత్నములలో మార్గమధ్యమున వినుకొండలోఁగాని, మోపూరులోఁగాని యా ప్రాంత దేశమునకు రాయల ప్రతినిధిగా, భాండాగారాధ్యక్షుఁడుగా నున్న వల్లభరాయని సందర్శించి యుండును. శ్రీనాథుని యుద్యమమునకు హర్షించి, వల్లభరాయఁ డది కొనసాగుటకయి తన మిత్రులగు సంస్థానోద్యోగులు కొందఱకు సిఫారసు చేసియుండును. ఆ సమాగమ సమయముననే శ్రీనాథుఁడు వల్లభరాయనివలన నాతని క్రీడాభిరామ రచనోద్యమమును విని, యాతని యాదరానురోధమునఁ దాను గూడ నందుఁ దోడ్పడియుండును. చరచర పరుగులువారు కవితాధార గల శ్రీనాథుని కిట్టి పని కెంతయో సేపు పట్టదు. కావున వల్లభరాయనితో నున్న యా కొలఁది దినములలోనే శ్రీనాథుఁడీ కృతి రచనమునఁ దన చేయి వేసి యుండును. స్వతంత్రముగఁగాని, యనువాద రూపకముగఁగాని యొక రూపక రచనము గావించు సంకల్పము శ్రీనాథున కుండియుండదు. పైని జెప్పిన కారణములచే నీ కృతి రచనా సంక

ల్ప మసలు వల్లభరాయనిదే యని మనము సులభముగఁ దెలిసికొనఁ గలము.

అవతారికా భాగము-వల్లభరాయ స్తుతి సంకలితము, తద్వంశ వర్ణనాదికము, గ్రంథాంతమందలి యాశీర్వాద పద్యము కేవలము శ్రీనాథ కృతములే యని మనము భావింపఁ దగును. ఇఁకఁ గథా భాగమునందును శ్రీనాథుని సిద్ధహస్తము స్వల్పముగఁ గాక యతి మాత్రముగ - వల్లభరాయ రచనములు కొన్ని యున్నను, వానిని గుర్తింపరాకుండఁ గ్రమ్మివైచునంత యెక్కువగ నెలకొనినట్లు కాన నగును. శ్రీనాథుని యాతర కృతులందలి పద్య పాదములు, అతని రచనలతోఁ బ్రత్యక్షసామ్యముగల సంవాదములు, పదప్రయోగములు ఎందు నెక్కుడుగ నెక్కొని యున్నవి.........

కాశీఖండ రచనమును శ్రీనాథుఁడు విజయనగరాస్థానమునఁ గనకాభిషేకమొంది, రాజమహేంద్రవరమునకు మరలి వచ్చిన యనంతరమే క్రీ. శ. 1440 ప్రాంతమునఁ గావించి యున్నాఁడు. కావున భీమఖండ కాశీఖండ రచనముల నడుమ కాలమున విజయ నగర ప్రయాణ సందర్భముననే శ్రీనాథుఁడు వల్లభరాయని సందర్శించి, క్రీ. శ. 1435 వ, సం॥ ప్రాంతమున నాతనికి గ్రంథ రచనమున సాయపడెనని నిర్ణయింపనగును.

(క్రీడాభిరామ పీఠికలో ''గ్రంథ రచనా కాలము - శ్రీనాథుని సాహాయ్యము'' అను శీర్షిక క్రింద)

## శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారి యభిప్రాయము

క్రీడాభిరామమును రచించిన కవి వినుకొండ వాసియైన తిప్పనామాత్య సుతుఁడు వల్లభామాత్యుఁ డయినట్టులు కృత్యవతరణికయందుఁ జూపబడెడి వంశక్రమ వర్ణనాత్మకమైన గద్య పద్యములను బట్టియుఁ, గృత్యంతమునందలి గద్య పద్యములను బట్టియు సుస్పష్టముగఁ దెలియవచ్చుచున్నది.........

శ్రీనాథుఁడు కొండవీటిలోఁ జిరకాలము వసించియుండి, నైషధాంధ్రీకరణము మూలమునఁ దన యశఃప్రశస్తులను గుంటూరు నెల్లూరు మండలములం దంతటను వెల్లివిరియఁజేసి యున్నాఁడు కొండవీటికి వినుకొండ నలుపది మైళ్ళ దూరమందుండిన పట్టణము. కావున శ్రీనాథుని రచనా పద్ధతి వల్లభరాయని మనము నాకర్షించి, యాతని పోకడలలోఁ దన రచన సాగింప నమకట్టి యుండిన నాఁడు శ్రీనాథుఁడు కృత్యాద్యంత పద్యములను గూర్చి యున్నాఁడు. రచనలోఁ గానవచ్చెడి వ్యత్యాసమే యీ విషయమును స్పష్టము చేయుచున్నది. ఈ క్రీడాభిరామమందలి మొదటి పద్యము — గణన కెక్కిన దశ రూపకములయ దు' ఇత్యాది పద్యము వల్లభామాత్యునిది దాని తరువాతి 'అఖిల ప్రపంచంబు నన్యథా కల్పించె' విత్యాది సీసము మొదలుగ 32 వ పద్యము తుదివఱకు, ప్రేమాభిరామప్రశంస యను వచనముదాఁకఁ గల వంశావతార వర్ణనాత్మక విషయమ తయు శ్రీనాథ విరచితమే కాని వల్లభామాత్యుని రచితము గాదు. నడుమఁ గూర్చిన "కందుక కేళి సల్పెడి ప్రకారమునన్," "కుసుమం బద్దిన చీరకొంగు వొలయన్" ఇత్యాది పద్యములు రెండును శ్రీనాథుని చాటువులు, అతని వీథినాటకములోని విందుఁ జేరినవి. శాలివాహన సప్తశతి శ్లోకములకు శ్రీనాథుని యనువాద రూపమైన పద్యములు 'శీతకాలంబు కడి మాడ సేయఁ గుడుచు,' 'పటు ఝుంఝూ పవనో త్తృణాలయములో,' 'మాఘమాసంబు పులివలె మలయుచుండ' ఇత్యాది పద్యములు మూడును శ్రీనాథునివియే గాని వల్లభరాయనివి గావు. ఇటులనే తుదిని భరతవాక్యమనఁదగిన 'మదమున ముల్కినాటి పుర మోహన శైల' ఇత్యాది పద్యమును శ్రీనాథునిదే. ఈ పద్యములు గాక, తక్కిన గద్య పద్యము లన్నియు వల్లభామాత్య విరచితములే.

క్రీడాభిరామము కృత్యాద్యంతములందు శ్రీనాథుని రచన ప్రవేశించుట సంభావ్యమైన విషయమే. ఏమన, నీ ఘట్టమునఁ గవి తన ఘనతను దా వక్కాణించుకొనవలయును. అది యన్య కర్తృక మైనచో దానిలో నౌచిత్య మధికము కావున, వల్లభరాయనితోఁ గార్యార్థియైన శ్రీనాథుఁడాపని చేసియుండవచ్చునని మన మూహింప

వచ్చును శ్రీనాథుఁడు ప్రౌఢదేవరాయని యాస్థానిలో, గౌడడిండిమ భట్టారకుని వాగ్వాదమునం దోడించి, కవిసార్వభౌమ బిరుదము నార్జింపఁ బోవునాఁ డీవల్లభామాత్యుని తోడ్పాటు నర్థించియుండును. వల్లభామాత్యుని ముత్తాత విజయనగరాధీశుఁడైన పెదబుక్కరాయలకు మంత్రిగను, ఈతని తాత లేక తండ్రియగు తిప్పామాత్యుఁడు హరిహర రాయల సువర్ణ భాండాగారాధ్యక్షుఁడుగను మండిన కతమున, వల్లభామాత్యునకుఁ గూడ విజయనగర సామ్రాజ్యముతో సన్నిహిత సంబంధమేర్పడి యుండును. అచట సభా ప్రవేశమునకుఁ దనకు సాయపడుటకై శ్రీనాథుఁడు వల్లభామాత్యుని దర్శింపఁగా, నాతఁడు శ్రీనాథు నీ కృత్యాది పద్యములు రచింపుమని కోరియుండును. తన్మూలముగ నీ 32 శ్రీనాథుని గద్య పద్యములు కృత్యాదివి, 'ముదమున ముల్కినాటి పుర' ఇత్యాది పద్యము తుదివి జేరినవని మన మూహ సేయనచ్చును. నడుమ నవతరించిన యయ్యాదు పద్యములు శ్రీనాథుని యనుమతితోడనో లేకయో వచ్చి చేరిన వనుట నిశ్చయము

ఏ ప్రభువు నాస్థానిలోనైన ప్రవేశము నార్జించుటకు ముందు తత్సంబద్ధులతో సారస్వత సంబంధము నేర్పఱుచుకొనుట శ్రీనాథున కొక పరిపాటి యైనట్టులు గన్పట్టును. ఆ క్రమముననే విజయనగర సామ్రాజ్య సంబద్ధుఁడైన వల్లభామాత్యునితో నిట్టి సారస్వత బాంధవమేర్పడి యుండునని నా యూహ. పెదకోమటి వేముని యాస్థానిలో విద్యాధికారి కాఁదలఁచిననాఁడు తన్మంత్రియగు మామిడి సింగన తోడను, వీరభద్రారెడ్డి యాస్థానిలో విద్వాంసుఁడు కాఁదలఁచిననాఁడు తన్మంత్రియగు బెండపూడి అన్నామాత్యునితోడను సారస్వత సంబంధ మేర్పఱుచుకొనుట, తన్మూలమునఁ దన యాశయమును సఫలము గావింపఁ జేసికొనుటయు దీనికి సమర్థకములు.

(శ్రీనాథుని కవితా సమీక్షయందలి-క్రీడాభిరామము శ్రీనాథ కర్తృకమా?-యను శీర్షిక క్రింది భాగములోనిది)

## శ్రీ వేకుమళ్ళ అచ్యుతరావుగారి యభిప్రాయము

వల్లభామాత్యుఁడు క్రీడాభిరామ మను వీథినాటకమును నాంధ్రమున రచించెను. ఆ గ్రంథమందలి ప్రస్తావన పద్యముల వలనఁ దత్కవి గొప్ప పండితుఁ డనియుఁ జక్కని కవిత్వముఁ జెప్పఁగలవాఁ డనియు తెలియవచ్చుచున్నది. ఇతియె గాక ఋగ్వేదము కరతలామలకముగ పఠించి, భైరవస్వామి కృపచే సారస్వత సిద్ధి, యనఁగా గ్రంథకర్తృత్వ సంపత్తిఁ బొందెను....

ఈ గ్రంథము రూపకము గాని కేవలము ప్రబంధము గాదు. రూపక లక్షణములు సంపూర్ణముగా దీనియందుఁ గాఁన్పించక పోయినను ఇది వీథినాటకముగా గ్రంథకర్తచేఁ బరిగణింపఁబడినది.

ఇది హాస్య రస ప్రధానమైన క్షుద్ర కావ్యము గాని, యున్నతాదర్శము గల యుత్తమ కావ్యము గాదు.

హాస్య రస ప్రధానమైన క్షుద్ర నాటకముగా దీని నుపలక్షించిన యెడల, మహా కవి శ్రీనాథుఁడు గాక, శ్రీనాథుని భాషా వేషముఁ గొంతవఱకు ధరింపఁగల మరి యొక కవి రచించియుండు నని మనకుఁ దోచును....

శ్రీనాథుని భాషా ప్రయోగము లీ గ్రంథమునఁ బుష్కలముగాఁ గాన్పించుచున్నవి గాన నీ గ్రంథము శ్రీనాథ కృత మని కొందఱిచేఁ దలంపఁ బడుచున్న దనుట వాస్తవము. కొన్ని పద్యములలో శ్రీనాథుని శైలీ ధోరణియు ద్యోతకమే. అయిన నా కారణమున శ్రీనాథుఁడే యీ గ్రంథమును వ్రాసె నని చెప్పుట మాత్రము సాహసము. శ్రీనాథుని బహుముఖ ప్రఖ్యాత మహిత శయ్యా విశేషములు, పండిత కవులను పండితంమన్యమాన కవులను నేక రీతిగా ననుకర ణోత్సాహ పూరితులఁ జేసె ననుటకు పినవీరన, పెద్దనాది సుప్రసిద్ధ మహా కవులే ప్రబల సాక్షులు. అట్లుండ, సమకాలికుఁడు, బహుశః సహచరుఁడు నగు వల్లభామాత్యుఁడు కవి యశో

వాంఛితుఁడు గాన, శ్రీనాథుని వాగ్లహరీ తరంగముల మధుర మధు రసమును గడుపార గ్రోలి తన కావ్యమున వచ్చటచ్చట, త దున్మదన సీధువును వెలిగ్రక్కుట యసంభవమా? బహుళ వ్యాప్తి నొందిన శ్రీనాథుని 'జాతి వార్తా రస స్ఫూర్తి' యచ్చటచ్చట గ్రంథము నలంకరించుటచేతనే యీ కాలపు నాటక ప్రేక్షకులను హాస్య రస విమగ్నులనుగాఁ జేయఁగలిగి యుండె నని యూహించుట యథార్థమునకు దూరము గాదు.

పై యంశములను సావధానముగా నరసిన, వల్లభామాత్యుని కర్తృత్వము స్థాపించుటకు ప్రబల సాక్ష్యము గాన్పించుచున్నది. లాక్షణికుల యుదాహృతి వల్లభామాత్యునికిఁ గూడ సాయ మిచ్చు చున్నది. శైలి విషయములు శ్రీనాథుని కర్తృత్వమునకు న్యూనతఁ గలిగించెడు విధముగఁ దోపించుచున్నవి. గ్రంథమందు విస్పష్టముగా వల్లభుని కర్తృత్వ ముద్ఘోషితమై యున్నది. కావున నీ గ్రంథము వల్లభరాయని కృత మనియే యంగీకరించుట యెక్కువ న్యాయ మని యూహించుచున్నాను. వల్లభరాయఁ డీ గ్రంథమును రచించి, తన స్నేహితుఁడును కవి సార్వభౌముఁడు నగు శ్రీనాథునిచేఁ గొంత సాయముఁ బొందియుండవచ్చును గాని శ్రీనాథుఁడే యీ గ్రంథము నామూలాగ్రముగా రచించె నని చెప్పుట మాత్రము కేవల మతి శయోక్తి యనియు, నన్యాయమనియుఁ దలంప సాహసించుచున్నాను.

(విజయనగర సామ్రాజ్యమందలి ఆంధ్ర వాఙ్మయచరిత్రము-
ప్రథమ భాగము - పుటలు 85, 89, 95)

## శ్రీ చేకుమళ్ల కామేశ్వరరావుగారి యభిప్రాయము

శ్రీనాథుఁడు స్వస్థలమునకు మొరస రాజ్యము (కర్నూలు జిల్లా ప్రాంతము) మీదుగా బయలుదేరినాడు. చాటువులను జెప్పినాడు. నాటు దారిని వినుకొండ చేరుకున్నాడు.

వల్లభరాయునియొక్క తండ్రియైన తిప్పన వినుకొండ దుర్గములో నున్నాడు, అతఁడు రెండవ హరిహర రాయల (1377—

1404) రత్న భాండాగారాధిపతి. అతని కుమారుఁడు వల్లభరాయఁడను యువకుఁడు తండ్రి సంపాదించి పెట్టుచుండగా, కొడుకు పుస్తకములలో మునిగి తేలుచున్నాడు. వల్లభరాయఁడును, శ్రీనాథుఁడును సమ వయస్కులు, విలాస పురుషులు.

శ్రీనాథుని దర్శనము కాగానే వల్లభరాయఁడు వెతకుచున్న తీగె కాలికి తగిలినట్లుగా సంతోషించినాడు. తాను అనువదించిన క్రీడాభిరామ ప్రబంధమును శ్రీనాథుని ముందు పడవేసినాడు. దయచేసి చిత్తగించమన్నాడు. శ్రీనాథుడు దానిని తన కవిత్వపు మూసలో పోసినాడు. అది మంచి పాకమునఁ బడిన దని వల్లభరాయఁడు పరమానంద భరితుఁడైనాడు. క్రీడాభిరామ కృతి నిర్మాణము 1397 లో జరిగినది.

వల్లభరాయకవి యిచ్చిన బహుమానమును శ్రీనాథుడు మూట కట్టుకొన్నాడు. పందవోలు దరి పట్టినాడు. అతడు ధనముకంటె కీర్తి ధనమును, దేశానుభవము నార్జించుకొన్నాడు. అట్లు పడమటి యాత్ర ముగిసినది....

వ్యాసము-శ్రీనాథ సోమయాజి (పుట. 129)
ఆంధ్రపత్రిక - కీలక సంవత్సరాది సంచిక
(1968-69)

## శ్రీ కుందూరి ఈశ్వరదత్తుగారి యభిప్రాయము

క్రీడాభిరామ కృతిలో "హర చూడా హరిణాంక వక్రత" యను శ్రీనాథ కృత భీమేశ్వర పురాణమునందలి పద్యములో స్ఫురించు వక్రోక్తి మృగ్యము. కావ్య నిర్మాణమునకు బీజమైన కవి వ్యాపార కౌశలము, వైదగ్ధ్య భంగీ భణితి ఈ కావ్యమునందు గగన కుసుమములు. శయ్యా సంబంధమే గాని, శయ్యా సౌభాగ్యము శూన్యము. ఇట్టి క్షుద్ర కావ్యమునకు కొంతపట్టికైనను శ్రీనాథ హస్తావలంబనము గలదనుట యెంత మాత్రము ధర్మము గాదు....

సంస్కృత ప్రేమాభిరామము కాని, తెనుఁగు ప్రేమాభిరామము

(మరింగ టి సింగరాచార్య కృతము) గాని బయలుపడు నంతవఱకు క్రీడాభిరామ కర్తృత్వ వాగ్వివాదము నేల విడిచి సాముచేయుట వంటిది. ఎవ రెంతవఱకు సంస్కృత కావ్యము ననుసరించిరో, మాతృకను బరిశోధించి చెప్పునఱకు వల్లభరాయఁడు శ్రీనాథుని కావ్యములందలి పద పద్య చరణ, భావములను సంగ్రహించెనో లేక శ్రీనాథుఁడె మాతృక నెఱింగి యుండి గాని, వల్లభరాయ కృత క్రీడాభిరామమును జూచియుండి గాని, తన కావ్యముల నట్టి సంకలనము నొనర్చి యుండెనో నిర్ణయించుట కష్టము. ఆ రెండు కృతులు ఆంధ్రుల యదృష్ట వశమున లభించునంత దనుక, నిట్టి వాదములు నెలకొల్పి, విమర్శనములు పెం పొందించుట విద్వన్మణుల ధర్మము కాదు

శృంగార వర్ణనము లతివేలముగ కాముకీ కాముక క్రీడలు వర్ణించునవిగా సంస్కృత సాహితీ సాంయాత్రికులైన మహా కవులు భాణములను, ప్రహసనములను గీర్వాణ భాషలో వ్రాసి యున్నారు. అట్టి కావ్యము దేశ భాషలలో రచింపఁబడక పోవుటచే పండితులకే గాని పామరుల పాలఁబడకుండెను. త్రిపురాంతకుని ప్రేమాభిరామ మట్టిది. దీని ప్రతిక యైన క్రీడాభిరామము దానివి బోలనదే. శ్రీ ప్రభాకరశాస్త్రిగారు వ్రాసినట్లు ఇది యొక చెట్ట పుస్తకము. ఇట్టి గ్రంథమును సంస్కృత సాహిత్య సమరాంగణ సవ్యసాచి యగు శ్రీనాథుఁ డాంధ్ర భాషా కృతిగా వెలయించి, దానికి వల్లభరాయని పేరిడె ననుట యతని ప్రౌఢ సాహిత్యమునకు, పౌరుష ప్రభావమునకు, అజిహ్మ స్వాంతమునకు వెలి గాత మరి యొండు గాదు. క్రీడాభిరామములోని శృంగార మ.తయు శృంగార కవి యగు త్రిపురాంతకుని కృతమే యైయుండును. ఇయ్యది ఆమూలాగ్రముగ వల్లభరాయ కృతమే యైయుండును. నే నిదివఱకు వ్రాసినటుల ప్రేమాభిరామ కృతి యాంధ్రుల యదృష్ట వశమున లభించెనా, ఉభయ వాదముల బండారము బయలుపడు ననుటకు సందేహము లేదు.

(శ్రీనాథుని కవిత్వ తత్త్వము, పీఠిక, పు-27, 31)

# పరిష్కరణము-పాఠ నిర్ణయము

సంస్కృతాంధ్ర సాహిత్యములలో ఆకృతిని చిన్నవయ్యును, కవితా ప్రకర్షచేఁ బ్రతి పద్య రసోదయ మహనీయములై, ప్రశస్తి గాంచిన కృతులు రెండు-మేఘసందేశము, క్రీడాభిరామము.

ప్రాబంధిక కవితా ప్రియంభావుకులైన ఆంధ్ర కవులు సంస్కృత రూపకములను సైతము ప్రబంధ పక్కికలో పరివర్తింపఁ జేసియుండుటకు ప్రబోధచంద్రోదయ- శృంగార శాకుంతలాదులు ప్రబల నిదర్శనములై కానవచ్చుచున్నవి.

ఒక విధముగ క్రీడాభిరామము దశ విధ రూపకములలో అన్యతమ మగు 'వీథి'కిఁ జేరిన సంస్కృత ప్రేమాభిరామమునకు అనువాద గ్రంథము. ఇది వీథీ లక్షణములతోడను, బందుర ప్రబంధ నిబంధనములతోడను గూడిన ఏకాశ్వాస రూపక మిశ్ర ప్రబంధము. చారిత్రకముగను, విశిష్ట రచనా రామణీయకముగను, శృంగార హాస్య రస పూరముగను పరిఢవిల్లిన ఈ లఘు కృతికిఁ గల ప్రచారము అప్రతిమానము.

ఈ క్రీడాభిరామ కర్తృత్వ విషయమై విజ్ఞులు విభిన్నాభిప్రాయములు గలిగియున్నారు; పెక్కు వాదోపవాదములు వెలయించి యున్నారు. వాని సారాంశ మిది:

(1) ప్రస్తావనలోని సూత్రధార కృత కవిప్రశంసయందును, ఆశ్వాసాంత గద్యమునందును, స్పష్టముగా ఇది వల్లభామాత్య కృతిగాఁ బేర్కొనఁబడినది. ఇది ప్రబలమైన గ్రంథస్థ ప్రమాణము,

(2) పదములు, పదబంధములు, సమాసములు, శైలి మున్నగునవి శ్రీనాథుని ముద్ర గలవి. అతని పద్యములు గూడఁ గొన్ని యిందుఁ గన్పట్టుచున్నవి అప్పకవి మున్నగు ప్రామాణిక లాక్షణికు లిందలి పద్యములను శ్రీనాథునివిగఁ బేర్కొనిరి. కవీంద్రుల కాంక్షిత ములను బూరించు కల్పవృక్ష మగు వల్లభామాత్యునకు శ్రీనాథుఁడే యాతనిపేర ఈ కృతిని వ్రాసి యిచ్చి యుండును.

(3) కృత్యాద్యంతములయందలి పద్యములు, కృతియందుఁ గొన్ని పద్యములు అచ్చముగా శ్రీనాథునివే. మిగిలిన భాగము వల్లభామాత్య ప్రణీతము. ఆ రచనా భాగము శ్రీనాథుని కవితకంటెఁ గొంత భిన్నమైనది; అపకర్షక మైనది. ప్రయోజనాపేక్షితుఁ డగు శ్రీనాథుఁడు వల్లభామాత్యునకుఁ గావ్య రచనోద్యోగమున - అల నన్నయ్యకు నారాయణభట్టు నట్లు-తోడుపడి యుండును.

(4) వల్లభామాత్యుఁడు శ్రీనాథుని కవితయం దపార మమ కారము గలవాఁడు. అతని కవితా రీతులను సంపూర్ణముగా ఆకళించు కొని యనుకరించినవాఁడు. కొన్ని పద్యములను సైతము దన కృతిలో ఆదరభావముతో సంతరించుకొన్నవాఁడు. పెద్దనాదులును శ్రీనాథుని అనుకరించినవారే. కాని 'తద్రచనయకా' అను రీతి అనుకరించిన వాఁడు ఒక్క వల్లభరాయఁడే.

ఏవం విధ విశిష్ట కావ్యమును బరిష్కరించుటలో మాకు ఉపకరించిన ముద్రి తాముద్రిత ప్రతులు:

(1) తంజావూరు సరస్వతీ మహలు గ్రంథాలయమందలి తాళపత్ర ప్రతి (డి. నం. 512).

(2) శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారిచేఁ బరిష్కరింపఁబడిన ప్రతి
విస్మృత కవులు-సంపుటము-1,
వనప ర్తి; (1909)

(3) శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారిచేఁ బరిష్కృతమై, విపుల పీఠిక గల ప్రతి,
శ్రీ ప్రభాకర పరిశోధక మండలి,
ప్రచురణము-5, తృతీయ ముద్రణము,
హైదరాబాదు, (1960)

(4) శ్రీ బండారు తమ్మయ్యగారిచేఁ బరిష్కృతమైన ప్రతి,
వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్,
చెన్నపురి; (1960)

(5) శ్రీ వి. యన్. శాస్త్రిగారి పీఠిక గల ప్రతి,
నవోదయ సమితి, నారాయణగూడ,
హైదరాబాదు-29, (1968)

మానవల్లివారి ప్రతికిని, వేటూరివారి ప్రతికిని మొదటఁ బేర్కొనఁబడిన తంజావూరి తాళపత్ర ప్రతి యొక్కటియ యాధారమైనది. వావిళ్ళ ప్రతికిని, నవోదయసమితి ప్రతికిని బూర్వ పూర్వ ముద్రిత ప్రతు లాకరములు.

మూల ప్రతి యగు తాళపత్ర ప్రతి శుద్ధమైనది గాదు. అందు అక్షర దోషములు మెండు, క్రిమి దష్ట భాగములు, గ్రంథపాతములు కొంత కన్పట్టుచున్నవి. వ్రాఁత చక్కనిది. అర్థావగతికై పూర్వ పరిష్కర్తలు కొన్ని పట్టుల సమంజసములైన సవరణములఁ జక్కదిద్దిరి; కొన్నింటిని బరిత్యజించిరి. అట్లు పరిత్యక్తములైన పాఠములలోఁ గొన్ని సరసములు, సందర్భోచితములుగఁ గన్పట్టుటచే వానినిందుఁ బ్రధాన పాఠములుగఁ బరిగ్రహించితిమి, మరి కొన్నింటిని పాఠాంతరములుగఁ గైకొంటిమి. పాఠాంతరముల సంజ్ఞా వివరము లివి:

1. మూ. ప్ర. (మూల ప్రతి) తంజావూరి తాళపత్ర ప్రతి.

2. మా. మానవల్లి రామకృష్ణకవిగారి ముద్రిత ప్రతి.

3. వే. వేటూరి ప్రభాకరశాస్త్రిలవారి ముద్రిత ప్రతి.

4. త తమ్మయ్యగారు పరిష్కరించిన వావిళ్ళ ప్రతి.

వ్రాఁత ప్రతినుండి గ్రహింపఁబడిన ప్రధాన పాఠములలోఁ, బాఠాంతరములలోఁ గొన్ని:

ప 1 (1) వీథి, రస భావ భావనా వీథి లెస్స
(2) వివిధ రస భావ భావన వీథి లెస్స

ఈ ప్రథమ పద్యమున రూపక ప్రభేదమగు 'వీథీ' ప్రశంస గలదు. ఇది యొక విధముగా ఈ కావ్య నిర్దేశ సూచకముగఁ గూడఁ గన్పట్టు చున్నది.

దశ విధ రూపకములలో-రస భావ భావనా వీథి-యగు వీథి మేల్తరమైనది. అనఁగా శృంగారాది రసముల యొక్కయు, రత్యాది భావములయొక్కయు భావనలకు (తలఁపులకు) వీథి వంటిది, వీథి యను ఈ రూపకము. ఈ నిర్వచనములో 'వీథీవ వీథీ' యను వీథీ సామాన్య లక్షణము ప్రవచింపఁబడినది. ముద్రిత ప్రతులలోని రెండవ పాఠమున ఈ యర్థ సారస్యము కానరాదు

మరొక సంగతి:

రస భావ భావనా - అను సమస్తపదము ఇందే మరొకచోటఁ గవి ప్రయుక్తమై కన్పట్టుచున్నది.

రస భావ భావ నామోద మధురంబుగా శాతోదరు లభినయిం
చెదరు (ప. 257)

శ్రీనాథుని భీమేశ్వర పురాణమునందును సంస్కృత కవీంద్ర స్తుతిలోఁ బై సమాన మట్లు కన్పట్టుచున్నది.

ప్రణుతింతు రస భావ భావనా మహనీయ
కవితా సముల్లాసుఁ గాళిదాసు, (1-7)

ప. 7 (1) నయ నీతి స త్కళా, న్వితుఁడు చెన్న మంత్రి ....
(2) నయ నీతి స త్కళా, న్వితుఁడు చంద్ర మంత్రి ....

మంచనార్యునకును తిప్పమకును పింగన్న, తిప్పన, మల్లన, చంద్రమంత్రి యను నలువురు కుమారులు కలిగిరి. వారిలో చంద్ర మంత్రికి 'స త్కళాన్వితుఁడు' అను అన్వర్థ విశేషణ మొకటి గలదు.

ముద్రిత ప్రతుల పాఠములోని చెన్నమంత్రి కీ విశేషణము వలన సార్థక్యము కానరాదు.

నక్షత్రములతోడను, పదునాఱు కళలతోను సొబగొంది, విరాజిల్లువాఁడు ఆ చంద్రుడు. ఉత్తమ కళల (విద్యల)తో వన్నెకెక్కిన వాఁడు ఈ చంద్ర మంత్రి. తరువాతి పద్యమందు వర్ణితుఁడైన చంద్రమంత్రి, యితనికి అగ్రజుఁడైన పింగనకు సుతుఁడు. ఈ వంశ మునఁ జంద్రామాత్య నామధేయులు పలువురున్నారు.

ప. 54 (1) ధర్మదార పట్టించుచు నున్నవాఁడదె
(2) దమ్ముదార పట్టించుచు నున్నవాఁడదె
(3) దమ్మదార పట్టించుచు నున్నవాఁడదె

మొదటి పాఠము వ్రాఁత ప్రతిలోను, వేటూరివారి ప్రతిలోను గన్పట్టుచున్నది. రెండవ పాఠము మానవల్లివారిది. మూఁడవ పాఠము వావిళ్ళ, నవోదయసమితి ప్రతులయందలిది.

ఈ పద్యమునఁ బ్రభాతము వర్ణితమైనది. తెల్లవారుచున్నది. మన్మథుఁడు రాతిరి యంతయు సతీ పతులను శయ్యలపైఁ బోరించి, తెల్లవారఁగనే విజయ సంకేతముగ బూరగ పట్టించుచున్నాడా? యనునట్లు కోడి కూసినది - అని భావము.

ఇందలి ధర్మదార శబ్దముపై నొక యాక్షేప మున్నది.

*మానవల్లివారి ప్రతిలో 'దమ్మదార' అను పాఠము కన్పట్టుచుండఁగా, దానిని ప్రభాకరశాస్త్రిగారు 'ధర్మదార' అని మార్చివేసిరనియు, ధర్మ శబ్దమునకుఁ బ్రాకృత రూపము 'దమ్మ' కావున, నిచ్చట 'ధర్మదార' అను మిశ్రమాసముకన్న 'దమ్మదార' అనెడి అచ్చిక రూపము కవ్యుద్దిష్టమై యుండును - అని తమ్మయ్యగారు అభిప్రాయపడుచున్నారు.

అసలు 'ధర్మదార' పదము మూలప్రతియందలిది. దానిని యథాతథముగ వేటూరివారు ఉద్ధరించిరి. తత్పాఠ సామంజస్యమునకుఁ గొన్ని యుపపత్తులను గూడఁ జూపిరి.

ఇఁక ఈ 'ధర్మదార' పదము మిశ్రసమాసమును గాదు. సమాస మైనచో ధర్మ-దార శబ్దములు రెంటికి నర్థము చెప్పికొనవలయును. ఇందు దాని కవకాశము లేదు. ఇది ఏక పదము, తత్సమ పదము వలె భ్రాంతిని గలిగించును. కాని యిది దేశ్యపదము.

ఈ కవియే యొకచో ఈ 'ధర్మదార' పదమునకు అర్థమును వివరించుచున్నాఁడో యనునట్లు కోడిని శ్లాఘించుచు " కామ విజయ కాహళములార" (ప. 236) యని సంబోధించియున్నాఁడు. అనగా, కోడి - కామవిజయ కాహళము. దాని కూఁత కాహళ ధ్వని.

ఈ 'ధర్మదార' పదము ఈ యర్థమున, ఇట్టి సందర్భమునందే కావ్యాంతరములందుఁ బ్రయుక్తమైయున్నది:

క. అనవుడు; నేటికి భ్రమసెదు?
విను, వృద్ధశ్రవుఁడ వౌట వినవో? యేలా
వినవైతి? కోడి కూసెం
దనరపమై మరుని 'ధర్మదార' యనంగన్.

(దశావతార. పు, 225)

---

*శ్రీడాభిరామ పాఠములు; పు-22;
ఆం. సా. ప. పత్రిక, (సం. 40; సం. 4-6)

ఉ. నారులఁ బ్రాణనాథుల ఘ
    నంబుగ నా పురిలోన రేయిఁ దా
నేరుపుమీఱ శయ్యల న
    నేక గతిన్ రతికేళి లీలలన్
బోరఁగఁజేసి, వేఁకువను
    బొల్పగు కుక్కుట కంఠ కాహళిన్
మారుఁడు 'ధర్మదార' రయ
    మారఁగ వే మొరయించె నొక్కెడన్.

(ప్రబంధమణి-ప. 811)

ఈ పద్యమున 'ధర్మదార' పదమునకు బదులుగా-తమ్ముదార అని మానవల్లి వారి పాఠము.

ప. 103 (1) గానుగ పట్టెపైఁ దిరుగఁ గట్టిడి టిట్టిభ
(2) గానుగ పట్టెపైఁ దిరుగఁ గట్టడిఁ డిట్టిభ

మొదటి పాఠము ముద్రిత ప్రతిలోనిది. ఇందలి 'కట్టిడి' శబ్దముపై ఆక్షేప మీ రీతి నున్నది:

*"ఇచట కట్టిడి యనఁగా భాగ్యము. అది సంపద చేడియను బోలు టెట్లు? కట్టిడి=దుష్టుఁడా! అని విశేషణ మనుకొన్నను బొసఁగ నేరదు."

గానుగను తోలుచుండిన యొక కంజాక్షి గానుగ పట్టెపైఁ గూర్చొని, తిరుపుటెద్దును మునికోలతో నదలించుచు, ఒక క్రమమునఁ బరిభ్రమించుచుండెను అపు డామె, క్షీర సాగరము మందరాచలముచే మథింపఁబడుచుండఁగా, అందలి యావర్తము నధిష్ఠించియుండిన యాదిలక్ష్మియో యనునట్లు అలరారుచుండెను.

కట్టడిన్=నియమముతో. ఇది వ్రాఁత ప్రతి పాఠము. గానుగ పట్టెపైన్, కట్టడిన్, తిరుగన్-అని యన్వయము.

---

*చూ. శ్రీనాథ కవితా సమీక్ష; పు. 94

ప. 130 (1) ఆలాపమున శుద్ధ సాళవ సంకీర్ణ....
(2) ఆలాపమున శుద్ధ సాళగ సంకీర్ణ....

సాళవ-అను పాఠము ముద్రిత ప్రతిలోనిది; అర్థ రహిత మైనది. వ్రాఁతప్రతి 'సాళగ' అను సాధు పాఠమును దెల్పుచున్నది.

సంగీత శాస్త్రమున 'సాళగ' శబ్ద మొక పారిభాషిక పదము. దీనికిఁ బూర్వ రూపము ఛాయలగ-అని. ఇది వ్యవహారమున సాళగ-అని మార్పు చెందినది.

శుద్ధ, ఛాయలగ, సంకీర్ణ అని రాగములు ముత్తెఱఁగులు. ఇతర రాగ చ్ఛాయ లేనిది శుద్ధ రాగము. ఒక రాగమున మరొక రాగ చ్ఛాయ బెరసి యున్నచో, నది ఛాయలగ (సాళగ) రాగము. ఒక దానికంటె నెక్కువ రాగముల ఛాయ యున్న చో అది సంకీర్ణ రాగము. సాళగ రాగమున కుదాహరణముగ సౌరాష్ట్రి రాగమును గ్రహింప వచ్చును. ఇందు చక్రవాక మను మరొక రాగ చ్ఛాయ చేరియుండును.

ఒక్క బవనీల చక్రవర్తి పరశురామ కథను ఏక వీరాదేవి యెదుట,వాద్యములు మ్రోగుచుండ, జవనిక మీటుచు, వివిధ రాగములలోఁ బ్రౌఢి మెఱయఁ బాడె ననుట ప్రకరణార్థము.

ప. 131 (1) అలరుంబోఁడి జనంగమ ప్రమద మ
ధ్యానద్ధ ఘంటా ధ్వనుల్
(2)అలరుంబోఁడి జనంగమ ప్రమద మ
డ్డ్వానద్ధ ఘంటా ధ్వనుల్

ఒక ప్రమద మూర్ఛనా స్వరములచే రక్తి గులుక, వాద్య ములు తోడుపడ, కలకంఠ స్వనముతో ఏకవీరాంబపైఁ బాడెను.

ఈ సందర్భమున "మధ్యానద్ధ ఘంటా ధ్వనుల్" అని కొన్ని ముద్రిత ప్రతులలో పాఠము కన్పట్టుచున్నది. మధ్యానద్ధ = మొలను గట్టఁబడిన, ఘంటా = గంటల యొక్క, ధ్వనులు = శబ్దములు - అని యర్థము. నడుమునకుఁ గట్టఁబడిన గంటలు అభినయ సందర్భమునఁ

గాని మ్రోగవు. ఆమె నిలిచి పాడుచున్నది. కాని యభినయించు చున్న సూచన యిందుఁ గానరాదు. కావున ఇక్కడ ఘంటా ధ్వనుల కవకాశములేదు.

ఇందు ఆనద్ధము, ఘంట వాద్యములు. మద్యానద్ధ అనుచోట-మద్వానద్ధ-అని వ్రాఁత ప్రతిలోను, మానవల్లివారి ప్రతిలోను గల పాఠము. మడ్డు - ఒక వాద్యప్రభేదముగాఁ బేర్కొనఁబడినది :

వాద్య ప్రభేదా డమరు మడ్డు డిండిమ ఝర్ఝరాః।

(నామలిం 1-నాట్య)

ప. 209 వ్యామగ్రాహ్య నితంబ బింబ కుచ హా
రాభీల భద్రాకృతుల్

ఇది ముద్రిత ప్రతులయందలి పాఠము. ఈ పద్యమున శ్రీకాకుళము తిరునాళ్ళలోని వెలనాఁటి కోడె విధవల స్వరూప స్వభావాదులు వర్ణితములైనవి.

ఇందలి-వ్యామగ్రాహ్య, హార, భద్రాకృతి శబ్దములపై ఆక్షేప మీ రీతి నున్నది:

*"ఇచట వ్యామ గ్రాహ్య పదమున కన్వయము కుదురదు. వ్యామ గ్రాహ్యము నితంబ బింబమా? లేక కుచములా? లేక ఉభయ మునా? నితంబ బింబము వ్యామ గ్రాహ్య మనిన నెడబరముగా నుండును....

వెలనాటి పొగరుబోతు విధవ లయినపుడు వారు కుచములపై హారములు దాల్చు టెట్లు? ఏ తులసి పూసల పేరయినఁ దాల్చిన, దానిచే భద్రాకృతి యేర్పడు టెట్లు?"

'కుచ భా రాభీల భద్రాకృతుల్' అని వ్రాఁతప్రతి పాఠము. ఇందు 'హార' ప్రసక్తియే కానరాదు. వారు వ్యామ గ్రాహ్య నితంబ

* చూ. శ్రీనాథ కవితా సమీక్ష; (పు. 110, 111)

బింబముచేతను, కుచ భారముచేతను వెక్కసమై చూపట్టు సుందరా కృతులు గలవారు. 'వ్యామ గ్రాహ్య' పదమును వితంబమునకు విశేషణముగఁ గూర్చుట క్రొత్త కావచ్చును. వారు - అతి ఘన జఘనలు, పీన పయోధరలు-అని భావమును మాత్రము గ్రహించుట సరసము.

వ్యామ గ్రాహ్య (బారెఁడు) పరిమాణమునె 'ఎడబరముగా' ఉండు నను కొన్నచో-

"*కటి యొకచే ధరిత్రి నవ ఖండము లేలఁగఁజాలు" ఇత్యాది కవి ప్రయోగము లేమి కావలయును? కవుల భావనలు గొంత యతిశయముగా నుండును. అదియు నొక యలంకారమే!

కొన్ని లాక్షణికాంశములు:

ప. 61 మాఁగిలి మాఁగిలి, వృక్షము
పూఁగొమ్మన నుండి షడ్జము ప్రకాశింపన్
లేఁగొదమ నెమలి పల్కెడుఁ
గేఁగో యని, వైశ్య! మనకు గెలుపగుఁ జుమ్మీ!

పై పాఠము ముద్రిత ప్రతులయందుఁ గలదు. ఇందు నెమలి కూఁత తమ విలాస యాత్రకు విజయ సూచకముగ మంచనశర్మచే నభివర్ణితమై యున్నది.

ఇందు నెమలి 'కేఁగో'అని కూసినట్లు చెప్పఁబడినది. ధ్వన్యను కరణ శబ్దములలో అర్ధబిందువునకు నవకాశ ముండునా? మరి ప్రాస నిబద్ధమై యున్నది. ఆ కూఁత అసహజముగఁ గూడఁ గన్పట్టుచున్నది.

వ్రాఁత ప్రతిలో 'కెంగో' అని నెమలి కూఁత పేర్కొనఁబడినది. ఈ ధ్వని సహజ సుందరమై కన్పట్టుచున్నది. వ్రాఁత ప్రతిలో పద్య మిట్లున్నది:

---

* చూ. శశాంక విజయము 3-38.

మాంగిలి మాంగిలి వృషము
పూంగొమ్మనుండి షడ్జము ప్రకాశింపన్
లేంగొదమ నెమలి పల్కెడుఁ
గెంగో యని వైశ్య మనకు గెలుపగుఁ జుమ్మీ

ఇందు 'కెంగో' అను పాఠము వ్రాన వినిహితమై యున్నది. కావున మిగిలిన మూఁడు పాదములయందును బూర్ణబిందుయుత పాఠమును గ్రహింపవలయును దీర్ఘము మీఁద సాధ్యపూర్ణము లేదు (బాలవ్యా. సంజ్ఞ-15) అని వ్యాకర్తల యనుశాసనము. కాని, నన్నెచోడకవి ప్రాస స్థానమున సాధ్య పూర్ణబిందు ప్రయోగములను కెక్కింటిని జొప్పించియున్నాడు:

1 వీంగు నపార సత్త్వ గుణ విస్ఫురణం బరమేశ్వ రోరు వామాంగమునందు .. (1-4)

2 వీందె బలుండు దక్షుఁడను....(2-8)

వ్రాఁత ప్రతిలో ఖండబిందు స్థానమునఁ బూర్ణ బిందువును నిక్షేపించు సంప్రదాయ ముండుటచేతను, పై పద్యప్రాసమునఁ బూర్ణబిందు ఘటిత పాఠమును సమర్థించు తత్సమ పద సంయోజనము ఒక్కటియు లేనందునను కవి ప్రయుక్త పాఠమును ఇదమిత్థమని నిర్ణయింప వలనుపడకున్నది.

ప. 178 (1) మ్రోక లిడినారు కాశ్మీర-మృగమదమున
(2) మ్రుగ్గు లిడినారు కాశ్మీర-మున ముదమున

మొదటి వ్రాఁతప్రతి పాఠమున వట్టువసుడితో రేఫమునకు (ఋ+రో) యతి గూర్పఁబడినది ఈ యతిని అప్పకవి మొదలగు ఛందోవేత్తలు పేర్కొనలేదు. *ఇట్టి యతి విశేషము భాస్కరరామాయణములో నొకచోఁ గన్పట్టుచున్నది.

క్రూరార్ధ చంద్రాస్త్ర-కృత్తోరు బాహులై (యుద్ధ. 1448)

*చూ. తెలుఁగు భాషలో ఛందోరీతులు; పు. 809.

రెండవ పాఠము ముద్రితప్రతులలోనిది. ఇందు 'యతి' పవరింపఁబడినది. కాని, కాశ్మీరము (కుంకుమము) న ముగ్గు లిడినా రని చెప్పి, వెంటనే "వ్రాసినా రిందు రజమున-రంగవల్లి" యని చెప్పఁబడినది. ముగ్గు, రంగవల్లి సమానార్థములు కావా? పునరుక్తి దోష మనివార్యమైనది.

ప 199 (1) ధృతిఁ గూర్చికొన్నది-ధూర్త దేవత నిన్ను
(2) దొరఁ గూర్చికొన్నది-ధూర్తదేవత నిన్ను

మొదటి పాఠము వ్రాఁతప్రతిలోను, మానవల్లివారి ప్రతిలోను గలదు

ఇందు వట్రువసుడికి - ఉకారముతో (ధృ+ధూ) యతి గూర్పఁబడినది. ఇది యప్రశస్త మని లాక్షణికుల యభిప్రాయము.

కొన్ని ప్రతులలో 'ధృతి'పాఠాంతరముగఁ గైకొనఁబడినది.

ప. 209 ఆ మాంధాళల భీమసేనుఁడు హిడిం
బాధీశ్వరుం డోపునో, యేమో కాని....

ఇది వ్రాఁత ప్రతి యందలి పాఠము. ఇందలి 'మాంధాళల' అను పదమునకు బదులుగ - మాంధాత్రుఁడు, మాంధాళుఁడు - అను పదములు ముద్రిత ప్రతులలోఁ గన్పట్టుచున్నవి. వీరు కామకళాకుశలు లని ప్రసిద్ధి లేదు. మాంధాళుఁడు-ఎవరో తెలియరాఁడు.

మాంధాళలు-అన్నది యపూర్వ ప్రయోగము. ఇది వెలనాటి కోడె విధవలకు విశేషణము. వారు కామాంధలు. వారి రతిక్రీడలో నొక భీమసేనుఁడు మాత్రము తెమల్పఁగలఁడేమో! ఎందులకనఁగా అతఁడు హిడింబాధీశ్వరుఁడు. హిడింబ మానవ కాంత గాదు; రాక్షస యువతి గదా! ఇందే-

(1) తెరల్పఁజాల రితరుల్-మెవ్వార లత్యుద్ధతిన్

(2) తెమల్పనేర రితరుల్-హేలా రతి క్రీడలన్

మొదటి పాఠము వ్రాఁతప్రతిలోనిది. ఇందు 'విసంధి' అను దోషము కన్పట్టుచున్నది.

ప. 214 (1) చెలఁగి చెలఁగి పాత్తిచీర గట్టెడు మాచ
కమ్మకుఁ జాల దీ-ర్ఘాయు రస్తు
(2) చెలఁగి చెలఁగి పాత్తిచీరలు గట్టెడు
మాసకమ్మకు దీర్ఘ మాయు రస్తు

మొదటి పాఠము వ్రాఁతప్రతిలోను, మానవల్లి వారి ప్రతిలోను గలదు. ఇందుఁ బాదమందలి రెండవ యతి స్థానమున 'నామాఖండ యతి' వంటిది గూర్పఁబడినది, రెండవ పాఠము వేటూరివారిది. అందు 'అఖండ యతి' కన్పట్టుచున్నది.

మరొక సంగతి :

ఈ పద్యమందలి ఎత్తుగీతిలో 'వదరుఁబోఁడి' అను ప్రయోగ మొండు ముద్రిత ప్రతులయందుఁ గాన నగుచున్నది. ఇందు 'బోఁడి' పదము, ఉపమానంబు మీఁది మేనునకు ఆదేశముగ వచ్చినది కాదు (చూ. బాలవ్యా; సమాస-23.). ఇఁక, వదరులు గలది కావున వదరులాఁడి-అని కాఁదగును (చూ. బాలవ్యా; తద్ధిత-22). కాని వ్రాఁత ప్రతిలో 'వదరుఁగల్కి' అను పాఠము కన్పడుచున్నది. ఇందు-కల్కి పదమునకు వదరు శబ్దము విశేషణముగా విహితమై యున్నది. ఇది నిర్బాధక ప్రయోగము.

ప. 242 (1) ఆ మధుమావతి దా-క్షారామమునఁ బుట్టు
(2) ఆ సుందరాంగి ద-క్షారామమునఁ బుట్టు

మొదటి పాఠము వ్రాఁత ప్రతిలోనిది. ఇందు వర్ణాధిక్యముచే 'ఛందో భంగ' మేర్పడినది.

మరొక సంగతి :

ఈ పద్యమున మధుమావతియొక్క భూత వర్తమాన భావి

కాలములయందలి పుట్టుక, జాతి ప్రకారములు వివరింపఁబడినవి. గంధర్వకన్య యగు కమలపాణి, యిప్పుడు ఓరుగల్లున మధుమావతి నామమున వెలయుచున్నది. ఇఁక ముందు దక్షారామమున సత్ స్త్రీ జాతియందు సానికూఁతురై పుట్టి, చిన్నిపోతి నామము దాల్చి, చిర కాలమునకు నందలి శివుని గూడి యుండఁగలదు-అను ప్రకరణమున చిన్నిపోతి వేశ్య కులమున జన్మించియు, 'సత్ స్త్రీజాతి' యని యామె జాతిని అభివర్ణించుట యెట్టిదో యస్పష్ట విషయమై యున్నది.

వ్రాఁత ప్రతిలో "అప్సరస్ స్త్రీ జాతి యా సాని కూఁతురు" అను పాఠము కన్పట్టుచున్నది. దక్షారామ మందలి సాను లందఱు భీమేశ్వరుని గొలువ వచ్చిన యచ్చెర మచ్చెకంటు లని భీమఖండము వలన స్పష్టపడుచున్నది:

ఎ గీ. సంభవించిరి గంధర్వ జాతి వనినఁ
గలితసం బేల పెన్నాటకంబు సేయ
ననఁగ, భీమేశ్వరుని గొల్తు ర పురమున
సాను లను పేరి యప్సర శ్చంద్రముఖులు (భీమేశ్వర- 1-88)

ప. 265 (1) త ద్ద్విజుం డా తొత్తుఁ బ్రా-తఃకాలమునఁ జూచి

(2) దాని నా ద్విజుఁడు ప్రా-తఃకాలమునఁ జూచి

మొదటి పాఠము వ్రాఁతప్రతిలోనిది. ఇందును వర్ణాధిక్యము చే ఛందో భంగ దోష మేర్పడినది.

ప. 82 (1) కందుక కేళి సల్పెడు ప్రకారమునన్

(2) కందుక కేళి సల్పెదు ప్రకారమునన్

మొదటి పాఠము పూర్వ ముద్రిత ప్రతులయందలిది. రెండవ పాఠము వ్రాఁతప్రతి లోనిది. ఇందు 'ద-డ' ప్రాసము కన్పట్టు చున్నది. ముద్రితమై యుండు 'శ్రీనాథుని వీథి' యనఁబడు చాటు పద్య సంకలన గ్రంథము నందును ఈ 'ద-డ' ప్రాసమే కన్పట్టు

చున్నది (చూ. ప: 4). అప్పకవియు వ్రాఁత ప్రతియందుఁ గనుపట్టు 'ద-డ' ప్రాస పాఠమునే గ్రహించి, వీథినాటకములోనిదిగఁ జేర్కొని, దీనిని 'అప్రశస్త ప్రాసమ'ని నిరసించియున్నాఁడు.

కందుక శబ్దము, కందుక శబ్దమునకుఁ బర్యాయ పదము. దీనిని బూర్వ పరిష్కర్తలు ప్రాస స్థానమున నిడి, ప్రాసమునకుఁ బ్రాశస్త్యమును సంఘటింపఁజేసియున్నారు.

విలక్షణ ప్రయోగములు :

పద్య సంఖ్య.

75 పిన్నటి కౌఁదీఁగ

86 పసివాళ్వాడు (పసివాడు)

128 ముయ్యేడు (మూఁడు + ఏడు) చూ. (ప్రౌ. వ్యా. సమాస-10)

130 జవనికందు (జవనికయందు)

1:2 అమ్మయ్యకు న్నెకవీరమ్మకు (ద్రుత ద్విత్వ సంధి)

136 జీవగఱ్ఱ (చూ. బాల. సంజ్ఞ-28)

260 ప్రసవాంత్యమున న్నేలా (ద్రుత ద్విత్వ సంధి)

159 తెల్లనాకు (తెల్లని+ఆకు)

166 నే (నేయి)

,, పెసర్పప్పు (పెసరపప్పు)

226 ఆవుర్న (ఆవురన)

258 క్రీడించెదర్ (చూ. ప్రౌ. వ్యా; శబ్ద-16)

265 వెళ్ళ (వెడలి)

274 కన్నింగలము (కన్ను+ఇంగలము)

చూ. ప్రౌ. వ్యా; సంధి-10

నాఁటి పలుకుబడులు:

142 చంద్రమల్లెలు
,, హొన్నాళము (హొన్ను+నాళము)
159 తేఁడు (అ. దే)
,, బాఁడు (బాపఁడు)
173 గాలాము
175 పెరుమాళ్ళు (అ. దే)
185 సురతాణి (,,
193 ఆడియాలము (అ. దే.)
210 తిరునాళ్ల (అ. దే)
263 టక్కెము (టెక్కెము)
265 గుల్లాము (అ. దే)
287 ౖవయించు (వ్యయించు)
,, ఏలా (ఎల్ల)
288 దొరసెము
289 సొన్నాటంకము(సొన్నము+టంకము)

వ. 32 ఈ పద్య భాగము ముద్రిత ప్రతిలోఁ గ్రింది రీతి నున్నది.
కుక్కుర పరివార కోటి సేవితునిచే
వెలఁది కోఁతుల మోము వేల్పుచేత
.... .... .... .... .... .... .... .... .... ....
.... .... .... .... .... .... .... .... .... ....

తే. విశ్వ విశ్వంబు పాలించు విభునిచేతఁ
బార్వతీదేవి గారాపుఁ బట్టిచేత
నీప్సితముఁ గాంచు తిప్ప మంత్రీంద్రతనయుఁ....
వ్రాఁత ప్రతియందలి పాఠము.
కుక్కుర పరివార కోటి సేవితునిచే
వెలఁది కోఁతుల మోము వేల్పుచేత

.... .... .... .... .... .... .... .... .... .... .... ....

విశ్వంబు పాలించు విభునిచేత

.... .... .... .... .... .... .... .... .... .... .... ....

తే. పార్వతిదేవి గారాబు పట్టిచేత
నీప్సితముఁ గాంచు తిప్ప మంత్రీంద్రతనయుఁ

వ్రాఁతప్రతియందలి సీసపాదముయొక్క ఉత్తరార్ధము, ముద్రిత ప్రతిలో ఎత్తు గీతికిఁ బ్రథమ పాదముగ మార్పఁబడినది; ఒక 'విశ్వ' శబ్దము పాదాదియందు నధికముగఁ గూర్పఁ బడినది. లుప్త పాదము ఎత్తుగీతికిఁ జెందినదిగా నెన్నఁదగినది.

ఈ పరిష్కరణమునందు స్వీకరింపఁబడిన పాఠములు పాఠాంతరములు సహృదయామోదములు కాఁగలవని యాశయము.

సంపాదకులు

# క్రీడాభిరామము

[ప్రస్తావన: రూపక భేద మగు వీథీ ప్రశస్తి - కృతికర్త వంశ ప్రశంస (ప్రరోచనము) - వల్లభామాత్యుని పాండితీ వైభవాదికము - మూల గ్రంథ మగు ప్రేమాభిరామ ప్రశంస - దేశ భాషలందుఁ దెనుఁగు లెస్స - పాత్ర ప్రవేశ సూచనము - సూత్రధారోక్తి.]

## ప్రస్తావన

### రూపక భేద మగు వీథీ ప్రశస్తి

తే. గణన కెక్కిన దశ రూపకములయందు
*వీథి, రస భావ భావనా పీఠి లెస్స;
యే కవీంద్రుఁడు రచియించె నీ ప్రబంధ
మనుచు మీ రానతిచ్చెద, రైన వినుఁడు: 1

### కృతికర్త వంశ ప్రశంస (ప్రరోచనము)

సీ. అఖిల ప్రపంచంబు నన్యథా కల్పించెఁ
బటు రోష రేఖ సాఫల్య మొందఁ,
దైత్యశంకవం బైన తారకా మండలం
బాకాశ మార్గంబునందు నిలిపె,
మాలినీ తీర నిర్మల సైకతములలో
మేవ కాప్సరసతో మేల మాడె,

*వివిధ రస భావన వీథి (మా)

నామ్నాయ మాత గాయత్రీ మహాదేవిఁ
బ్రణుతించి బ్రహ్మర్షి పదము గాంచె.

తే. నెవ్వఁ, డాతండు సామాన్య ఋషియె తలఁపఁ?
దాటకా కాళరాత్రికి, దాశరథికిఁ,
గాలకంధర కోదండ ఖండనునకుఁ
గార్ము కాచార్య వర్యుండు, గాధి సుతుఁడు. 2

స్ర. ఆ విశ్వామిత్రు గోత్రం బను జలనిధి యా
హ్లాదముం బొందు చుండన్,
భూ విఖ్యాత ప్రభా వాభ్యుదయుఁ డుదయముం
*బొందె మంచన్న కీర్తుల్,
ద్యావాపృథ్వ్యంతరా ళాంతరముల నతి ని
స్తంద్ర చంద్రాతప శ్రీ
ధావళ్య స్ఫూర్తి లక్ష్మీ తరళకర కళా
ధాళధళ్యంబు సూపన్. 3

శా. ఆ మంత్రీశ్వరు కూర్మి నందనుఁడు, చంద్రామాత్యుఁ డంభోజ భూ
భామారత్న పయోధర ద్వయ తట ప్రాలంబ నైపథ్య ము
క్తా మాణిక్య సభాభిరూప్య పద వాక్య ప్రౌఢ సాహిత్య వి
ద్యా మాహాత్మ్య విలాస సమ్ముదిత విద్వన్మానసుం డిద్ధరన్. 4

శా. కర్ణాట క్షితినాథుఁడైన పెద బుక్కక్ష్మాప దేవేంద్రు న
భ్యర్ణామాత్యుని, దాన ఖేచరునిఁ, జంద్రాధీశు, బంధు ప్రియున్
వర్ణించున్ గవికోటి, శంకర జటా వాటీ తటాంత ర్నటత్
స్వర్ణ ద్యంబు తరంగ రింఖణ లస త్సాహిత్య సౌహిత్యయై. 5

క. ఆ చంద్ర మంత్రిమణికిని,
బోచాంబా రత్నమునకుఁ బుట్టెను, బుధ ర

* నాచంద్ర (మూ. ప్ర)

క్షి చణుఁడు, మంచనార్యుఁడు,
వాచస్పతి సదృశ బుద్ధి వైభవుఁ డగుచున్. 6

ఆ. మంచనార్య తిప్పమకును సుపుత్రులు
నలువు, రందు సింగనయును, దిప్ప
నయును, మల్లనయును, నయ నీతి సత్కళా
న్వితుఁడు 1చంద్రమంత్రి విభుడు ననఁగ. 7

గీ. సింగ నామాత్య సుతుఁడు; సుస్థిర గుణుండు,
మానినీ మన్మథుఁడు, చంద్ర మంత్రివరుఁడు
వెలసె వైభవముల దేవ విభునిఁ బోలి
సకల బుధ తతి యెల్లను సంస్తుతింప, 8

క. మిరుతూరి 2విట్టమంత్రీ
శ్వరు తనయ వరించె మల్ల సచివాగ్రణి, శం
కరుఁ డద్రిరాజ నందనఁ
బరిణయ మగు భంగి, నధిక భాగ్యోన్నతుఁడై. 9

ఉ. మల్లన మంత్రికిం ద్రిపురమా తరళాక్షికిఁ, గాంతి రోహిణీ
వల్లభు లాత్మ సంభవులు, వల్లభ లింగన తిప్పన క్షమా
వల్లభ మంత్రి శేఖరులు, వార వధూ జన పుష్పభల్లు, లు
త్ఫుల్ల యశో విభాసితులు, పుణ్యులు. సింగన భైరవేంద్రులున్. 10

వ. అందు, 11

సీ. తారకా మందార తా రాచలంబుల
తో రాయు నెవ్వాని చారు కీర్తి,
భావసంభవ భద్ర దేవేంద్ర సూనుల
మఱపించు నెవ్వాని మహిత మూర్తి.

---

1. చెన్న (మా, వే) 2. ..న్నమంత్రీ (మూ. ప్ర)

జీమూతవాహన శిబి సూర్యతనయుల
ధట్టించు నెవ్వాని దాన శక్తి,
భార్గవ గార్గ్య గీష్పతి మతి ప్రౌఢిమ
నిరసించు నెవ్వాని నిశిత బుద్ధి,
తే. యతఁడు, రిపు రాజ రాజ్య సప్తాంగ హరణ
కరణ పరిణత యుక్తి ప్రకాశమానుఁ,
డతులి తాచార విజిత గంగాత్మజుండు,
మర్త్య మాత్రుండె వల్లభామాత్య వరుఁడు? 12

సీ. వాచాల సురధునీ వీచికా గంభీర
వాచా విలాసుండు బైచమంత్రి,
పల్లవోష్ఠీ మాన సోల్లాస కృతి పుష్ప
భల్లావతారుండు మల్లవిభుఁడు,
పన్నగాలంకార పన్నీరజ ధ్యాన
సన్నుతాత్ముండు పోచన్న శౌరి,
ప్రత్యగ్ర సహజ సాహిత్య విద్యా కళా
న్నత్యుండు తిప్పనామాత్య ఘనుఁడు
తే. నందనులు, చంద్ర మందార కుంద కుముద
గంధకీ గంధసార సౌగంధ్య బంధు
బంధు రోదార కీర్తి సౌభాగ్య నిధికి,
మల్లికార్జు[1]ను పుత్రుఁడు వల్లభునకు, 13

మ. కనకాద్రిప్రతిమాన ధైర్య నిధి, లింగన్మాప మంత్రీంద్రుతో
నన తారాతి నృపాల మంత్రి జనతా హంకార తారాహిమా
ర్కునితో, రూప రతీంద్రుతో, హరిహర క్షోణీంద్ర సామ్రాజ్య వ
ర్ధనుతో సాటి, సమాన, మీరు గలరా రాజన్య పైవ్యాధిషలీ? 14

ఆ. తిప్పమంత్రి జగ దుదీర్ణ వితీర్ణుఁ డు
ద్వాహ మయ్యె నధిక వైభవమున,

1. న మంత్రికి (వ్రా. ప్ర)

హరిత గోత్ర జలధి హరిణాంకుఁ డగు తిప్ప
నార్య తనయుఁ, బెద్దమాంబ నెలమి. 15

స్ర. ఆ మల్లామాత్య [1]పుత్త్రుం, డయుగ నయన పూ జానుసంధాన సంధా
సామగ్రీ పుండరీ కేక్షణుఁడు, వెలసె నైశ్వర్య సంప త్సమృద్ధిన్,
సీమా దంతావళాభ్యుచ్ఛ్రిత కరట తట క్షేత్ర నిర్య న్మదాంభస్
స్తోమ వ్యాలోల భృంగ స్తుత విమలతర స్ఫూర్తిమ త్కీర్తి లక్ష్మిన్‌ః 16

సీ. [2]సత్య వ్ర తాచార సత్కీర్తి గరిమలఁ
జంద్రుతోఁడను హరిశ్చంద్రుతోఁడ,
నభిమాన విస్ఫూర్తి నైశ్వర్య మహిమల
రారాజుతోఁడ రైరాజుతోఁడ,
సౌభాగ్య వైభవ జ్ఞాన సంపన్నత
మారుతోఁడ సనత్కుమారుతోఁడ,
లాలిత్య నిరుపమ శ్లాఘా విభూతుల
భద్రుతోఁడను రామభద్రుతోఁడఁ,

తే. బాటి యనఁదగు ధారుణీపాల సభల
వీర హరిహరరాయ పృథ్వీ కళత్ర
రత్నభండార సాధికార ప్రగల్భు,
మల్లికార్జున త్రిపురారి మంత్రివరుని. 17

మ. కపటాచార విరోధి రాజ సచివ గ్రావోగ్ర దంభోళికిన్,
నృప నీతి వ్యవహార కార్య ఘటనా నిర్ధారణా శాలికిన్,
దపనీ యాచల రాజ ధైర్యనిధికిన్, ధర్మైక పాథోధికిన్,
ద్రిపు రారాతి మహా ప్రధానునకు, వేరీ యుద్దు లి ద్ధారుణిన్? 18

1. వర్యుం (మా)
2. ఈ పాదమునందు అర్థక్రమము తప్పినది.

మ. అటవీ సూకర మేల? యేల ఫణి? యేలా కొండ? లేలా దిశా
తట వేదండము? లేల కూట కమఠాధ్యక్షుండు? సప్తాబ్ధి సం
ఘట నాలంకృత మధ్యమైన నిఖిల క్ష్మా చక్రవాళంబు నె
క్కటి దాల్పం ద్రిపురారివల్లభు భుజా కాండ ద్వయం
బుండఁగన్. 19

ఉ. గంధవతీ ప్రతీర పుర ఘస్మర పాద బిస ప్రసూన పు
ష్పంధయ చక్రవర్తి, శ్రుత పర్వత దుర్గ మహా ప్రధాన రా
డ్గంధగజంబు తిప్పన, యఖండిత ధీనిధి, కాంచెఁ బుత్రులన్
భాంధవ కల్పవృక్షముల, బైచన మల్లన తిప్ప మంత్రులన్. 20

వ. అందు, 21

## వల్లభామాత్యుని పాండితీ వైభవాదికము

సీ. మూఁడు గ్రామ గ్రాసములతోడఁ గూడంగ
మోపూరు పాలించె ముల్కినాట,
నాశ్వలాయన శాఖయందు ఋగ్వేదంబు
కరత లామలకంబుగాఁ బఠించెఁ,
బ్రత్యక్ష మొనరించి భైరవస్వామిచే
సిద్ధ సారస్వతశ్రీ వరించెఁ,
గామకాయనస విశ్వామిత్ర గోత్రంబు
వంశ గోత్రంబుగా వార్త కెక్కెఁ,

తే. నెవ్వఁ, డా త్రిపురాంత కాధీశ్వరునకు,
రాయ నవ రత్న భండార రక్షకునకుఁ
బ్రియ తనూజుండు, చందమాంబిక సుతుండు,
మనుజమాత్రుండె వల్లభామాత్య వరుఁడు? 22

క. అహ రవధి సమయ నృత్య
త్తుహినాంశు ధర ప్రచార ధూ తాభ్ర ధునీ

లహరీ భ్రమ ఘుమ ఘుమములు
వహిఁ, దిప్పయ వల్లభన్న వాగ్వైభవముల్. 23

క. హాటకగర్భ వధూటీ
పీటీ కర్పూర శకల విస్ఫురదర సౌర
భ్యాటోప చాటు కవితా
పాటవ, మరు [1]దవని వల్లభన్నకు నమరున్. 24

క. హల్లీసక నట [2]నోద్భట
వల్లవ హరి కృష్ణ కంఠ వనమాల్య మిళ
ద్భల్లత్ సురభులు, తిప్పయ
వల్లభ రాజప్రధాన వాగ్వైభవముల్. 25

క. అమృత రస మథన సంభవ
ఘుమఘుమిత పయః పయోధి కోలాహలమున్
భ్రమియించుఁ, దిప్ప సచివో
త్తము వల్లభ విభుని చాటు ధారా ఫణితుల్. 26

క. భిల్లావతార మధుభి
ద్భల్ల భు జాస్ఫాల్యమాన పటు చాప జ్యా
వల్లీ మతల్లి చెల్లెలు,
వల్లభరాయ ప్రధాని వాగ్వైభవముల్. 27

క. నెల్లూరి తూము కాలువ
హల్లకముల కమ్మఁ దావి నపలాపించున్
సల్లలిత లీలఁ, దిప్పయ
వల్లభరాయ ప్రధాన వాగ్డంబరముల్. 28

క. ఉపమించెద ధారాధర
తపనజ రై రాజ రాజ ధారానగరా

1 ధవణి (మూ. ప్ర); ధవణి (మా) 2 నోద్భవ వల్లభ (మూ. ప్ర).

ధిప ధారాధరవాహులఁ,
త్రిపురాంతక వల్లభుని వితీర్ణ ప్రౌఢిన్. 29

క. సరి వత్తు రీవి, నిర్జర
పరివృఢ మణి ధనద జలద బలి ఖచర నిశా
కర సురతరు సురధేనువు,
లరుదే త్రిపురారివల్ల భామాత్యునకున్. 30

శా. సా రాచారమునన్, వివేక సరణిన్, సౌభాగ్య భాగ్యంబులన్,
ధౌరంధర్యమునన్, బ్రతాప గరిమన్, దానంబునన్, సజ్జనా
ధారున్, దిప్పన మంత్రివల్లభు, నమాత్య గ్రామణిన్, బోల్పఁగా
వేరీ మంత్రులు సింధు వేష్టిత మహోర్వీ చక్రవాళంబునన్? 31

సీ. మందార వారుణీ మద ఘూర్ణితాత్ముచే,
వెడదఁ గన్నుల చిన్ని వడుపుచేత,
డమరు ఖట్వాంగ దండ కపాలపాణిచే,
ధూర్త బాలకచక్రవర్తిచేతఁ,
గుర్కుర పరివారకోటి సేవితునిచే,
వెలఁది కోఱల మోము వేల్పుచేత,
*.... .... .... ....

తే. విశ్వ విశ్వంబు పాలించు విభునిచేతఁ,
బార్వతీదేవి గారాపుఁ బట్టిచేత
నీప్సితము గాంచుఁ దిప్పమంత్రీంద్ర తనయుఁ
[1]డార్యమణి వల్లభామాత్యుఁ డహరహంబు. 32

మూలగ్రంథమగు ప్రేమాభిరామ ప్రశంస

వ. ఆ మంత్రిశేఖరుండు, రావిపాటి త్రిపురాంతకదేవుం డను కవీశ్వరుం డొనరించిన ప్రేమాభిరామ నాటకంబు ననుసరించి, క్రీడాభిరామం బను రూపకంబు తెనుంగు బాస రచియించినవాఁడు, 33

1. ధర్మమణి (మూ. వే.) ధర్య (మూ. ప్ర.) *గ్రంథపాతము

తే. ఆతఁ డెంతటివాఁడు? ప్రేమాభిరామ
మనఁగ నెంతటియది? దాని ననుసరించి
వీథి యను రూపకము మది వెఱపు లేక
తిప్పవిభు వల్లభుం డెట్లు తెనుఁగుఁజేసె? 34

వ. అని యాన తిచ్చెదరేని, 35

ఉ. నన్నయభట్ట తిక్క కవి నాయకు లన్న, హుళక్కి భాస్కరుం
డన్నను, జిమ్మపూఁడి యమ రాధిపుఁ డన్నను, సత్కవీశ్వరుల్
నెన్నుదుటం గరాంజలులు నింతురు జే యని, రావిపాటి తి
ప్పన్నయు నంతవాఁడ, తగునా యిటు దోసపు మాట లాడఁగన్?

దేశ భాషలందుఁ దెనుఁగు లెస్స

ఆ. జనని సంస్కృతంబు సకల భాషలకును,
దేశ భాషలందుఁ దెనుఁగు లెస్స,
జగతిఁ దల్లికంటె సౌభాగ్య సంపద
మెచ్చు టాఁడుబిడ్డ మేలు గాదె? 37

వ. నేపథ్యమునందు, 38

పాత్ర ప్రవేశ సూచనము

చ. "గతి రసికుండ! షట్చరణ! గాన కళా కమనీయ! యో మధు
వ్రత! వికచారవింద వనవాటిక నేమిటికిం బరిత్యజిం
చితి? వటవీ ప్రదేశమునఁ [1]జెట్టుఁ జేమలఁ నేమి గల్గు నన్
రతి నిటు సంచరించెదవు? ప్రాఁబడిపోయెనె నీ వివేకమున్? 39

ఆ. చేర వచ్చి వచ్చి దూరంబుగాఁ బోదు,
డాయ వత్తు దవ్వు పోయి పోయి,
మాట లింక నేల? మా పాలిటికి నీవు
మాయ లేడి వైతి మంచిరాజ!" 40

1. చెట్టులు చేమలునేమి గల్గినన్ బరిచెడి (మూ. ప్ర.)

## సూత్రధారోక్తి

వ. ఆకర్ణించి సూత్రధారుఁడు "హా! యే నెఱింగితి, నేకశిలా నగరంబునం దార్యవాటంబునం గామమంజరి యను పునర్భువునందు బద్ధానురాగుండై, కార్యాంతర వ్యాసంగంబున దేశాంతరగతుం డైన, కౌసల్నాటి గోవింద మంచనశర్మ నుద్దేశించి, య మ్ముద్దియ పుత్తెంచిన యసంబంధీభూత ప్రేమ సంధుక్షణా గర్భంబైన మదనరేఖ సందేశ పద్ధతి యది; ఆలేఖ పఠియించుచున్నవాఁ డతసి కట్టనుఁగుఁ జెలికాఁడు టిట్టిభసెట్టి గావలయు, న య్యిరువురు నాబాల్య మిత్రంబులు. వీరి యోగ క్షేమంబు లనుసంధించెదం గాక" యని నిష్క్రాంతుం డయ్యె. 41

ఇది ప్రస్తావన

# క్రీడాభిరామము

## కథా ప్రారంభము

[కథా ప్రారంభము: గోవింద మంచనశర్మ, టిట్టిభశెట్టి ప్రవేశము - శీతోపద్రవము- ప్రస్థాన కాలోచిత శుభ శకునములు-కోడికూఁత - శీత కాలమునఁ బల్లెటూరి భోజన సౌష్ఠవము - కామమంజరి యలుక - ప్రావృట్కాల ప్రవాస ఖేదము - తొలి సంజ కెంజాయ - ప్రత్యూష సుషమ - శుభ శకునములు - మేదర కరణ వేశ్యా విలాసములు - చెఱకు విలుకాని ములికి చండాల భామ-కర్ణాటి కలికితనము- సుసరభేత్తను వేడుక మంను నమ్ము జోటి - కాపుటిల్లాలి మౌగ్ధ్యము - కర్ణాట భామతో మంచనశర్మ ప్రౌఢ సంవాదము - పాపద్యూత పర్యాలోకనము - సంపంగినూనె నమ్ము కరణ కాంత - ములికినాటి తెలికి జోటి - కుట్టుపనివాని కొంటె చూపులు - ఈరీర్చు చకోరనేత్ర-మగపోఁడిమి పైఁ ఖరితోఁ బసపు నూరు పడఁతి సొబఁగు- ఓరుఁగల్లు మహా నగర వైభవము - పలనాటి వీర గాథా గానాభినయము-పలనాటి వీరుల చరిత్ర - ఏకవీరా దేవి స్తుతి - మాహురమ్మ మహిమ-ఏకవీర యెదుటఁ బరశురామ గాథా గీతిక - మాలెత ఏకవీరా కీర్తనము-కాపు పూవుఁబోఁడి కైసేఁత-జక్కుల పురంధ్రి కామవల్లీ స్తోత్రము - అక్కల యారాధనము మైలార వీర భటుల పటు సాహస కృత్యములు - గౌరగపడుచు గొండ్లి యాట - మైలారదేవ స్తుతి - నగరమందలి నానావిధ దేవాలయములు - మంచన గావించిన భైరవ స్తోత్రము - విప్పులు చెఱఁగెడి బీరెండ - గడియారమ్మున ఘంటా నాదము - పూట కూటింటఁ బుష్పశరుని దౌత్యము - ఆహార విహారముల యభిరుచులు - పుష్పలావిక గేదఁగి పూవు కానుక - మాచల్దేవి

చిత్రశాలా ప్రవేశము - మంచన మాచల్దేవుల సరస సంభాషణము - చిత్రజాని శౌర్య మెఱిగించు చిత్రశాల - మదనరేఖకు ముకుర వీక్ష మహోత్సవము - శ్రీకాకుళపుఁ దిరునాళ్ళలో నసమబాణుని స్వైర విహారము - స్వచ్ఛంద చారిణులకు మంచన దీవెన - మంచన కామ మంజరి ననునయించుట - నాగరికుని నాగస్వరము - పాములాట - పాముల వెంగని నాగస్వర నైపుణి - తూర్పునాటి గడిఁడు-పొట్టేళ్ళ పోరు, పందెములు - కోడి పందెముల వర్ణనము - మహి నుదయించిన గాంధర్వి మధుమావతి - మధుమావతి తొలి మలి జన్మ రహస్యము - మదాలస వృత్తాంతము - మంచనశర్మ బోధించిన విట ధర్మ సూక్ష్మము - సాయంకాల వర్ణనము - బాలల బంగరు బంతుల యాట - నట్టువుని కోడలితో మంచన చతురోక్తి - చలిని సరకుగొనని సైరికుండు - అక్కలవాడలోని టక్కులాడులు - జార ధర్మాసనమున విషయ చర్చ - మంచనశర్మ న్యాయ నిర్ణయము - సంధ్యా కాలమున ఆర్యవాటీ ప్రవేశము - మంచనశర్మ కామమంజరిని తలంచి వలవంతల పొలగుట - కామమంజరీ సమాగమము - టిట్టిభ సెట్టికిఁ దమ్మడిసానితోడి సాంగత్యము - చంద్రునకు జార దంపతుల సమర్చ - ఉపసంహారోక్తి (భరత వాక్యము) - ఆశ్వాసాంత గద్యము.]

గోవింద మంచన శర్మ, టిట్టిభసెట్టి ప్రవేశము

సీ. గన్నేరుఁ బూఁజాయ కర మొప్పు నీర్కావి
మడుఁగు దోవతి పింజె విడిచి కట్టి,
గొజ్జంగి పూ నీరు గులికి మేదించిన
గంగమట్టి లలాటకమునఁ దీర్చి,
వలచేత బంగారు జలపోసనముతోడఁ
బ్రన్నని పట్టుతోరము ధరించి,

జటిగొన్న 1వెలిపట్టు జన్నిదంబుల లంగ
యంటులు వాయంగ నఱుత వైచి,

తే. తళుకు చెంగాని 2కోకయు, వలుఁద శిఖయుఁ,
జిగురుబొమ్మంచు పెదవులు, చిన్ని నగవు,
నంద మొందంగ వచ్చె గోవిందశర్మ,
మాధవుని పట్టి, యొసపరి మన్మథుండు. 42

క. కాసల్నాటి శ్రేష్ఠుఁడు,
మీసాలప్పయ్యగారి మేనల్లుఁడు, ధా
త్రీసుర తిలకుఁడు, కుసుమ శ
రాసన సముఁ, డంద్ర నగర యా శ్రోన్ముఖుఁడై, 43

వ. తూర్పుఁ గనుంగొని, టిట్టిభునిం జూచి, వయస్యః సుప్రభాతంబు! సుఖ నిద్ర యయ్యెనే? శీతం బుపద్రవంబు సేయదు గదా యీ పుష్య మాఘంబులందు? 44

శీతోపద్రవము

ఉ. ప్రక్కలు 3వంచి వంచి, మునిపండును బండును 4రాచి రాచి,త్రొ
మ్మక్కులఁ 5జేసి జేసి, తల యల్లనఁ గాళుల 6సంది సంది, లో
చక్కికి 7నొక్కి నొక్కి యిరుచంబడ, గుమ్మడి మూటగట్టి, పీ
పెక్కి దువాళిచేసి, చలి యిక్కడ నక్కడఁ బెట్టు వేఁకువన్. 45

ఉ. కుమ్ములు హవ్యవాహములు, గుత్తపు సుగ్గడితంపు దోఁపు రెం
టమ్ములా, దట్టు ఘస్ను మృగనాభియుఁ జాఁదును నోడె నద్దిరా!
యమ్మకచెల్ల యింక నవ యౌవన దర్ప నఖంపచంబు లౌ
కొమ్మల చన్నులకా సరకు గొనటు లున్నవి వో తుషారముల్. 46

శా. స్థూల ద్వి త్రి ప టావకుంఠనముఁ, గస్తూరీ రజః పాళికా
కాలాగు ర్వనులేపనంబులను నుద్ఘాటించి, ధాటీ గతికా

---

1. సమకట్టు (మూ. ప్ర.) 2. కోరలు (మూ. ప్ర.)
3. వంచు, 4. రాయు, 5. జేయు, 6. సందు, 7. నొక్కు, (మూ. ప్ర.)

ప్రాలేయంబు దువాళిసేపిన, భయ భ్రాంతంబులై యూష్మముల్
వాలాయంబుగఁ బ్రాఁకె నంధ్ర వనితా వక్షోజ శైలాగ్రముల్. 47

శా. స్థూల ద్వి త్రి ప టావకుంఠనములున్, ధూపోపచారంబులున్,
గాలాగు ర్వనులేపనంబులు, వధూ గా ఢోపగూహంబులున్,
గేళీ గర్భ నికేతనంబులును గల్గెం గాక; లేకున్న నీ
ప్రాలే యాగమ మె వ్విధంబున భరింపన్ వచ్చురా టిట్టిభా? 48

వ. శీతోపద్రవంబు లేక సుఖ నిద్ర యయ్యెనే! యని యడిగి,
వేఁకువ యగుచున్నయది, కావున నిదియ మనకుఁ బ్రస్థాన కాలం
బని, నిమిత్తం బనుసంధించి, 49

## ప్రస్థాన కాలోచిత శుభ శకునములు

ఉ. చుక్క యొకింత నిక్క, బలసూదను దిక్కున రాయుచుండఁటన్
జక్కఁగ వేగ దిప్పుడు, నిశా సమయుం బిది ప్రస్ఫుటంబుగా,
ఘుక్కని మాటి మాటికిని గోటఁడు వల్కెడు వామ దిక్కునన్,
జొక్కటమై ఫలించు మన శోభన కార్యము లెల్లఁ డిట్టిభా! 50

క. మూఁగిలి మూఁగిలి, వృక్షము
పూఁగొమ్మన నుండి షడ్జము ప్రకాశింపన్
లేఁగొదమ నెమలి పల్కెడుఁ,
గేఁగోయని, వైశ్య! మనకు గెలు పగుఁ జుమ్మీ! 51

తే. గౌనకౌనం గోడి, యేట్రింత, కొంకనక్క,
నమిలి; యీ నాలుగిటి దర్శనంబు లెన్న,
వీని వల తీరుఁ బలుకు నుర్విజనులకుఁ
'గొంగు బంగార' మండ్రు శాకునిక వరులు. 52

## కోడి కూఁత

వ. అనిన నాకర్ణించి టిట్టిభుఁడు, 53

సీ. మంచన! వింటివో వినవొ, మన్మథుఁ డేక శిలా పురంబులోఁ
జంచలనేత్రలం బతుల శయ్యలపై రతి కేళి రాత్రి వో
రించి, ప్రభాత కాలము పరిస్ఫుట మైనను, ధర్మదార వ
ట్టించుచునున్నవాఁ డదె! కుటీ గత కుక్కుట కంఠ కాహళిన్. 54

వ. అని యట వోయి ముందట, 55

శీత కాలమునఁ బల్లెటూరి భోజన సౌష్ఠవము

తే. శీత కాలంబు కడి మాడ సేయఁ గుడుచు
భాగ్యవంతుండు జేపాడి పల్లెపల్లఁ,
*గ్రొత్త యోరెంబు నిగు రావకూరతోడఁ,
బిచ్చిలంబైన నేతితోఁ, బెరుఁగుతోడ. 56

కామమంజరి యలుక

వ. టిట్టిభ! తలంపునం బాఱె,నొక్కనాఁ డేనునుం గామమంజరియును ప్రేమం బెలర్పఁ గలసి మెలసి, కూడి మాడి, పొంది పొసఁగి, యనఁగి పెనఁగి, చొక్కి తక్కి యుండ, దైవ వశంబున గోత్ర స్ఖలనంబు కారణంబుగా, న క్కాంతారత్నం బలిగిన, 57

గీ. ఎట్టకేలకు నలుక రే యెల్లఁ దీర్చి,
యువిద యధ రామృతము గ్రోలుచున్న నాకుఁ
బాన విఘ్నంబుగా మ్రోసెఁ, బాప జాతి,
జాతి చండాల మైన వేసడపుఁ గోడి. 58

ప్రావృట్కాల ప్రవాస ఖేదము

వ టిట్టిభ! య మ్మదన పట్టాభిషేక మత్తేభరాజ గమన నట్టనడుమ సురత కాలంబున వసంత సమయంబునం బాసి, మల్లికా ధవ ళాట్టహాస మహా కాళమూర్తి యగు తపర్తు సమయంబు లంఘించితి,లాంగలీ కుసుమ కేసర పరాగ రేణు విసర పిశంగిత దశ దిశా

* గొ (మూ. ప్ర)

హట్టం బగు వర్షా సమయం బెట్టకేలకుం గడపితిఁ, బ్రావృట్కాల ప్రవాసంబును మరణంబును రమణీరమణులకు నొక్క సమంబ, యది యెట్టి దనిన: 59

మ. పటు ఝంఝూ పవనోత్థ్ర జాలయములో, భద్రంబునం బట్టె కం
కటిపై ముచ్చుముడింగి, నిర్భర వియోగ గ్లాని శోషించి, యె
క్కటి నిద్రించుచు నున్న వాఁడ వనితా, గర్జా వచః ప్రౌఢిమన్
దటిదుద్ద్యోతము చూపు నట్టనడు రే ధారాధర శ్రేణికిన్. 60

వ. అని, మంచన మతియును బ్రాగ్దిశాంచలము వీక్షించి, 61

తొలి సంజ కెంజాయ

తే. దాసనపుఁ బువ్వు చాయకోఁ ద్రస్తరించు
చుదయ మయ్యెడు నదె చూఁడు మొదలి సంజ,
పొఁబగు వీడినఁ గట్టెట్ట సోఁకినట్టి
కామమంజరి నెమ్మోము కాంతి వోలె. 62

ప్రత్యూష సుషమ

మ. అదె మాణిక్యపుఁ బూర్ణ కుంభము వయస్యా! కార్య సంసిద్ధికై
మొదలం దోఁచినయట్టి మంచి శకునంబుంగా విచారింపరా!
యుదయం బయ్యెడు భాను బింబము దిశా వ్యోమావకాశంబులన్
బదియార్వన్నె పసిండి తీఁగల గతిన్ బ్రాఁకెన్ బ్రభా జాలముల్ 63

శా. ఓరుంగంటి పురంబు సౌధములపై నొప్పారెడిన్ జూచితే
యీరెండల్? మణి హేమకుంభములతో నేకాంతముల్ సేయుచున్,
స్వైరాజ ప్రమదా ఘన స్తన భర స్థానంబులం బాసి, కా
శ్మీర క్షోదము, ప్రాణవల్లభ దృ ఢాశ్లేషంబులన్ రాలె నాన్. 64

వ. అనుదిత నియమ వ్రతంబు గావున నిట క్రితంబ సం ధ్యాగ్నిహోత్ర క్రియా కలాపంబులు నిర్వర్తింపంబడియె. నీవు ముఖ మజ్జనంబు సేసి, యిష్ట దేవ తాభివందనంబు గావించితివి

గదా? గో ధూళి లగ్నంబునం బురంబు ప్రవేశింపవలయు.
విశేషించి యుషః కాలంబు సర్వ ప్రయోజ నారంభంబులకుఁ
బ్రశ స్తంబు. 65

## శుభ శకునములు

తే. గార్గ్య సిద్ధాంత మత ముషః కాల కలన,
శకున మూనుట యది బృహస్పతి మతంబు,
వ్యాస మతము మనః ప్రసా దాతిశయము,
విప్ర జన వాక్య మరయంగ విష్ణు మతము. 66

వ. అని పరిక్రమించి, వెలిపాళెంబు కట్టకడపటఁ గటకార కుటీర
వాటికఁ బ్రవేశించి, 67

## మేదర కరణ వేశ్యా విలాసములు

సీ. ఏకసక్కెముగ నాడు నేదైన నొక మాట,
పాడు నొయ్యన పాట పాట పాట,
యలఁతి యద్దపు బిళ్ళ యఃవోత వీక్షించుఁ,
గొనగోరఁ బద నిచ్చి కురులు దీర్చుఁ,
బయ్యెద దిగజార్చి పాలిండ్లు పచరించు,
దిస్సువాఱఁగ నవ్వుఁ దీఁగ నవ్వ,
ధవళ తాళ పలాశ తాటంకములు త్రిప్పుఁ,
గలికి చూపులఁ జూపు గర్వ రేఖ,

తే. కట కుటీ ద్వార *వైణవ కాష్ఠ పీఠ
మధ్య భాగ నిషణ్ణయై మదము మిగిలి,
వీటి పామర విటుల 'తంగేటి జున్ను,'
కాము బరిగోల, మేదర కరణ వేశ్య. 68

క. పుటభేదన బహి రంగణ
కటకశ్రీ కారకూట కటకం బగు నీ

*వేణుకా కష్ఠ (మూ. ప్ర)

కటకార కుల వధూటీ
కుటీ కాగారంబు, గరిడి కుసు మాస్త్రునకున్. 69

క. *గిసిన వెదురు సలాకల
నేసిన యిరుఁదల శిఖండి నిడు మంచమునం
దోసరిలి, కట కుటీర వి
లాసిని రమియించు మిండల సహస్రములన్. 70

ఉ. పల్లవ తస్కరుం డొకఁడు, ప్రా క్సముపార్జిత తార పంక్తితో
వల్లువ మెత్తికొంచుఁ బెర వాకిట వెళ్ళిన నాఁటనుండి, పా
టిల్లిన శంక, నీ కట కుటీర విలాసిని యహ్హహా! పటీ
పల్లవ కోణముల్ బిగియఁ బట్టి, రమించును మిండగీలతోన్. 71

వ. ఆ చేడియం జూచి, యట పోవం బోవ ముందట, 72

చెఱకు విలుకాని ములికి చండాల భామ

శా. గం డాభోగము పజ్జ లే నగవు శృంగారింపఁ, గ్రేఁ గన్నులన్
మెం డై మించు మెఱుంగుఁ జూపు గమి క్రొమ్మించుల్ పిసాళింపఁగాఁ,
చండాలాంగన వచ్చె నొక్కతె ఋతు స్నానార్థమై, యిక్షు కో
దండుం దేర్చిన బాణమో యనఁగ, సౌందర్యంబు సింగారఁగన్ 73

వ. అట్లు పోవం బోవ ముందట, 74

కర్ణాటి కలికితనము

మ. కటి భారంబును, జన్ను దోయి భరమున్ గల్పించె నా బ్రహ్మ పి
న్నటి కౌఁ దీగకు మున్న, యిప్డు విమ లార్ణః పూర్ణమై యున్న యీ
ఘటి భారం బొకఁ డెక్కుడయ్యె ననినన్, గర్ణాటి క్రాల్గన్నులన్
బటీతాళింపుచు నవ్వె, నీల కబరీ భారంబు కంపింపఁగాన్. 76

* కీసిన (మూ. ప్ర)

వ. అనుచు గోవింద మంచనశర్మ, నర్మ సఖుం డగు టిట్టిభుండును దానును హట్ట మార్గంబునం జనునప్పుడు, 76

సుసరభే త్తను వేడుక మందు నమ్మ జోటి

తే. జిగురు టుండలు నించి, డా చేతియందుఁ
బెద్ద యేనుఁగు దంతంబు పెట్టెఁ బెట్టి,
యింతులకుఁ బ్రీతిగా మైల సంతలోన
'సుసరభే' త్తని ఘోషించె జోటి యోర్తు. 77

వ. ఇది యేమి ఘోషించుచున్నయది? కిరాట కుల రత్నంబ! నీవు తేటపడ నెఱింగి, మాకు నెఱింగింపు మనుచు మంచనశర్మ యడిగిన, 78

చ. ముసి ముసి నవ్వుతో నతని మోము గనుంగొని వైశ్యుఁ డిట్లనున్;
రసిక కులావతంసుఁడవు, బ్రాహ్మణ! యింతకు మున్నెఱుంగవే?
యసమ శరాలయంబునను హత్తిన వెంట్రుక కప్పు వోవఁగా,
విసరు సమీరణం బయిన వేడుక మం దిది, కొందు రంగనల్. 79

సీ. కమ లావతారంబుఁ గైకొన్న చైత్యారి
కమనీయ చరమ భాగంబు వోలె,
నాది యుగంబునం దావిర్భవించిన
జిననాథ దేవుని శిరసు వోలెఁ,
గసటు వోవఁగఁ దోమి కడిగి బోరగిలంగఁ
బెట్టిన తామ్రంపు బిందె వోలెఁ,
గంగమట్టియతోడ సాంగత్య మెడలిన
నునుపారు మునిమిట్ట నుదురు వోలెఁ,

తే. జిఱుత ప్రాయంపునాఁటి సద్బికపుఁ జాయ
తొలు సమ రయ కాలంపు విలసమునఁ

దరుణులకుఁ బంచబాణ మందిరము లమరు,
సుసరభే త్తను నీ మందు సోఁకినపుడు. 80

వ. ఇది నిర్యాన మయంబును, సర భేదన సమర్థంబును నగుటం జేసి, సుసర భే త్తను నామంబు దీనికిం గలిగెఁ, గామ నిల యాఘాట రోమాటవీ సముత్పాటన పరిపాటికై పాటల గంధులు దీనిం బాటింతు రనుచు నెఱింగించి, యట వోవం బోవ, ముందట వెలి పాళెంబు మధ్య ప్రదేశంబున, హాలిక వాటి యందు నొక్క చక్కని జవరాలు, కట్టెఱ తొగరుం గట్టల యెట్టి యొల్లియ నితంబ భారంబున నమర్చి, బా లార్క కిరణ సంప ర్కంబునఁ, జాంపేయ కుసుమ చ్ఛద చ్ఛాయా దాయాదంబు లైన యవయవంబులు మిస మిస మెఱవం,గుక్కుటాసనంబునం గూర్చుండి, 81

కాపుటిల్లాలి మౌగ్ధ్యము

ఉ. *కందుక కేళి సల్పెడు ప్రకారమునం, బురుషాయిత క్రియా తాండవ రేఖ చూపెడు విధంబునఁ బామర భామ, లేఁత యీ రెండ ప్రభాత వేళ రచియించె; నితంబ భరంబుఁ. జన్నులున్, గుండలముల్, గురుల్ కదల గోమయ పిండము లింటి ముంగిటన్. 82

వ. అప్పామర భామా రత్నంబు నుద్దేశించి, 83

తే. పొలపములు లేవు కటి వంక బొమలయందుఁ,
జిన్ని నగవులు లేవు లేఁ జెక్కులందుఁ,
గలికితనములు లేవు క్రా ల్గన్నులందుఁ,
గాఁపు టిల్లాండ్ర కిట్టి మౌగ్ధ్యముల యొప్పు. 84

వ. అట చని, వీథీ విటంకంబునఁ డిట్టిభుండు విట పేటికా ప్రకాఘటిత

---
* చూ. శ్రీనాథుని వీథిం. 4

కృకాటికా నికట చేటి కానుయాత యగు కర్ణాటాంగనం
గనుంగొని, 85

మ. *కుసుమం బెట్టిన చీర కొంగు వొలయన్, గ్రొవ్వారుపాలిండ్లపైఁ
ద్రిసరంబుల్ పొలుపార, వేణి యవటూ దేశంబుతో రాయ, న
ప్పస మెవ్వాఁడొ యొకండు రాత్రి సురత ప్రౌఢిం దనుందేల్చినన్,
వసివాళ్వాడుచు వచ్చుచున్నయది కర్ణాటాంగనం జూచితే? 86

తే. వాహకుం డెక్కి విడిచిన వారువంపుఁ
గొదమయును బోలి, రతి కేళి మదము డిగ్గి,
యలస భావంబుతోడఁ గర్ణాట వేశ్య
వచ్చుచున్నది యదె విప్రవర్య! కంటె? 87

ఉ. ఈ మరి, యింక నొక్క మరి, యిం కొక మా, టిఁక నొక్క
మాఱు, 'నా
నోముల పంటగా!' యనుచు 1నోవులఁబెట్టుచు, రే యొకండు నా
జ్ఞాములు దీనితోఁ గుసుమ సాయక తంత్రము సల్పఁబోలు, లే
దా మృగశాబనేత్ర యఖి లాంగములన్ వసివాళ్ళువాడునే? 88

కర్ణాట భామతో మంచనశర్మ ప్రౌఢ సంవాదము

వ. అనిన, మందస్మితంబుతో గోవిందమంచనశర్మ నర్మ గర్భంబుగా
దర్భాంకు రాలంకృతంబు లగు తన కర పంకజంబులం గర్ణ
పుటంబులు ముట్టుకొని, పూతిమాష గోత్రంబును మంచన
నామధేయంబునుం జెప్పి, నమస్కరించి యిట్లనియె: 89

శా. పంచారించిన నీ పయోధరము లాస్ఫాలింతునో? లేఁత బొ
మ్మంచుం గెం జిగురాకు మోవి జిపి ధాత్వర్థం బనుష్ఠింతునో?
పంచాస్త్రోపనిష ద్రహస్య పరమ బ్రహ్మ స్వరూపంబు నీ
కాంచీ దామ పదంబు ముటుదునొ? యో కరాట తాటంకినీ! 90

*చూ. శ్రీనాథుని వీథి-వ. 13

1 నోడల (మూ. ప్ర)

క. వ్రాలని నీ చన్నులతో,
వ్రాలెడు జక్కవలు సరియె? వలలం బెట్టం
జాలెడు నీ కన్నులతో,
బాలకి! సదృశములె వలలఁ బడు మత్స్యంబుల్? 91

శా. చాటు ప్రౌఢిఁ బిసాళ మాడెదవు కానల్నాటి బాఁపండవో?
శాటీ హాటక నిష్కముల్ వెఱగ జంఝాటంబు చాలించు, క
ర్ణాట స్త్రీలు కటారికత్తియలచే రాపాడఁగాఁ బట్టఁగాఁ?
డా టా లీడ గుణింపరాదు పెఱ చోటం బోలెఁ బైపాటునన్. 92

తే. దిట్ట బాఁపండు నడు వీథిఁ దెగడి పలికెఁ,
గూట మీక్షింపఁ దెమ్ము కిరాట! నేఁడు
పన్నిదము వీని మెడ నున్న జన్నిదములు,
సవరగా గ్రుత్తుఁ గ్రొత్త పుంజాల దండ. 93

వ. అనుటయు విప్రుం డిట్లనియె: 94

సీ. ముసుఁగు పెట్టిన నేమి! ముత్యాల కమ్మల
క్రొమ్మించు లీలలు కులుకరించె,
మోము వంచిన నేమి! మొలక నవ్వుల కాంతి
చెక్కుటద్దములపై జీరువాఱెఁ,
జూడ కుండిన నేమి! సొబఁగు ఱెప్పల మించి
తేట వాల్మెఱుఁగులు దిచ్చరించెఁ,
జాటు చేసిన నేమి! చక్రవాకులఁ బోలు
పాలిండ్ల మెఱుఁగులు బయలుపడియె,

తే. సిగ్గు నటియించి, మా వేశ్య చిన్నవుచ్చి,
యేల యిటు *పిసాళించెఁ? దీం దేమి సిద్ధి?
కాము సామ్రాజ్య పట్టంబు గట్టి, నన్నుఁ
గౌఁగిలింపంగఁగదవె! యో కరణ కాంత! 95

*వలెఁ జరియించె దేమి బుద్ధి? (మూ. ప్ర)

వ. అని చిఱునవ్వు నవ్వుచు గోవిందమంచనశర్మ, నర్మ సఖుండును దానును నట వోవం బోవ ముందట, 96

## పాప ద్యూత పర్యాలోకనము

మ. పరివేష్టించి ప్రజా కదంబకము పై పై వ్రాలి వీక్షింపఁగాఁ,
బర హస్తంబున నొత్తుకాండ్రు నపలాప ప్రౌఢి బోధింపఁ, బా
మరులై పన్నిదమాడి యోడి, మఱి దుర్మానంబుతో నాట గొ
ల్పిరి, వేశ్యా వలయాభిసంవళిత ముగ్ధోత్కర్షు గోవిందునిన్. 97

శా. సం గాసంగ జయాజయంబు, పరిహాస ప్రస్ఫుటాశ్లీల భా
షాంగం, బాకలి తాంతరా వలయ కక్ష్యా భాగ ముద్రా లస
ద్భంగీ నిష్ఠిత కాష్ఠ శంకుకము, పాపద్యూత, మీ పన్నిదం
బంగీకారము సేయువారి మొలలం బ్రాపించుఁ గౌపీనముల్. 98

తే. నీకు నౌ నీకు నౌ నంచు నెమకి నెమకి,
ముగుద లగు వారి భ్రమియించు, మోసపుచ్చుఁ
బశ్యతోహరుఁ, డత్యంత పాప బుద్ధి
పట్టణములోఁ దగుల్పరి పందెగాఁడు. 99

## సంపంగి నూనె నమ్ము కరణకాంత

వ. అనుచు, నట ముందట శతానంద గేహినీ కరరుహ ప్రరోహ శిఖర ముఖర వీణా క్వాణ పాణింధము బైన మధుర స్వరంబున, 100

సీ. విజ్జోడు పడ నిడ్డ వెండ్రుక జందెంబు
వలి గుబ్బ పాలిండ్ల కెలఁకు లొరయఁ,
గర మూలమున వెండి మొరవంక కడియంబు
మూఁడు మూలల లింగముద్ర లొత్త,
జంగాళముగఁ బింజె సవరించి కట్టిన
మడుఁ గొంటి వొరను లోఁ దొడలు మెఱయ,

బలితంపు విచ్చుటాకుల దుద్దుఁ గమ్మలు
నిద్దంపుఁ జెక్కుల నీడఁ జూడ,

తే. నోరుఁగంటి పురంబులో, నోరఁ గ్రంతఁ,
బెద్ద యెలుఁగున నమ్మె సంపెంగ నూనె,
కోకిలము పంచమ శ్రుతిఁ గొసరినట్లు,
కనుమ యవ్వలి దేశంబు కరణకాంత. 101

ములికినాటి తెలికి జోటి

తే. పలికినప్పుడు తేనియ లొలికి పడెడు,
జళుకుఁ జూపులఁ గ్రొమ్మించు లులికి పడెడు,
ములికినాటిది కాఁబోలుఁ జెలి! కిరాట!
కలికి, చిలుకలకొలికి, యీ తెలికి జోటి. 102

ఉ. ఈ నళినాక్షి, తాఁ దిరుపు పెద్ద ప్రతోదము మోపి రొప్పుచున్,
గనుగ పట్టెపైఁ దిరుగఁ గట్టెడి, డిట్టిభ! మంథరాద్రి మం
థానక మథ్యమాన తిమిధామ జల భ్రమి మండలం బధి
ష్ఠానముగా భ్రమించు నల సంపద చేడియఁ బోల కుండునే? 103

ఉ. *మీన విలోచనంబులును, మీఁటిన ఖంగనుగుబ్బ చన్నులుఁ, లిం
పైన వచోఽమృతంబు, సొగసైన మదాలస మంద యానముం
గా నొనరించి, దీని గణికామణిఁ జేయక, నిర్దయాత్ముఁడై
గానులదానిఁ జేసిన వికార విధిం దల మొత్తఁగాఁ దగున్. 104

వ. అటు యుత్తరంబునం గత్తెర నొత్తి, పెక్కు వన్నెల పొత్తుల బహువిధ వర్తనల హత్తించి, యెత్తి కట్టిన పూగుత్తులు, మత్త కోకిల కలహంస దాత్యూహ వ్యూహంబులుం గలిగిన [1]మోహరి వాడయందు, 105

*ఈ పద్యము శ్రీనాథుని వీథిలోను గలదు. (చూ. ప. 107.)
1. దోహరివాడ (వే)

## కుట్టుపనివాని కొంటె చూపులు

చ. కొలుచును, జేన వెట్టుc, గుచ కుంభ యుగం బెగదిగ్గc గన్ను గ్రే
వలc బరికించుc, గక్షముల వైచును దృష్టులు మాటిమాటికిన్,
గలికితనంబునం దఱచుగా నగు సౌచిక పల్లవుండు, గం
చెల *వెసc గుట్టి యీ(డు వెల చేడియకున్, విషయాభిలాషియై.

వ. అనుచు న వ్వాడ గడచి, యట యుత్తరంబు సనునప్పుడు
ముందట నొక యింటి మఱుంగున మచ్చెకంటిం బొడగని, 107

## ఈ తీర్పు చకోర నేత్ర

ఉ. సారెకు సారె కేమిటికిc జంపెదు గోcట యెట్టిలైన వా
లారు నఖాంకురంబుల వయస్యకి చcబునc, బాట పాడి, యీ
రీరిచి, సీత్కృతుల్ చెవుల కిం పొనరింపc జకోరనేత్ర! నీ
చారు కుచ ద్వయంబు మముc జంపెడు దోసము నీకుc
జాలదే? 108

వ. అనుచు న య్యింటిముందట, 109

### మగ పోcడిమి వైఖరితోc బసపునూరు పడcతి సొబగు

మహాస్రగ్ధర. పరిపాటీ భర్వ ఖర్జూ పరతి సమయ సం
భ్రాంత సంభోగ భంగిన్,
దరుణీరత్నంబు హేలా తరళ గతి హరి
ద్రా రజః కర్దమంబుం,
గురు లల్లాడంగ, పీcగుం గుచములు గదలం
గొంతు గూర్చుండి నూతెన్
గర వల్లీ కాచ భూషా కల మధుర ఝుణ
త్కారముల్ తోరముల్ గాన్. 110

*. తెగc గుట్టి (మూ॰ ప్ర॰)

వ. అని యచ్చోటు వాసి, బాహ్య కటక వీథీ విటంకంబు నతిక్రమించి:

ఓరుఁగల్లు మహా నగర వైభవము

సీ. సప్త పాతాళ విష్టప మహా ప్రస్థాన
 ఘంటాపథం బైన గనప పరిఖ,
తారకా మండల స్తబ కావతంసమై
 కనుచూపు గొనని ప్రాకార రేఖ,
పుంజీభవించిన భువన గోళము భంగి
 నంకు లాంగణమైన వంకదార,
మెఱుఁగు టెక్కెలతోడి మేరు శైలముఁ బోలు
 పెను బైఁడి తలుపుల పెద్ద గవని,

తే. చూచెఁ, జేరెఁ, బ్రవేశించెఁ, జొచ్చెఁ బ్రీతి,
సఖుఁడు, దానును రథ ఘోట శకట కరటి
యూథ సంబాధముల కొయ్య నోసరిలుచు,
మంద గతి నోరుఁగల్లు గోవిందశర్మ. 112

వ. ప్రవేశించి, టిట్టిభ నామధేయుండైన కోమటి సెట్టిగారితో నాతఁ
డిట్లనియె: 113

సీ. రాజ మార్గంబు వారణ ఘటా ఘోటక
 శకటికా భట కోటి సంకులంబు,
ధరణీస్థలీ రజ స్త్రసరేణు బహుళంబు
 గాన మన మందుఁ బోవ వలదు,
క్రంత త్రోవల నొండు కలకలంబులు లేవు,
 తలచుగా సుఖ వినోదములు గలవు,
మఱియు విశేషించి మన్మథ కూటమౌ
 వేశవాటిక మధ్య వీథి దఱిసి,

తే. చిత్తనమున కెక్కినట్టి లంజియలతోడ
సరస సల్లాప సౌఖ్యంబు సలుపవచ్చు

నంత, మధ్యాహ్న సమయమౌ, నపుడు గాని
వేడుకై యుండ దక్కలవాడ సొరఁగ. 114

తే. అనినఁ, డిట్టిభుఁ డౌ నంచు ననుచరింప,
నాలువరి క్రింది త్రోవగా నరిగి యరిగి,
విప్రుఁ డీక్షించెఁ బలినాఁటి వీర పురుష
పరమ దైవత శివలింగ భవన వాటి. 115

పలనాటి వీర గాథా గానాభినయము

మ. ద్రుత తాళంబున, వీర గుంభికక ధుం ధుం ధుం కిటాత్కార సం
గతి వాయింపుచు, నాంతరాళిక యతి గ్రా మాభిరామంబుగా
యతి గూడన్, ద్విపద ప్రబంధమున వీరానీకముం బాడె నొ
క్కతె, ప్ర త్యక్షరముం గుమారకులు ఫీట్కారంబునం
దూలఁగన్. 116

సీ. గర్జించి, యరపి, జంఘా కాండ యుగళంబు
వీరసఁబెట కోల వ్రేయు నొకఁడు,
ఆలీఢ పాద విన్యాస మొప్పఁగ వ్రాలి
కుం తాభినయముఁ గైకొను నొకండు,
బిగువుఁ గన్నుల నుబ్బు బెదరుఁ జూపులతోడ
ఫీట్కార మొనరించుఁ బెలుచ నొకఁడు,
పటు భు జావష్టంభ పరిపాటి ఘటియిల్ల
ధరణి యాస్ఫోటించి దాఁటు నొకఁడు,

తే. ఉద్ది ప్రకటింప నొక్కరుం డోల వాఁడు,
బయలు గుఱ్ఱంబు భంజళ్ళఁ బఱపు నొకఁడు,
కొడుము దాటింపుచును బెద్ద కొలువులోనఁ
బడఁతి పల్నాటి వీరులఁ బాడు నపుడు. 117

## పలనాటి వీరుల చరిత్ర

ఆ. కులము దైవతంబు గురిజాల గంగాంబ,
కలని పోతులయ్య చెలిమికాఁడు,
పిఱికి కంద లేని యఱువది యేగురు
పల్లెనాటి వీర బాంధవులకు. 118

గీ. ఆరువల్లి *నాయురాలి దుర్మంత్రంబు,
కోడి పోరు, చాప కూటి కుడుపు
ప్రథమ కారణములు పల్నాటి యేకాంగ
వీర పురుష సంప్రహారమునకు. 119

ఉ. పచ్చని పిండిగందమును, బాలము సేసయు, నెత్తిపూవులన్
గ్రుచ్చిన కంఠమాల్యములు, 1గొప్పఁగ నల్లినవేణి బంధముల్,
కుచ్చుల వీరసంబెటయుఁ, గ్రొత్త మణుంగగు కాసెపుట్టము
నచ్చల కెక్కినట్టి రవణంబులు, వీర కుమార కోటికిన్. 120

క. నల్లంగొండయు, నాగరి
కల్లును ధరణీస్థలిం బ్రగల్భ స్థలముల్;
పల్లేఱు, నాగులేఱును
బల్లె క్ష్మాకాంత యెల్ల ప్రారంభమ్ముల్. 121

సీ. "ఇచ్చోట భుజియించి రేక కార్యస్థులై
సామంత నృపతులు చాపకూడు,
ఇచ్చోటఁ జింతించె నిచ్చ నుపాయంబు
నళినాక్షి యారెవల్లి నాయురాలు,
నిజ మను శుద్ధికై నిప్పుల యేటిలో
నోలాడె నిచ్చోటఁ బీలసాని,
యాచ్చోటఁ బోరిరి యిలపణంబుగ గొల్ల
సవతితల్లుల బిడ్డ లవనిపతులు,

---

*నాయినారి (మూ. ప్ర) 1 కొప్పుగ

తే. ధీరు లగువార లేవురు వీర పురుషు
లై, మదోద్ధతి నిచ్చోట నాజిఁ బడిరి''
యనుచుఁ జెప్పుదు రైతిహ్య మచట నచట,
జనప పెద్దలు పల్లె దేశములయందు. 122

ఉ. చిత్తము గూర్చి మాచెరల చెన్నుఁడు, శ్రీగిరి లింగముం గృపా
యత్తతఁ జూడఁ *బల్లె విషయంబున కా మహిమంబు చెల్లెఁగా,
కుత్తరలోన మింట జల ముట్టిన మాత్రన, నాపఱాలలో
విత్తిన యావ నాళ మభివృద్ధి ఫలించుట యెట్లు చెప్పుమా? 123

మ. "మగ సింగంబులు సంగ రాంగణములన్ మత్తిల్లి రున్మత్తులై
జగ దేక స్తుతు" లంచు నేమిటికి సంశ్లాఘింప? నా భూమిలోఁ
జిగురుంబోఁడులుఁ, గాఁపు గుబ్బెతల నక్షీణ ప్రభావంబునన్
మగసింగంబులఁగా నెఱుంగుదురు పుం భావ ప్రసంగంబులన్ 124

తే. కోల దాపునఁ ద్రిక్కుటిఁ గూడియున్న,
గచ్చు చేసిన చిత్రంపు గద్దె పలక
వ్రాసినా రదె చూడరా వైశ్యరాజ!
శీల బ్రహ్మాది వీర నాసీర చరిత. 125

వ. ఈ వీర పురుషులు మనకుం గార్య సిద్ధి సేయుదురు గాక! పద పద మనుచుం గతిపయ పదంబు లరిగి, నింబ పల్లవ నికురుంబ సందానిత వందన మాలి కాలంకృత ద్వారం బగు నేకవీ రాగార గోష్ఠంబు గమంగొని, 126

## ఏకవీరా దేవి స్తుతి

సీ. వందనం బిందిరా వరు కన్నతల్లికి,
దండంబు ఫణిరాజ మండనకును,

---

* ముల్కి (మూ. ప్ర)

నంజలి సోమ సూ ర్యానల నే త్రకు,
  నభివందనము జగ దంబికకును.
మొగుపుఁజేతులు దేవ ముని సిద్ధ సేవ్యకు,
  జమదగ్ని గారాపు సతికి శరణు,
జోహరు రమణీయ శోభ నాకారకు,
  నమితంబు గిరిరాజ నందనకును,

తే. నిత్య కల్యాణి, కలి కుల నీలవేణి,
కాది శక్తికి, వేద వేదాంత సార,
కేకవీరకుఁ, బూర్ణ రాకేందు ముఖికి,
నఖిల జననికి సాష్టాంగ మనుఁడనమ్మ 127

సీ. పద్మలోచన, భృగు బ్రహ్మ సంయమి వంశ
  పరిపాటి కభిన వాభరణ మయ్యె,
రమణి, త్రేతా ద్వాపరముల సంధ్యా వేళ
  మగనితోఁ బెక్కేండ్లు మనువు మనియె,
నెలఁత, కానక కన్న నెయ్యంపుఁ గొడుకుచేఁ
  జంపించె ముయ్యేడు సారె *నృపుల,
తరుణి, హైహయరాజ దంతాస్థి పటలంబు
  గవడ పేరుగఁ జేసి కట్టె నబుత,

తే. మండపాకను, బెఱుఁబాక, మాహురమున,
నాగవరమునఁ, బోలాస ననిచె నింతి,
యోరుఁగంట వసించె నీలోత్పలాక్షి,
కాకతమ్మకు సైదోడ యేకవీర. 128

మాహురమ్మ మహిమ

సీ. అలిగి యెంతటి రాజు నాంధ్రనైనను బట్టి
  పుట్టుఁబాపఁ జేయు రట్టుకత్తె,

*నరుల (మూ. ప్ర)

ఘనుఁడైన జమదగ్ని మునినాథు కూరిమి
వెలయించు పెనుఁబాక వేడ్కకత్తె,
సు క్షత్రియ కులంబు నిక్షత్రముగఁ జేయు
కొడుకుఁ గాంచినయట్టి కోపకత్తె,
బవనీల జవనిక పాటల నిల్లాంధ్ర
రమణఁ ద్రుళ్ళాడించు రంతుకత్తె,
తే. యోలిమిఁ గదుళ్ళవాఁగులో నోలలాడు
కలికి పల్లిక దేబెఁ గన్నతల్లి,
వాపి కెక్కినయట్టి ఫోలాస యిల్లు
చక్క మెప్పుల మాహూ రమ్మక్క నాచి. 129

ఏకవీర యెదుటఁ బరశురామ గాథా గీతిక

సీ. కక్ష నిక్షిప్త వికస్వర స్వర విలా
స శ్రీ నివాసంబు జవనికందుఁ
గట్టిన తంత్రికిఁ గంఠ శ్రుతికిఁ గూడఁ,
జొక్కంబుగా నారి సొబగు మీఱ,
నాలాపములు శుద్ధ సాళగ సంకీర్ణ
వివిధ రాగంబుల చవులు చూపి,
ఢమ ఢమ ధ్వనులఁ బొటాటించి, యెడ నెడఁ
గత్తెర మార్గంబు బిత్తరిల్ల,
తే. వాద్య వైఖరిఁ గడు నెఱవాది యనఁగ,
నేకవీరా మహాదేవి యెదుట నిల్చి,
పరశురాముని కథ లెల్లఁ బ్రౌఢిఁ బాడెఁ,
జారుతర కీర్తి, బవనీల చక్రవర్తి. 130

మాలెత - ఏకవీరా కీర్తనము

మ. అలరుం బోఁడి జనంగమ ప్రమద మద్ధ్వానద్ధ ఘంటా ధ్వనుల్
చెలఁగం బాడె సమస్త లోక జననిన్, శ్రీ యేకవీరాంబికన్;

వలరా జొక్కొ్కక మూర్ఛనా స్వరమునకా బ్రాణంబు గల్పింపఁగాఁ,
గఁకంఠీ కలకంఠ కోమల కుహూకారంబు తోరంబుగన్. 131

మ. అకలంకస్థితిఁ గోరి కొల్చెదరు బ్రహ్మానంద భావంబునకా
నక లానంద మయైక మాత యగుచుకా సంతోష చిత్తంబునకా
1తక దుం దుమ్ములు, తాళముల్, జవనికల్, తందాన, లమ్మయ్యకు
న్నేకవీరమ్మకు, మాహూరమ్మకు, నభో హ్రీం కార మ
ధ్యాత్మకున్. 132

శా. ఆలోకింపక మ్రొక్కరాదు నిజ భక్త్యావేశ సంపత్తిమై,
నాలోకించినఁ జిత్త మెట్లగునొ కా మావేశ సంయుక్తిమై?
నేలా గోయ కిరాట? మానుదమొః సంవీక్షింతమో? చెప్పుమా!
వ్రీళా శూన్య కటీర మండలము దేవీ శంభళీ వ్రాతమున్. 133

కాఁపు పూవుఁబోఁడి కైసేఁత

సీ. 2జటివోని గడితంపుఁ జిఱుత చౌకంబుల
తొగరుఁ బట్టము కచ్చఁ దొడివి కట్టి,
యోలగందపు బొట్టు నుపరి భాగంబుపై
సిందూర తిలకంబుఁ బొందుపఱచి.
పసరు దారెడు నింబ పల్లవంబుల దండ
గుబ్బ చన్నులమీఁదఁ గుదురుకొల్పి,
క్రొత్త తోమిన దంత కోరకంబులయందుఁ
దాంబూల రాగంబు తళుకుగూర్చి,

తే. సకల సంధ్యంగములకుఁ దేజంబు గలుగ,
మధు మ దారంభ మణఁకువ మరలఁ ద్రోవఁ,
దేఁకువయు నారజంబునుఁ దేటపడఁగఁ
బురమునకు పచ్చె నొక కాఁపుఁ బూవుఁ బోఁడి. 134

1 తకదుమ్ముల్ మొకతాళముల్, 2చరివోని (మూ. ప్ర)

వ. ఆ య్యవసరంబున నేకవీరాంబకుం బ్రణమిల్లి, యట చను నప్పుడు, 135

## జక్కుల పురంధ్రి-కామవల్లీ స్తుతి

సీ. కోణాగ్ర సంఘర్ష ఘుమ ఘుమ ధ్వని తార
    కంఠ స్వరంబుతో గారవింప,
మసిబొట్టు బోనాన నసలుకొల్పిన కన్ను
    కొదుపుచేఁ దాటించు నెడప దడప,
శ్రుతికి నుత్కర్షంబుఁ జూపంగ వలయుచోఁ
    జెవిత్రాడు బిగియించు జీవగట్టి,
గిల్కు గిల్కున మ్రోయు కింకిణీ గుచ్ఛంబు
    తాళ మానంబుతో మేళవింప,

తే. రాగముననుండి లంఘించు రాగమునకు,
నురుమ యూరు ద్వయంబుపై నొత్తిగిల్లఁ
గామవల్లీ మహాలక్ష్మి కైటభారి,
వలపు వాడుచు వచ్చె జక్కుల పురంధ్రి. 136

## అక్కల యారాధనము

సీ. ముద్రికా మాణిక్యముల దీప్తి కెంగేలి
    పించెంబు కుంచెతో బిత్తరింప,
నుపవాసమునఁ దద్దయును సన్ననగు కౌను
    చను దోయి భరమున జలదరింపఁ,
దోఁకమక్కలఁ బోలు తోరంపుఁ దెలి కన్ను
    *లావైశమున పిగ్గు నతకరింప,
నిద్దంపు వెలి పట్టు నెటికి తూలినయప్డు
    తొడల మించులు వెలిఁ దొంగలింప,

తే. నురుమ చప్పుళ్ళకును బిల్లదొరుల మ్రోఁత
కంతకంతకుఁ బేరుబ్బు నావహింప,

*లావేశమున (మూ. ప్ర)

నాడెఁ బీటలపై నోలిఁ గూడియున్న
యక్క లేఁడ్వురలో నొక్క యలరుఁబోఁడి. 137

చ. హర!హర! యింత యొప్పునె మహారభటీ జగ ఝంకృత స్వన
స్మరళి విమిశ్రితాంక రవ మూర్ఛనఁ *జిత్తము లుబ్బ, యక్క లే
డ్వురు నటె యాడఁజొచ్చిరి కడుం గడు వేడ్క, సమున్నమ
త్ప్రయో
ధర యుగ భార భీమతమ తన్వవలగ్నము లైన నృత్యముల్.

వ. ఇదె యీ యింటి యజమానుండు సంతాన కాంక్షియై, ప్రతిబంధనోద
నార్థంబు యక్ష కన్యలం బరీ ఆరాధనంబు సేయుచున్నవాఁడు
గావలయు. మాణిభద్రకులోద్వహులైన దేవతలు, కామవల్లి శ్రీమహా
లక్ష్మితోఁగూడి యపేక్షిత కార్యంబు మనకు నవ్యాక్షేపంబునం
జేయుదురు గాక! యనుచు, విశ్వాసంబుతో నమస్కారంబు సేసి,
కాసల్నాటి గోవిందమంచనశర్మ, నర్మసఖుండు దాను నట చని
ముందట, 139

ఆ. మంద్ర మధ్య తార మాన త్రయీ భిన్న
మహిష శృంగనాద లహరిఁ గూడి,
డమరు డిండిమంబు డమ డమ ధ్వని మ్రోసె,
నద్భుతం, బిదేమి యార్భటంబు? 140

వ. అని టిట్టిభుం డడిగిన, 141

మైలార వీర భటుల పటు సాహస కృత్యములు

సీ. అవ అవ మండు నెఱ్ఱని చంద్ర మల్లెల
చోద్యంపు గుండాలు చొచ్చువారు,
కరవాఁడి యలుగుల గనప పాఁతర్ల లో
నుట్టి చేరులు గోసి యుఱుకువారు,

*చిత్తము (మూ. ప్ర)

గాలంపుఁ గొంకిఁ గంకాళ చర్మము గ్రుచ్చి
యురు వీధి నుయ్యాల లూఁగువారు,
కటికి హొన్నాళంబు గండగత్తెర పట్టి
మిసిమింతులను గాక మ్రింగువారు,

సందులను నారసంబులు సలుపువారు,
యెరవు కుడిచేత నారతు లిచ్చువారు,
సాహసము మూర్తి గైకొన్న సరణివారు,
ధీర హృదయులు, మైలార వీర భటులు. 142

గౌరగ పడుచు గొండ్లి యాట

వీరు మైలార దేవర వీర భటులు,
గొండ్లి యాడించుచున్నారు, గౌరగ పడుచు
నాడుచున్నది చూడు [1]మర్ధాభినయము,
తాను [2]నెట్టికసీలంత గాని లేదు. 143

వెనుకకు మొగ్గవ్రాలి, కడు చిన్నను వొప్పుఁగఁ దొట్టె వీళ్ళలో
మునఁగి, త దంతవస్త్ర మగు ముంగర ముక్కున గ్రుచ్చుకొంచు లే
చెను, రసనా ప్రవాళమున శీస్రము గ్రుచ్చెను నల్లపూస పే
రనుపమ లీల, నిప్పుడు చుపాయము లిట్టివి యెట్టు నేర్చెనో? 144

మైలార దేవ స్తుతి

అనివార సిద్ధి, సజ్జన పారిజాతంబు,
వరదాత, యాదిత్య వార భోగి,
మాదవీ[3]రమణుంగు మాయా వినోదుండు,
మాళవీ ప్రియభర్త, మహిత యశుఁడు
పల్లెమ్మ నాయకుం, డెల్ల వేల్పుల రాజు,
గనప వేఁటల వేడ్కకాండ్ర భర్త,

---

1. మర్ధాభినయము (వే) 2. నట్టికసీలంత (మూ. ప్ర); 3. రమణుండు (వే)

కత్రశాల.స్వామి, కరుణా పయోరాశి,
పుణ్య కీర్తనుఁ డైన ప్రోలి యయ్య,
తే. మంచు కుంచాలఁ గొలువంగ, మాయ లేళ్ళఁ
బట్టి కట్టంగ నేర్చిన బాసవెల్లి,
భైరవుని తోడి జోడు, మైలార దేవుఁ,
డొరుఁగంటి నివాసి మే లొసఁగుఁ గాక! 145

మ. అదిగో యెత్తినవారు పట్టణము మధ్య క్షోణి సింహధ్వజం!
బదిగో కట్టినవారు నింబ దళ మాల్యా తోరణ వ్రాతముల్!
విదితం బయ్యె మహోత్సవంబు, నెఱయన్ వీథీ విటంకంబులం
దదిగో! నిల్పినవారు పూర్ణ కలశం బాబాల వృద్ధాంగనల్. 146

మ. అకలంక స్థితి శీధు పాన రుచులై యా సాదు లుప్పొంగి, "యో
యకరో! యమ్మకరో! యమక్కరో! యదీ! యట్టట్టకో!"
యంచుఁ బా
యక తప్పెట్లును, దళ్లితాళములు నింపై సొంపు రంపిల్లఁగా
జకజుంజుం జకజుంజు జుమ్మ మనుచున్ సాగుం గదున్
వాద్యముల్

వ. అట చని ముందట, 147

నగరమందలి నానావిధ దేవాలయములు

సీ. అదె భైరవ స్థాన! మటమీఁద నల్లదె
చమదేశ్వరీ మహా శక్తి నగరు!
వీరభద్రేశ్వ రాగార మండప మదె!
యదె బౌద్ధ దేవు విహార భూమి!
అదె ముద్దరాల్ మసానమ్మ నివాసంబు!
నల్లదె కొమరసామయ్య నగరు!
అదె పాండవుల గుడి! యట దక్షిణంబునఁ
గర్తారుఁ డుండు తుర్కల మసీదు,

తే. కొంత దవ్వుల నదె మహాగోపురముల
పైఁడి కుండలు రవి దీప్తిఁ బ్రజ్వలించి,
కాననయ్యెను మేరు శృంగములఁ బోలెఁ
గేళవ శ్రీ స్వయంభూ నికేతనములు. 149

వ. అనుచు నట చని, ముందట నొక్క భైరవాలయంబుఁ బొడగని, నమస్కరించి, కాసల్నాటి గోవింద మంచనశర్మ యిట్లనియె: 150

మంచన గావించిన భైరవ స్తుతి

మ. అమితోత్సాహముతోడ నీవు పటుబాహాదక్కనొక్కొక్కమాటు మనాక్కంపము నొందఁ జేయఁ, దొలఁకాడుణ్ వార్ధి వేలాతట త్క్రమరంబై, పలమాన మీనమయి, యుద్యన్నక్రమై, యుత్తర త్తిమియై, యుల్లల దంబు మగ్న ధులియై ధీరా! మహాభైరవా!

వ. అని యూర్ధ్వం బవలోకించి యిప్పుడు మధ్యాహ్న కాలం బగుచున్నయది. 152

నిప్పులు చెఱఁగెడి బీరెండ

శా. వ్రాలెన్ దిక్కులు, భాను భా వ్యతికర ప్రక్రీడ దర్కోపల జ్వాలా జాల జటాల జాంగల తటీ వాచాల కోయష్టులై, రోలంబంబులు మూతిముట్ట వెఱచెన్, గ్రొవ్వేడి బీరెండలన్ జాలం గ్రాఁగి కరంబు వేడియగు కాసారాబ్జమైరేయముల్. 153

వ. అని, యనంతరం బాకాశంబునం జెవిపెట్టి, శ్రుతి నభినయించి గోవిందుండు 154

గడియారమ్మున ఘంటా నాదము

మ. ఉడువీథిన్ శిఖ రావలంబి యగు నం
ద్రోర్వీశు మోసాలపై
గడియారంబున మ్రోసె రెం డెనిమిదుల్
ఘంటా ఘణత్కారముల్,

సడలెన్ భానుఁడు పశ్చిమంబునకు,

వైశ్యా! పూఁటకూ టింటికిన్

గుడువం బోదమె లెక్కఁ యిచ్చి? కడు నాఁ

కొన్నార *మిప్పట్టునన్. 155

వ. విచారించిన నదియును మనకు విశ్రమ స్థానంబు, 156

పూఁటకూటింటఁ బుష్పశరుని దౌత్యము

గీ. సంధి విగ్రహ యానాది సంఘటనల

బంధకీ జారులకు రాయబారి యగుచు,

బట్టణంబున నిత్యంబు పగలు రేయి

పూఁటకూటింట వర్తించుఁ బుష్పశరుఁడు. 157

వ. అనుచుఁ గొంత దవ్వరిగినం దమకు నెదురుగా నేఁతెంచు నొక్క బ్రాహ్మణుం గనుంగొని, 158

ఉ. వీఁ డిదె తెల్లనాకులను వీడెము సేయుచు వీథి వచ్చుచు న్నాఁడు, మదించి తిండి తినినాఁడు చుమీ: యిటమీఁద నేఁడకో తేఁడఁగఁబోయెడిం, గరణ దేశపు జాణఁడు గాఁగఁ బోలు నీ బాఁడు, పణోపహార పరిపాటి యెఱుంగఁగవచ్చు వీఁచేన్. 159

వ. ఇతఁడు వెడలి వచ్చు నవ్వాడయె పూఁట వంటకంబు వెట్టు బాడబుల వాడ గావలయు, నడ యెట్లంటేని, 160

ఉ. ఘ్రాణ పుటీ కుటీరములఁ గాఁపుర ముండఁ దొడంగె నిప్డు పా షాణ ఖరట్ట ఘట్టన వశంబునఁ బుట్టిన సత్తు గంధ, మ క్షీణ కఠోర సౌరభ విజృంభణ దిక్కులఁ జల్లఁజొచ్చె సా మ్రాణి పదార్థ జాలములు, బ్రాహ్మణ కాంతలు తాలఁ

బోయఁగన్. 161

*మిప్పూటకున్ (మూ. ప్ర)

గీ. మంద వేగంబుతోఁ గ్రొత్త మలఁకవాళ్ళ
కిఱ్ఱు చెప్పులు మొరయ, నుంకించి నడుచు
కరణ బ్రాహ్మణ విట ముఖ్యుఁ గదియవచ్చి,
పూతిమా షాన్వయుం డగు భూసురుండు. 162

వ. పూఁటపంటకంబుల వృత్తాంతం బడిగిన నతండు, 163

ఆహార విహారముల యభిరుచులు

క. ఆహార విహారములకొ?
యాహారంబునకునో, విహారంబునకో
బేహారము? మీ కీ నం
దే హారంభంబు మాకుఁ దెలియఁగ వలయున్. 164

వ. ఆహారంబున కంటేని; 165

ఉ. కప్పురభోగి వంటకము, కమ్మని గోధుమ పిండి వంటయుఁ,
గుప్పెఁడు పంచదారియును, గ్రొత్తగఁ గాఁచిన యాల నే, పెస
ర్పప్పును, గొమ్మ నల్లనఁటి పండ్లును,నాలుగు నైదు నంజులుఁ,
లప్పడతోడఁ గ్రొం బెరుగు, [1]లక్ష్మణ వజ్జల యింట
రూకకున్. 166

వ. విహారంబున కంటేని? 167

క. అఱు గౌను, గుబ్బ చన్నులు,
మెఱుఁగుం గన్నులను గలుగు మెచ్చుల నవలా
కుఱుబోడ ముండ రత్నము
[2]బఱివోవఁగ విడిచినట్టి బ్రహ్మకు జే జే! 168

శా. పూవుంబోఁడులు లేరె విప్ర విధవల్ భూమండలిన్? దాని దే
ఖా పై దగ్ధ్య విలాస విభ్రమ కళా గర్వంబు లట్లుండనీ,

---

[1] లక్ష్మణ యొజ్జల (మూ. ప్ర)

[2] బఱిపోతుగఁజేసి. (మూ. ప్ర)

యా విశ్వస్త యుపస్థ చాయ నవ లక్షాధీశ ఫాలస్థలీ
సౌవర్ణస్థిర పట్టబంధ సుషమా సౌభాగ్య లక్ష్మిఁ దగున్. 169

ఉ. కోయిల పంచమ స్వరము క్రోల్చిన భంగిని *గంఠమెత్తి, రా
మాయణ మాఱు కాండములు నచ్యుత జాగర వేళఁ బాడె నా
రాయ విశంతు రత్న మనురాగముతోడ, "నమశ్శివాయ శా
న్తాయ సమస్త దోష హరణాయ" సమానమె దాని
కెవ్వరున్? 170

ఉ. సంకృతి పూతిమాష కుల సాగర శారద పూర్ణిమా కురం
గాంకుఁడు మంచి, లక్ష్మణు గృహంబున నెచ్చెలికాఁడుఁ
దానునుం
జంకల బంటిగా మెసవి, చక్కని వేడుకకత్తెఁ జూచి, తా
రింకొకమారు వత్త మని యేఁగిరి కార్య భరంబు పెంపునన్. 171

వ. అటం బోవం బోవ ముందట, 172

పుష్పలావిక-నేఁడగి పూవు కానుక

సీ. పాంథ సీమంతినీ ప్రాణ మత్స్యములకు
గాలము లగు కంటకములతోడ,
గరుడపచ్చల చాయఁ బరిహసింపఁగ జాలు
దళమైన బాహ్య పత్రములతోడ,
జీర్ణ కీకస కణ శ్రేణిఁ బిడ్డలు చేసి
యవియఁ దోచినయట్టి యన్నుతోడఁ
బదియాఱు వన్నియ బంగారు సరి వచ్చు
సంవర్తికా పలాశములతోడ

తే. శివుని చిచ్చుఱకంట వెచ్చిన యనంగు
బూది కెన యైన కమ్మఁ బుప్పొళ్ళతోడఁ

* విద్దిచూచి (మూ. ప్ర)

దాని ఘనమైన కమ్మ గేదంగి పూవు,
భూసురున కిచ్చెఁ దగ నొక్క పుష్పలావి. 173

వ. ఇచ్చినం జూచి, 774

ఉ. క్రొన్నెల రేఖతోడఁ గెళఁగూడి సుఖింపఁగ భాగ్య మబ్బమిఁ
ఖిన్నత నొందుఁ గాని నవ కేతకి, శూలి వివేక హీనుఁడై
తన్నుఁ దిరస్కరించుటకు దైన్యము నొంద, దదే వివేక సం
పన్నిధి దాని పాలి పెరుమాళ్కుఁ డెక్కుడ నైన
లేఁ దాకో? 175

గీ. అందుకొని, పుష్పలావికిఁ ద్యాగ మిచ్చి.
బ్రాహ్మణుల కందు నొక్కొక్క [1]పత్ర మొసఁగి,
జాణ విప్రుండు పిగఁ దాల్చెఁ, జందమామ
కొండనాలిక యగు నొక్క గొనులి రేకు 176

వ. అదె విద్వేషి భువన జిగీషా సంరంభ విజృంభమాణ ఝషధ్వజ భుజ పరాక్రమ సముత్సాహ నాటక ప్రస్తావనా ప్రథమ నాందీ శ్లోకం బగు వేశ వాటికా నికటంబు: 177

మాచల్దేవి చిత్రశాలా ప్రవేశము

గీ. చందనంబునఁ గలయంపి చల్లినారు
[2]ముగ్గు లిడినారు కాశ్మీరమున ముదమున
వ్రాసినా రిందు రజమున రంగవల్లి,
కంజములఁ దోరణంబులు గట్టినారు. 178

వ. ఇది యెవ్వరి యిల్లొకో, శోభనంబు ముడిపడుచున్నయది! యనుచు నాకాశంబు వీక్షించి, యచ్చటి వారల నేమి యని యడిగిన, 179

1 రత్న మొసఁగి (మూ. ప్ర)

2 మ్రోక లిడినారు కాశ్మీర మృగ మదమున (మూ. ప్ర)

శా. ద్వీపాంతంబుననుండి వచ్చితివె? భూదేవా! "ప్రశాంతం మహా
పాపం" సర్వ జగత్ప్రసిద్ధ సుమనో [1]బాణాస నామ్నాయ వి
ద్యోపాధ్యాయి, ప్రతాపరుద్ర ధరణీ శోపాత్త గోష్ఠీ ప్రతి
ష్ఠా పారీణ, నెఱుంగవయ్యెదవె మాచల్దేవి వారాంగనన్? 180

వ. చిత్రశాలా ప్రవేశంబు చేయుచున్నయది. పుణ్యాహవాచన కాలంబు,
మీరునుఁ బచ్చని [2]పెండ్లికూటంబుఁ జూడవచ్చునది యనిన, 181

తే. లెస్స గాక కిరాట! యీ లేమ చరిత
మాడుదురు నాటకంబుగ నవనిలోన,
దీనిఁ జూడంగఁ బోదమా? యీ నెపమున
నరపి చూతము మన కేమి యవట? ననుమ, 182

వ. ప్రవేశ నాటితకంబునఁ జిత్రశాలఁ జొచ్చి, పూతిమాష
గోత్రుం దచ్చోటం [3]బెండ్లికూటంబున నిలువునం గై సేసి, హంస
తూలికా తల్పంబు మీఁదం గూర్చున్న, హావ భావ విభ్రమ
విలాస నిధి మాచల్దేవిని గనుంగొని, 183

తే. అంకుశాఘాత రేఖల నంద మొందు,
గంధగజ కుంభములతోడఁ గలహ మాడు
క్రొత్త నఖములతోడి నీ కుచ భరమున
కతివ! యభ్యుదయ పరంప రాభివృద్ధి. 184

తే. కల్లఁ జెప్పము, విను నీకుఁ గల ప్రసిద్ధి
ఢిల్లి సురతాణికిని లేదు పలవోష్ఠి!
యాదిలక్ష్మికి నీకును భేద మేమి?
యుదధి జనియింప కుండుట యొకటి దక్క. 185

తే. ఓరుఁగంటి మాచాంబ పయోరుహాక్షి,
పంచబాణావతారుని, వంచిఁ జూచి,

1 వాణీ (మూ. ప్ర) 2 పిలికూటంబు; (మూ. ప్ర) 3 పిలి (మూ. ప్ర)

కంక ణాలంక్రియా ఝణత్కార మెసఁగ,
"నయ్యగారికి జోహారు" లనుచు మ్రొక్కె. 186

తే. అగురు ధూ పాధివాసి తాభ్యంతరంబు,
మగువ! నీ మన్మథచ్ఛత్ర మండపంబు
సర్వ యోషి దసామాన్య సౌష్ఠవంబు,
కాచుఁగావుత మోర్గంటి కటక విటుల! 187

వ. అనుటయు, 188

మంచన మాచల్దేవుల సరస సంభాషణము

సీ. *ఎందుండి వచ్చితి రీరు? కాసల్నాట
నుండి వచ్చితిమి మే ముత్పలాక్షి!
యెవ్వరివారు మీ? రేము సంకృతి పూతి
మాష మాధవుని కుమారవరుఁడ,
మీ దివ్య నామకం బేది యో? గోవింద
మంచనశర్మ సమాహ్వయులము,
మీర లిచ్చటికి రాఁ గారణం బెయ్యది?
చేరి మీబోంట్ల నాశీర్వదింప,

తే. నైన విచ్చేసి కూర్చుండ నవధరింపు,
వార్చి వచ్చెద మటు వోయి వనరుహాక్షి!
యెచ్చటికి వార్వఁ బోయెద రెఱుఁగఁ జెప్పుఁ?
దక్కవాడకు, మేము బ్రాహ్మణుల మగుట. 189

వ. చిత్రావలోకనంబు చేసి, టిట్టిభునకు గోవింద మంచనశర్మ
యిట్లనియె: 190

చిత్తజుని శౌర్య మెఱిఁగించు చిత్రశాల

సీ. అదె దారు వనభూమి! యసమనేత్రుఁడు వాఁడె!
సంయమీంద్రుల పుణ్య సతులు వారె!

* ఈ పద్యము ప్రశ్నోత్తర రూపమునఁ గలదు.

యదె కన్యకా రత్న! మజ్జానముఁడు వాఁడె!
యదె రతిక్రీడా విహార శయ్య!
వాఁడె వైకుంఠుండు! వారె గోప స్త్రీలు!
యమునా నదీ సైకతాంత మదియె!
యదె యహల్యాదేవి! యమరాధిపుఁడు వాఁడె!
యదె పర్ణశాలి కాభ్యంతరంబు!
తే. చందురుఁడు వాఁడె! యదె బృహస్పతి పురంధ్రి!
జాలరిది యదె! శ్రీ పరాశరుఁడు వాఁడె!
కుశికజుఁడు వాఁడె! యదె యింద్రు కొలువు లేమ!
చిత్తజుని శౌర్య మెఱిఁగించెఁ జిత్రశాల 181

ఉ. తియ్యనివింటి జోదు, రతి దేవి చనుంగవ నొత్తిగిల్లి, యొ
య్యొయ్యన వంక చక్కఁబడ నొత్తెడుఁ జూచితె పుష్ప బాణముల్?
మయ్యెర వ్రాసెఁ జిత్తరువు [1]మాఁగిలి మాఁగిలి, చిత్రకారుఁడా!
దయ్యము గాక! [2]యీవి పస దానము టిట్టిభ! వీని కీఁదగున్. 192

వ. అనుచుఁ ద ద్గృహంబు నిర్గమించి, పూర్వానుభూత యగు గాంధర్వి గృహంబు రోయువాఁడు, కతిపయ మందిరంబులకు నవల సిందువార లతికా కుడుంగం బడియాలంబున నెఱింగి, యనుంగు మొగసాలం జొచ్చిన, దాస దాసీ జనంబు ససంభ్రమంబుగా నెదురేఁగి తోడ్కొని పోవం బోయి, యభ్యంతర మందిరంబున మహోత్సవ వ్యాపార పారీణయై యున్న య వ్వారముఖ్యం జేరి, యాస నార్ఘ్య పాద్యాది సముచిత సత్కారంబులం బొంది సుఖాసీనుండై, 193

## మదనరేఖకు ముకుర వీక్షా మహోత్సవము

ఉ. *గోత్రమువార లెల్లఁ గెడఁ గూడినవారు, వ్రతంబొ, దేవతా
యాత్రయొ, పండువో, మన గృహంబున శోభన మేమి, శోభనం

1 మాంగిలి మాంగిలి (మూ. ప్ర)
2 నీవి; (వే) వీని (మూ. ప్ర)

బ్రతి సమానః, నేఁటి యపరాహ్ణ సమాగమ వేళఁ, బుష్య న
క్షత్రమునందు, నీ యనుఁగు గాదిలి కూఁతురు, చూచు
నద్దమున్. 194

క. ఆ వేళ నీవు బిడ్డకు,
దీవన మంత్రంబు చెప్పు దీర్ఘాయు వగుణ్,
లావణ్యంబు వివేకము
ప్రావీణ్యము వైభవంబు భాగ్యము గలుగున్. 195

తే. ముకుర వీక్ష విధానంబు మొదల లేక,
వెల పడంతికిఁ గారాదు విటునిఁ గవయ,
యాయజూకున కెట్లు చేయంగవచ్చు
నరణి సంగ్రహ మొనరింప కధ్వరంబు? 196

తే. లంజెవారికి శ్రీ మహాలక్ష్మి గాదె
దర్పణము విప్రముఖ్య! గంధర్వ గణము
పుణ్యచారిత్ర! దృష్టాంతభూమి గాదె
దర్పణమ్ము వివర్త వాదముల కెల్ల? 197

ఉ. ఉన్మద మత్తకోకిల కుహూ కల పంచమ రాగ రాజ సం
పన్మహనీయమైన మధుమాసపుఁ బున్నమనాఁడు, బిడ్డకున్
మన్మథవేధ దీక్ష పది నాళ్ళగు మాత్రము, నేత దర్థమై
సన్మతి నుండఁగావలయుఁ జక్కనివాఁడవ యక్కవాడలోన్. 198

సీ. అదె నీ కుమారిత మదనరేఖా కన్య,
వదన రేఖా వైభవమునఁ జంద్రు
*దొరఁ గూర్చికొన్నది ధూర్తదేవత, నిమ్నఁ
దండ్రిఁ బోలినయట్టి తరళనయన,
సాముద్రి కాగమ జ్ఞాన పారీణులు
కడు భాగ్య సంపద గలది యంద్రు,

*ఈ పద్యమునకు ప్రశ్నోత్తరములు గలవు. ధృతి. (మూ॥ప్ర)

భాగ్య సంపద కల్మి ప్రస్ఫుటంబు న్యోఁగా
1మీర లిందుల వచ్చి మీఱియుంట,

తే. జనకుఁడవు, కర్త వాజ్ఞవు, సజ్జనుఁడవు,
క్రొత్త అంజెల కాముండ, వుత్తముఁడవు,
తొడల నిడుకొని, ముద్దు కూఁతునకు నీవు
మించు టద్దంబు చూపరా! మంచి రాజ! 199

గీ. కేఁక గ్రొమ్మించు టద్దంబు గిలుకొల్పి
మంచి తొడమీఁద నొప్పారె మదనరేఖ,
ముద్దు నెమ్మోము లావణ్యమున జయించి
కువలయాప్తుఁ జెఱవెట్టుకొన్న కరణి. 200

క. దీవించి మంచి కూఁతురు,
"శ్రీ వర్ధస్వంబు" చెప్పి, చెవి 2టిట్టిభ సె
ట్టీ! వెస నిప్పింపుము సం
భావన నొక వెండి, బిడ్డ పసుపున కనియెన్. 201

వ. అనంతరంబు గాంధర్వి పూర్వ సంబంధంబున నైన ప్రేమాను
బంధంబునఁ గేలు గేలం గీలించి యిట్లనియె: 202

తే. ఎందు పోయితి గోవింద? ముందరట్ల
యెంద అతివల వలపించి తెచట నెచట?
తలఁపు పుట్టించెనే నీకు దైవ మిట్లు
పాయసం బారగించిన ప్రాఁత పట్టు! 203

శ్రీకాకుళపుఁ దిరునాళ్లలో నసమబాణుని స్వైర విహారము

తే. దననపున్నమఁ గాకు శాధ్యుఁడైన
తెలుఁగు రాయఁడు దేవ తాధీశ్వరుండు,

1...వత్సరం బుడుగకుండ (మూ. ప్ర)
2టిట్టిభ సెట్టివిగ నిప్పించెను (మూ. ప్ర)

భువన హితముగ నుత్సవం బవధరింప
నందుఁ బోయితి మీ వోయినట్టి యేఁడు. 204

తే. *కారవేల్ల మతల్లికా కల్పవల్లి
కడుపు నిండారఁ గాంచిన కొడుకుఁగుబ్జు,
జార చోర మహా ధూర్త చక్రవర్తి,
దేవ వేశ్యా భుజంగుండు, తెలుఁగు భర్త. 205

ఆ. పసిఁడి కోర వేఁడి పా లారగించినఁ
బుల్లసిలిన యధర పల్లవమున,
విప్ర కన్య చనవు వెలయించుచున్నాఁడు
విశ్వమునకుఁ గాకు శేశ్వరుండు. 206

ఉ. ఈరస మెత్తు వేదములు, హ్రీ వహియించుఁ బురాణ సంహితల్,
సౌరభ హీనమౌ నుపనిషత్తుల, [1]లేఁబడు నాగ మావళుల్,
గారవ ముల్లసిల్ల పిరికాకుళ నాథుఁడు నాగదేవ భ
ట్టారకు నింటఁ బుట్టి, ప్రకటంబుగ వేడుక నాదరింపఁగన్. 207

మ గరుడ స్తంభ ప్రతిష్ఠా కలన మొదలుగాఁ
గల్ప మంత్రోక్త పుష్పా
ధ్వర పర్యంతంబు కృష్ణా తటిని తటమునన్
ద్వాదశ క్రోశ ధాత్రీ
పరివేషాభ్యంతర శ్రీ పరమపదమునం
బర్వకాలంబునందున్
బరనారీ సంగమాదుల్ భగవ దనుమతిం
బాపముల్ గాక యుండున్. 208

శా. వ్యామ గ్రాహ్య సిత బ బింబ కుచ భా రాభీల భ ద్రాకృతుల్,
కా మాంధల్, వెలనాటి కోడె విధవల్; కాకొల్లి తిర్నాళ్ళలో

*కారవల్లి (మూ.ప్ర) 1 వెంబడు (మూ. ప్ర)

నా [1]మాంధాళల, భీమసేనుఁడు హిడిం బాధీశ్వరుం, డోపునో
యేమో కాని, [2]తెమల్పనేర రితరుల్ హేలా రతి క్రీడలన్. 209

ఉ. పేర్చిన సందడిం బెదవి పీల్చి, యురంబునఁ జన్ను లొత్తి, చే
దూర్చి, యనంగ మందిరము దూకొని, కూరిమి నీరు జబ్బినన్
గార్చుకొనంగఁ జేసి, యఱుఁ గౌఁగిట నుప్పర మెత్తి, యేటికిం
దార్చి, రమింతు రూళల వితంతువులం దిరునాళ్ళఁ బల్లవుల్. 210

క. ముంజె పద నైన శంబర
ళంజను గేహములు గలుగు బ్రాహ్మణ విధవా
పుంజము [3]లుండఁగ, నూరక
లంజియ లేమిటికిఁ గాకుళపుఁ దిరునాళ్ళన్? 211

సీ. జవరాలిఁ బొడగన్న సన్న్యాసిపై నేయుఁ
దులపి లేఁ జిగురాకుఁ దూపు మరుఁడు,
వేదవిప్రునిఁ గన్న విధవపై ఝళిపించు
దర్భ పల్లవ హేతి దర్పకుండు,
కటకారకుల కన్యఁ గనిన హాళికుమీఁదఁ
బొడుచుఁ బూ మునికోలఁ బుష్పశరుఁడు,
నాడింధమునిఁ గన్న నాతిపై నేయును
నలరుఁ జివ్వలి కోల నంగభవుఁడు,

తే. బెరసి వెన్నెల కాయంగఁ, బేరకమ్మ
పులినతలముల నాయాయి కొలము లెఱిఁగి,
తాల్చి శ స్త్రాస్త్రములు జార దంపతులకు
నసమ బాణుండు, తిరునాళ్ళ నన్ని నాళ్ళ. 212

వ. అని, యనంతరంబ యా ముందటం జనుదెంచు వితంతు
సమూహముం గని, యాశీర్వదింపవలయు నని, 213

---

1 మాంధాత్రుఁడు (ము. ప్ర)

2 తెరల్పఁజాల రితరుల్ యెవ్వార లత్యుద్ధతిన్ (మూ. ప్ర)

3 లూరక కలుగఁగ (మూ. ప్ర)

## స్వచ్ఛంద చారిణులకు మంచన దీవెన

సీ. చెలఁగి చెలఁగి పొత్తి [1]చీరలు గట్టెడు
మాచకమ్మకు దీర్ఘ మాయు రస్తు!
సారె సారెకు దేవ సదనంబునకు నేఁగు
చెడిపెకు సంకల్ప సిద్ధి రస్తు!
నిత్యంబు వ్యభిచార నిష్ఠతో నుండెడు
విధవకుఁ బుత్రాభివృద్ధి రస్తు!
దళముగాఁ దులసి పేరులు ధరించినయట్టి
విశ్వస్త కారోగ్య విభవ మస్తు!

తే. మిండ ముండకు సంప త్సమృద్ధి రస్తు!
పఱచు తెంపికి నిత్య సౌభాగ్య మస్తు!
వదరుఁ గల్కికి నిప్పు తావాప్తి రస్తు!
బలు వితంతుకు మైథున ప్రాప్తి రస్తు! 214

వ. అని యట చనునప్పుడు, 215

## మంచన కామమంజరి ననునయించుట

వ. అనిన, [2]గాంధర్వి పరదేశ పట్టణంబుల వితంతువులచేత వక్షః కుట్టనంబు సేయించుకొన మరగి, నీ వెట్టు మమ్ముం దలంతువు? పద పద, విచ్చేయు, మనుచు నీర్ష్యా కుటిలం బగు కటాక్షంబునం జూచిన, 216

చ. లవ లవఁ జన్ను దోయి గదలఁగా, దొలుకారు మెఱుంగుఁ దీఁగలం
గవ కవ నవ్వు డాలు వలి కన్నుల మించులు చౌకళింపఁగా,
నవ నవ యౌవనంబు గల నాఁటి భవ త్పురుషాయి తోద్ధతుల్,
శివ శివ! యెన్ని భంగులను జిత్తములో మఱవంగ వచ్చునే! 217

1 చీర గట్టెడు మానకమ్మకుఁ జాల దీర్ఘాయురస్తు (మూ. ప్ర.)
2 గాంధారి (మూ. ప్ర)

వ॥ కార్యాంతర వ్యాసంగంబున నార్యవాటికిం బోవుచున్నవాఁడ, మన మదనరేఖా కన్య దర్శనావలోకన మూహూర్తంబు సు ముహూర్తం బయ్యెడుఁ బోయివచ్చెద నని 218

## నాగరికుని నాగ స్వరము

తే. వెడలి, పశ్చిమ దిశ నాల్గు గడియ లంత
ప్రొద్దు గలుగంగ నడుపీథిఁ బోయి పోయి,
కేళి సఖుఁడును దా నాలకించి చనియె
నాగ సారముల మ్రోఁత, య న్నాగరికుఁడు, 219

## పాములాట

క. నాగస్వర సుషిర సర
న్నాగవరా ళ్యాది వివిధ నానా రాగ
ప్రాగల్భ్య ప్రకట ఫణా
భోగములై యాడఁజొచ్చె భోగీంద్రంబుల్. 220

సీ. కద్రూ మహాదేవి గారాపు సంతతి,
మధుకైట భారాతి మడుఁగుఁ బాన్పు,
కాలకంతుని యంఘ్రి గండ పెండారంబు,
హనుమంతుని తేరి ప్రగ్రహంబు,
నక్షత్రవీథి నెన్నడిమి పెద్ద గ్రహంబు,
మూ లాలవాఁ౦బు మొదటి దుంప,
యాఁటభైరవదేవు యజ్ఞోపవీతంబు,
క్రీడా వరాహంబు తోడి జోడు,

తే. యర్జునందను పెలకట్టె యంపకోల,
పులఁగురాయని తాత్కాల పుణ్య భిక్ష,
కేతకీ పుష్ప వాసనా కృత్రిమ మాపి,
పర్వతేంద్రంబు తరిత్రాడు, పాపఱేఁడు. 221

వ. ఇమ్మహా నాగంబుల మనకుం గార్యసిద్ధి యొసఁగుం గాక! యని చని, ముందట, 222

పాముల మెంగని నాగస్వర నైపుణి

సీ. కడ గోరఁ దీర్చిన కస్తూరి గీర్బొట్టు
నెక్కసెక్కెంబుగాఁ జుక్క మెఱయ,
నడ్డంబు ప్రకటంబునై యురస్స్థలమున
గంధసార *స్థాసకములు మెఱయఁ,
జాల నిగ్గులు గుల్కు పాల తెక్కల కుచ్చు
వామ కర్ణంబుతో వక్కళింపఁ,
బెనచి వెండ్రుకలతోఁ బిరివెట్టి చుట్టిన
ప్రాఁత చెంద్రిక పన్నె పాగ యమర,
తే. జన్నిదంబుగఁ బెను బాము సవదరించి,
యంఘ్రి కటకంబు ఘల్లు ఘల్లనుచు మొరయ.
నాహితుండిక గరళ విద్యాధిరాజు,
వచ్చెఁ బాముల మెంగఁడు, వదరులాఁడు. 223

సీ. పూత్కార పవనంబు పూరించు పుక్కిళ్ళు
ముసిఁడి పండులతోడ ముద్దుఁగురియ,
సందిటి సంకు పూసల సద్దు కటు తుంబి
నాద స్వరోజ్జృంభణముల నడఁప,
నేడు రంధ్రమ్ములు నిరుఁ గేల ప్రేళ్ళను
వివృతి సంవృతి లీల విస్తరింప,
నాలాప తాళాంత రాంతరంబులయందుఁ
గిక్కను శబ్దముల్ చొక్కటముగ,
తే. నాగసింధు ప్రభేద నానా వరాట
రాగ గంధర్వ లహరి కారంభణముల

*స్థానకములు (మూ. ప్ర)

మిహి పదంబుగఁ బాముల మెంగఁ దూఁదె
భోగిరాజులు న ర్తింప నాగసౌరము. 224

వ. అట చని, ముందట నొక్క మండపంబున నొక విట భట పట
లంబు నెదురుకట్ల నార్భటించ టిట్టిభుండు ఓని, గోవిందశర్మ
నడిగిన, 225

తూర్పునాటి గడిఁడు

సీ. నున్న నై నలు పెక్కు నొసలఁ జేరువ కంటి
కెఱువనైచిన శిఖ పెరలుచుండఁ,
గరసానఁ దిగిచిన కలివె గందపు బొట్టు
తిరికట్టుకొని మోము తిరిగియుండఁ,
దట పెట ధిమికిట ధ్వను లోలిఁ బుట్టింపఁ
జాలు గుమ్మెట చంక వ్రేలుచుండ,
నలుకనై మీఁజేత నంటిన యా క్రొత్త
మువ్వల త్రెము [1]సారె ములుగుచుండ,

తే. నొసలు సుక్కించు నావుర్న నోరు దెఱచు,
గ్రుడ్లు మిడికించు, రాగంబు [2]గుమ్మడించు,
పాడు గతులకుఁ దను దానె పరగి యాఁడు;
నల్ల యాతండు వో తూర్పునాటి గడిఁడు! 226

పొట్టేళ్ళ పోరు - ప ందెములు

వ. అనుచు నట పోవఁ, గంటె కిరాట! రెండు మేష కంఠీరవంబు లా
పీరాట రేవున నీరను ముంచి పంచితంబున నస్యంబు పేయుచుఁ
బెంచుటంజేసి, ధేనువుల ననుధావనంబు సేయు వత్సంబులం
బోలె, వాత్సల్యంబునం దమ యేలికల వెంటఁ గంఠ గ్రైవేయ
ఘంటికా టంకారంబులను, విషమ విషాణ కోటి ఘటిత కలా

1 సాలె (మూ. ప్ర) 2 గుమ్మరించు (మూ. ప్ర)

పాయ సాశ్వత్థ పల్లవ గుళుచ్ఛ రింఛోళికా ఘణ ఘణాత్కారం
బులు చెలంగ, యుద్ధ క్రీడా సన్నద్ధంబులై వచ్చుచున్నయవి.
ఈ సజీవ ద్యూతంబు చూతము కాక! యనుచుఁ గౌతూహ
లంబున నిలిచియున్న యవసరంబున, వాహ్యాళి ప్రదేశంబునం
బందెగాండ్రు పందెంబు నొడివి తలపెట్టిన, 227

చ. ఉభయము ఠావ వీధి జయ మొందిన భంగి, భయం బొకింత లే
శభిముఖ మయ్యె, వె న్వెనుకకై యట కొన్ని పదంబు
లేఁగుచుఁ,
రభసముతో దువాళిగొని భ్రగ్గునఁ దాఁకెడుఁ బూడు పెట్టి టి
ట్టిభ! ఢిఃఢీ యనంగను గడింది నదభ్రము లీ యురభ్రముల్. 228

క. నిటలమ్ము లవిసి, నెత్తురు
సొట సొట వడియంగ, సమర శూరోత్తములై,
కటుకునను మెండు తగరులు
చటు లాటోపమున రెండు సరిఁబడఁ బోరెన్, 229

ఆ. వట్టివైదురు మోపు పైచిన చందాన,
గుండు గుండు మీఁదఁ గూలినట్లు,
కడిఁది మ్రోఁత మేష కంఠీరవంబులు,
తాఁకి తాఁకి డప్పి తట్టువాఱె. 230

వ. ఇట్లు తట్టువాఱి, ఘోట్టేశ్మ నాస్కందం బుడిగి, మంద నిశ్వాసో
చ్ఛ్వాసంబులై డిల్లపడి మూర్ఛిల్లిన, 231

సీ. హా! హా! నృపాల సింహాసనాధిష్ఠాన
రత్నకంబళ కాభిరామ రోమ!
మఝ్ఝా! కృపీట సంభవ మహా దిక్పాల
హేలా విహార వాహ్యాళి వాహ!
మాయురే! ప్రవిలంబమా *నాంద సంపాత
కుతు కానుధావిత క్రోష్టురాజ!

---

నంద (మూ. ప్ర)

యహహా! శ్రీ వీరభద్రావతార మహోగ్ర
నిహత దక్ష కబంధ విహిత వదన!

ఆ. భళిరే! మేంఠరాజ! బాపు! రుర భ్రేశ!
బొర! యేడకేంద్ర! యరరె! తగర!
మమ్మ! హం క్రియాభిమాన దరిద్రాణ!
మేలు మేలు! గొట్టె మిండగీఁడ! 232

వ. మీకు నీ గండంబులు దొలంగుం గాక! యనుచు నట చని, ముందటఁ గక్ష విలంబిత తామ్రచూడు లగు కోడి పందెగాండ్రఁ గనుఁగొని, యిదియును నొక్క సజీవ ద్యూతంబు, యీ దురోదర క్రీడా విహారంబు నాదరింపవలయుఁ, బానుగంటి కలకోడి తోడఁ బుట్టువులు వోని యీ జగజెట్టి కోడిపుంజులయందుఁ ప్రత్యేకంబు, 233

## కోడి పందెముల వర్ణనము

తే. 1పారిజాతపుఁ బూవు నాఁ బరగుఁ జూడు
తామ్రచూడంబు చూడా పథంబు జొత్తు,
దర్ప భరమున బ్రహ్మ రంధ్రంబు నడుమఁ
జించి వెడలిన క్రోధాగ్ని శిఖయుఁ బోలె. 234

వ. టిట్టిభ! యవలోకింపు, నారికేళ బక జాతీయంబులై యీ జగజెట్టి కోడిపుంజులు మెడలు నిక్కించుచు, తెక్క లల్లార్చుచుఁ, "గొక్కొక్కొ" యని కాల్ద్రివ్వి, క్రొవ్వు మిగిలి, తరళ తారకోద్వృత్త రక్తాంత లోచన మండలంబులై, యొండొంటిం గదిపి చులుచులఁ జూచి, యేచిన కోపాటోపంబునఁ గుప్పించి, యుప్పరం బెగసి, చర ణాంగుళీ కుటిల నఖ శిఖా కోటి కుట్టనంబులం జిరు దొగడు లెగయన్ వక్షస్ స్థలంబులు వ్రచ్చి వందరలాడియుం, ద్రోపియు లాపియు, నాసా పుటంబులం బుటబుటన నడు నెత్తిం జొత్తిలు నెత్తురు 2విట్టూఁ గలచియుఁ, గొల

1పారిజము పువ్వు చాయ నొప్పారెఁ జూడు (మూ.ప్ర) 2వట్టంగా (మూ.ప్ర

కొఱఁ గొఱుకు ముఖంబున గురుకు గురుకు మనుచు, న వ్యాప
పన్యంబుల నోహరిం బక్ష విక్షేపంబులం బడలువడ నడిచియు,
నొడిచియు. నడికి నడికిఁ దప్పించుకొని, నడి చప్పుడు గాక
యుండం గాళ్ళ క్రిందికిఁ దూరియుఁ జీరియు, మాటి మాటికి
"ఘాట ఘాట ఘాట" యని కృకాటం బుక్కఁ దండసంబులు
వోని ముక్కులం జెక్కులం జిక్కగా నొక్కి, యిట్ట ట్టనక
బిట్టూని పట్టి, గాలంపుఁ గొంకుల భంగి వంక లగు కొంకి
కత్తులం గడుపు లొడిచికొని, చించి చెండాడి, కొండొకపేషు
వాలి సుగ్రీవుల విధంబున, వింవానువిందుల చందంబున,
మురారి చాణూరుల ప్రకారంబున, నేకాంగ యుద్ధంబు చేసి,
చారణ గంధర్వ గరుడ విద్యాధర శ్లాఘనీయంబుగా నమోఘ
పరాక్రమంబు నలిపి, వీర వ్రతం బేపార, వాహ్యాళీ మండలం
బునం దమకుఁ దార పాయగిలఁ బడి, పోటు గంట్ల రొప్పు
రుధిరంబులం దొప్పఁదోఁగి, మూర్ఛాంధకారంబున మునుంగు
చున్నయవి; 235

సీ. హా! కుమారస్వామి యౌపవాహ్యములార!
హా! మంత్ర దేవతా స్వాములార
హా! కాల విజ్ఞాన పాక కోవిదులార!
హా! భూత భుక్తి కుంభాష్ఠులార!
హా! యహల్యా జార యభన హేతువులార!
హా! బలాత్కార కామాంధులార!
హా! నిరంకుశ మహాహంకార నిధులార!
హా! కామ విజయ కాహళములార!

తే. హా! ఖగేంద్రంబులార! కయ్యమున నీల్గి
పోవుచున్నారె దేవతా భువనమునకు?

1. వట్టింగా (మూ. ప్ర)

మీరు రంభా తిలో త్తమా మేన కాది
భోగ కార్యార్థమై కోడిపుంజులార! 236

వ. అని యట పోవుచు, నా దక్షిణంబున పైఁడి కుండల మొగసాల తోడిది,మాధవశర్మ కూఁతురు మధుమావతీదేవి మందిరంబు. 237

మహి నుదయించిన గాంధర్వి మధుమావతి

తే. సింహళ ద్వీపమునఁ గాని, సృష్టిలోనఁ
బద్మినీ జాతి లే దను పలుకు కల్ల,
తెలుప మధుమావతీ దేవి దేవ కన్య,
పద్మినీ జాతి దోర్గంటి పట్టణమున. 238

చ. మలయజగంధి యైన మధుమావతి యూర్పుల కమ్మఁదావి చెం
గలువల సౌరభంబునకు గాదిలి చుట్టము, చక్రవాకు లం
గలకల నవ్వు దాని చనుకట్టు, తదీయ విశాల నేత్రముల్
తొలకరి క్రొమ్మెఱుంగు సయిదోడులు మిండలు గండు
మీఁకున్.

మధుమావతి తొలి మలి జన్మ రహస్యము

ఉ. టిట్టిభసెట్టిగారు! వినుఁ డీ యొక చొక్కపు జోగి రేయి రో
వట్టిడి దీనితోఁ గలపి, భైరవ తంత్రము దీర్చి, మెచ్చి, సౌ
ధాట్టమునన్ లిఖించె నఖ రాక్షర భంగిఁ దెనుంగుఁ బద్యమున్,
బుట్టువు పేరనాగతము భోగము భాగ్యముఁ బ్రస్ఫుటంబుగన్.

క. ఈ తలిరుంబోఁడికిఁ గల
భూత భవ ద్భావి కాలముల జన్మములున్,
జాతులు ప్రస్ఫుటములుగా
నాతఁడు లిఖియించెఁ బద్య మల్లదె కంటే! 241

సీ. అలకా పురంబున *నంగారవర్మఁ డన్
గంధర్వపతి కన్య కమలపాణి,

*నంగార వర్ధుఁడన్ (మూ. ప్ర.)

యా దివ్య గంధర్వి కప రావతారంబు
మధుమావ తోర్గంటి మండలమున,
[1]నా సుందరాంగి దక్షారామమునఁ బుట్టు
భువనమోహని చిన్నిపోతి యనఁగ,
నప్సరస్ స్త్రీ జాతి యా సానికూఁతురు
చిరకాలమున సదాశివుసఁ గూడి,

తే. పావనంబైన తమిలేటి పరిసరమున,
వేఁగి కురువాటికా దేశ విపిన భూమిఁ
[2]గోవులను పేరి చెంచుల కులమునందుఁ
గడిమి కత్తులయమ్మి నాఁ గలుగఁగలదు. 242

ఆ కడిమి కత్తులమ్మి నిడు వాలుఁ గన్నులు
గండుమీల [3]నడుము మిండగీఁడః
దాని చన్ను దోయి ధారా సురత్రాణ
కటక కుంభి కుంభ కలహకారి. 243

మదాలస వృత్తాంతము

వ. ఈ మధుమావతీ దేవి చెలియలు మదాలస. మా మామ మిసాలప్ప య్య ద్వివేదుల కొడుకు శ్రీధరునకు ననుపు లంజయై యుండు; నా కంజాక్షిం దగిలి యా రంజకుం డచ్చోటనే యున్నవాఁ డవి విన్నార మరయుదము గాక! యనుచు మోసాలం జొచ్చి కత్యంత రమ్యంబు గడచి, గాజు టోవరి ముందటఁ, గట కంబళంబులమీఁదఁ దమలోఁ జిటపోట వోపుచుం గూడియుం గూడక యున్న యప్ప చెలియండ్రను, మామ యాత్మజుని జూచి, గోవిందుండు మంద స్మితంబునఁ బటు ... (గ్రంథపాతము) 244

తే. అహి వెట్టితి జొన్నగ ద్దాగ్రహార
వృత్తి యేనూఱు రూకల వృత్తమునకు,

---

1ఆ మధుమావతి దాక్షారామమునఁ బుట్టు (?) (మూ. ప్ర.)
2గోవిలను పేరి (మూ. ప్ర) 3ననుపు మిండగీల (మూ. ప్ర)

ననుభవింపుఁడు నీవు మదాలసయును,
వరయ సంసార మింతయు నధ్రువంబు. 245

తే. మిన్న కున్నార లిది యేమి మీరు సుగురు?
పిఁగకును బోక వెట్టిన యట్టి భంగి,
హెచ్చు కుం దింతమాత్ర మేదేని గలదె?
మిగులఁ గోపంబు మీకు లేమియును దోఁచె. 246

వ. అనిన మధుమావతి గోవింద పంచనశర్మతో నిట్లనియె: 247

సీ. ఏమి చెప్పుదుము' మా కీవు తోఁబుట్టగ
వైననుం జెప్పక యణఁపరాదు,
వీడు వియ్యంకుండు నిర్భాగ్యుఁ డీకంఠ
యీ పోయినట్టి రే యేకతమున
మా మదాలస కేళిమందిరాంతరమున
హంసతూలిక పాన్పునందు నొంటి
నిద్రించి యుండంగ, నీవి బంధం బూడ్చి
యటు చేయవలసిన యట్టు చేసె,

తే. మధు మదారంభమున మేను మఱచి యపుడు
మోసపోయితి [1]మీ నాఁడు ముట్టఁ దెలియఁ
జెలియలికి నాకు గొడ్డేఱు కలఁక పుట్టె
బ్రాహ్మణుఁడె వీఁడు? విశ్వాసపాతకుండు. 248

క. నడు రేయి మధు మదంబున
నొడ లెఱుఁగక యున్న నన్ను నోవరిలోనఁ
దడవెను, గుడిలో నుండియు
[2]గుడి తాళ్ళను దీసె వీఁడు గోకఁ దరయన్. 249

1. మీ వాఁడు (మూ. ప్ర.) 2 గుడి త్రాళ్ళను గోసె (మ్రూ. ప్ర.)

వ. పాడి పంతంబు లెఱిఁగిన పెద్దవు నీవు. మా భాగ్య కృతంబున విచ్చేసితివి. అజ్ఞాన కృతంబునకుం బ్రాయశ్చిత్తంబు విధింపు మని మఱియును, 250

శా. హాలా పాన మదాతిరేకమునఁ బర్యంకంబుపై నొంటి ని
ద్రాలస్యంబున నుంట దక్క, మరి యే యన్యాయముఁ జేయ నే,
నేలా పాపము గల్గె? నీ భయము వో నే ముట్టెదన్ శుద్ధికై
వాలాయంబును మీనకేతనుని దివ్య శ్రీ పదాంభోజముల్. 251

మంచనశర్మ బోధించిన విట ధర్మ సూక్ష్మము

వ. అనిన, గోవిందుఁడు మీరు విట జన ధర్మ సూక్ష్మం బెఱుంగరు. ఇది యన్యాయంబు గాదు. వేశ్యా జనంబునకు వావి వరుస యెక్కడిది? తొల్లి నముచిసూదనునకు నను పు లంజయై యూర్వశి యతని కొడుకుఁ గవ్వడిం గామింపదే? రావణుండు నలకూబరుని రంభోరు నంభోరుహాక్షి రంభం గోడలిని సంభోగింపక సాగ నిచ్చెనే? వారకాంతను దల్లి, దాపి, యప్ప, చెలియలు, కూతురు, దాది యని [1]కేళికా గేహంబునం బరిహరింపుట విట ధర్మంబు గాదు. 252

ఆ. జాణతనము గల్గి, [2]సవరతనము గల్గి,
తెలివి గల్గి, మోర తీపు గల్గి,
చే యలంతి తపకుఁ జే కూడినప్పుడు,
వావి వలదు లంజవారి యింట. 253

వ. అని పటికి సౌముఖ్యంబు సంపాదించి, 254

చ. వడినెయు, లంజెయున్, విటుఁడు, వైరము లాతల నుజ్జగింపుఁ, ద
భ్యుదయ పరంపరా [3]వివిధ భోగము లందుఁడు, మేము వోయివ

1 గణికా (మూ. ప్ర) 2 సరసతయును (మూ. ప్ర.) 3. విభవ (మూ)

చ్చెద మని, వారి సత్కృతులు చేకొని, మంచనశర్మ వెళ్లెఁ, ద
త్పదన మపార భాగ్య ధన సంపద కెంతయుఁ జోద్య
మందుచున్. 255

చ. కొడుకులు కూఁతులుం గలిగి, కూడును బాడియుఁ బ్రవిశ్రీతండమై,
విడిముడి లాఁతుగా గలిగి, వెండియుఁ బైఁడియు నిండ్లలోపలఁ
దడఁబడఁ, దారు బంధువులుఁ దామరతంపరలై సుఖించువా
రుడిపతిమౌళి మౌళి నౌక యుమ్మెత పూ *విడువారు వేడుకన్. 256

సాయంకాల వర్ణనము

వ. అనుచు మధుమావతీదేవి భవనంబు వెలువడి, కట్టాయితం బైన
ఘటకాసి పుంగవుండును, నింగి చెఱంగు మొన ప్రాలిన పతంగ
బింబంబుం గనుగొని టిట్టిభ యిదె చూడు. వరుణరాజ వారాంగనా
విలాస దర్పణానుకారియై యహర్పతి గ్రుంకం బోయె, నింక
మనకు నే వంకం దడయఁ బని లేదు. కుహూళీ చషకంబుల నారి
కేళంపు మధువుం గ్రోలి మత్తిల్లి వీరెదె మంది రోద్యాన వీథులం
బల్లవాధరలు పుష్పగంధికా నృత్యంబులు పరిభవించెదరు. వారు
కొందఱు మందిర ప్రాంగణంబున వారాంగనా జనంబులు
విచిత్ర శ్లోకంబు లనేక రాగంబులం గూర్చి, లాస్యాగం బుత్తమం
బుగాఁ జూపెదరు. మఱియు నంత రాంతరంబులం బ్రచ్ఛేదన
సైంధవ ద్విమూఢక స్థిత పాఠ్యాభిమార్గాభినయ భేదంబులు రస
భావ భావ నామోద మధురంబుగా శాతోదరు లభినయించెదరు. ఇ
వ్విధంబున వినోదంబు లిన్నియుం జూడం దలంచితిమేని, కామ
మంజరీ గృహ ప్రవేశంబునకుం గా ర్తాంతికుండు పెట్టిన ముహూ
ర్తంబు సరిగడచు ఇపుడు పుష్య నక్షత్రంబున నాల్గవ పాదంబు
నడచుచున్నయది. కాలావర్త విష నాడికా స్పర్శనంబు లేక
యమృత ద్వంద్వంబు గూడి, యిందుబింబాన నాధరోష్ఠ పల్లవా

*విడివారు టిట్టిభా (మూ. ప్ర.

మృత పారణ లాభంబునకుం గారణంబుఁ గలిగియున్నయది. ఇ వ్వేశవాటంబు వీథీ విటంకం బతిక్రమించి, వేవేగం జనవలయు. ఇదె యాఁటది యొక సురపొన్న క్రింద క్రీడాభరంబునఁ గన్నియలం గూడి, కందుక క్రీడ యొనర్చుచున్నయది, దీని నలవోక వోలె నైనం జూడవలయు నని మాడం జని, 257

## బాలల బంగరు బంతుల యాట

శా. పంచారించిన లేఁత చన్నులపయిం బ్రాలంబముల్ గ్రాలఁగాఁ,
గాంచీనూపుర కంకణ క్వణనముల్ [1]గర్జింప, బాలా జనుల్
కించి న్న్యాంచ [2]దుదంచిత క్షమముగాఁ గ్రీడించెదర్ చూడు మా!
చంచ త్కాంచన కందుక త్రయములన్ సవ్యాపసవ్యంబులన్.

## నట్టువుని కోడలితో మంచన చతురోక్తి

వ. అనుచుం గతిపయ పదంబు లరుగఁ, గట్టెదుర నొక నట్టువుని కోడలు, గోడలు నిక్కి చూడఁ బొడగని, య మ్మచ్చెకంటి మున్ను త న్నెఱింగినది యగుట టిట్టిభున కెఱింగించి, గోవింద మంచనశర్మ యిట్లనియె: 259

క. వ్రాలె నరవింద లోచన
పాలిండులు చూడఁ జూడఁ బ్రస వాంత్యమున,
న్నేలా యీ మాటల పని?
వ్రాలుట చోద్యంబె చక్రవాకుల కొదమల్? 260

వ. అనుచుం జనునప్పుడు ముందట నొక సైరికునిం గని, టిట్టిభునకుం జూపి యిట్లనియె: 261

1. గ్రాలంగ; 2దుదంచితంబునను సం క్రీడించె దర్పుండు (మూ. ప్ర)

### చలిని సరకుగొనని సైరికుఁడు

తే. మాఘ మాసంబు పులి వలె మలయుచుండఁ
బవ్వడం బమ్మ కొన్నాఁడు 1పసరమునకు,
ముదిత చన్నులు పొగ లేని ముర్మురములు
చలికి నొఱగొయ కే లందు సైరికుండు? 262

### అక్కలవాడలోని టక్కులాడులు

ఉ. దిక్కరి కుంభకూటముల దీకొను చన్నులు, కాము తేరిపై
టెక్కెపు గండు మీల నను 2డాల్కొనుకన్నులు, క్రొమ్మెఱుంగుతో
3నుక్కివమాడు మేని పస, యొల్లకుఁ గల్గెనె? యోరుఁగంటియం
దక్కలవాడలోని వెలయాండ్రకుఁ దక్కఁ, గిరాట టిట్టిభా! 263

వ. అనుచు నటచని, వేశవాటంబు వెడలి, భైరవాలయ ద్వారంబునఁ
బాడి పంతంబునం గూడిన వార విట లోకంబుం గనుంగొని,
యేమి ధర్మాసనంబుఁ దీర్చెదరొకో? యని యడిగిన, 264

### జార ధర్మాసనమున విషయ చర్చ

సీ. మును తన కూఁతు దీముగఁ జూపి రోవట్టు
పరదేశి విటునిచేఁ బణము గొనియు,
నసుపు పల్లవుని నన్నకుసన్న రప్పించి,
యతని శయ్యకుఁ దార్చి యనిపిపుచ్చి,
కై సేసి, తన యింటి దాపి నా విప్రున
కాతిథ్య మొనరింప ననుమతించె,
*దాని నా ద్విజుఁడు ప్రాతఃకాలమునఁ జూచి,
బెదద వెట్టిన యప్డు బెదరదయ్యె,

1. పణములకును, 2. డాల్పగు కన్నులు (మూ. ప్ర)
3. మక్కిన యూరు కాంతియును నొండ్లకు (,,)
*తద్ద్విజుం డా తొత్తుఁ బ్రాతఃకాలమునఁ జూచి(?) (మూ. ప్ర)

తే. పిళ్ళ కోపంబుతో నిల్లు వెళ్ళివచ్చి,
తలవరుల కీ ప్రసంగ మంతయును జెప్ప,
వారు రప్పింప వచ్చె నీ వదరు జఱభి
లంజెతల్లియె యాఁడియు గుల్లాము గాక! 265

వ. అనిన న జ్జఱభి భయంబు నొంది, సభాసదులకు దండ ప్రణామంబు సేసి, యా ద్రవిళు నుద్దేశించి 266

శా. నీకుం జేసిన బాస యెట్టిదియొ తుండీర ద్విజ శ్రేష్ఠ! మా
రాకాచంద్ర నిభాస్య, కాకతి మహారాజేఁ బుత్తెంచినం
గైకో దెబ్బలు, నేమి సేయుదును? శృంగారంపు లేఁదోఁటలోఁ
బైకొం గెత్తి, కుచంబు లొత్తి, పరిరంభం బీను లేఁ గ్రోవిన్. 267

వ. మమ్ము నూరక రట్టు చేయుట ధర్మంబు గా దనుచున్న యా దూర్త జఱభిం జూచి, య వ్విటలోకంబు "ప్రౌఢ నొక్క నిమిత్తంబున భంగపెట్టుట యుక్తం" బని "నీవు విట ధర్మం బెఱింగినవాఁడ వానతీయవలయు" ననిన గోవిందుండు, 268

## మంచనశర్మ న్యాయ నిర్ణయము

క. కందర్ప శాస్త్ర వేదులు
నిందుకు షాణ్మాస చింత యేలా నెఱపన్?
సందేహింపక గొఱిగిం
పం దగు నీ జఱభి జుట్టుపట్టి రయమునన్. 269

తే. ముక్కు సోణంబు దాఁకను జెక్కు టొకటి,
బోపి నోరుగఁ బం డ్లూడఁ బొడుచు టొకటి,
గూబ లంటంగఁ జెవి వోయి గోయు టొకటి,
లంజెతల్లి యొనర్చు కల్లలకు శిక్ష. 270

వ. మాకుం దోఁచిన ధర్మంబుఁ జెప్పితిమి. యథాపరాధంబుగా నీ యధమ జాతిని దండింపుఁడు, మఱియు నొక్క విన్నపంబు. 271

మ. స్మర దివ్యాగమ కోవిదుల్, మదన శిక్షా తంత్ర విద్యా విదుల్,
సురతారంభ మహాధ్వర ప్రవణు, లిచ్చో నుండు వేశ్యా వరుల్
తిరమై నాకు ననుజ్ఞ యిం డిపుడు (*తాత్త్వికమై యొప్పు న)
ప్పురుషార్థంబు నెఱుంగఁ బోయెదఁ బునర్భూ భామినీవాటికిన్. 272

## సంధ్యాకాలమున ఆర్యవాటి ప్రవేశము

వ. అనంతరంబ, భాస్వంతుండు వరుణరాజ శుద్ధాంత కాంతా నివాస మాణిక్య దర్పణంబె, చరమ గిరి కటక కాననంబు మాటునం జాటువడియెఁ, గాశ్మీర పరాగ చ్ఛటా భాసురంబైన సంధ్యా రాగంబు నింగి యింగిలీకంబునం బెట్టె, క్రీడోద్ధూత ధూర్జటి జటా జూట వల్లీ మతల్లికా మల్లికా కోరక కాకారంబులై తారకంబులు వియత్తలంబునఁ దళ తళ వెలింగె, విభావరీ పురంధ్రీ కర్ణపూర చాంపేయ కుసుమ సాదృశ్య సౌభాగ్య సంపత్సంపాదన లంపటంబులై భువన ప్రదేశంబులు ప్రకాశించె, నెఱ సంజయు మసమసకని చీకట్లునుం గలసి దిక్సౌధ కూట వాటీ నికురుంబంబుల వ్రేలవిడిచిన కురువింద పూసల పేరునుం బోలె పొలుపు మిగిలె, నప్పుడు గోవిందశర్మ గోధూళి లగ్నంబున నార్యవాటికఁ బ్రవేశించి, కామమంజరీ చౌర్య రతి విహార సంకేత స్థలంబులైన రథ్యా ముఖ శివ చత్వర ప్రపా మంటపంబులు విలోకించుచుఁ, గులటా ఫాల తిలకంబులకుం గుంటెన కత్తియ లగు కొత్తెమ జంగమ బోడితలకుం గ్రేఁగంటి చూపు సన్నఁ దన రాక యెఱింగింపుచు, నవ్వేశకుం జూపి గూఢ వివిక్తంబునుం, బూర్వ పరిచితంబునుం, బురుష శూన్యంబును, వివాహ కాలోచితవృత్తస్తన భార వివిధ విలాస విప్రవాస కన్యా సనాథంబును, విశ్రామ స్థలంబును, నైన యొక్క తమ్మడిసాని మందిరంబున విడిసి, తన రాక దేవయాత్రా వ్యాజంబున నప్పూజరి విధవచేత నెఱిం

* ఈ కుండలిత భాగము మూ. ప్ర. లోఁ గానరాదు.

గింపం బంచి, వీరభద్రేశ్వర స్థానంబు వెనుక బొడ్డనబావి యందుఁ గృత సంధ్యా వందనుండై నిజాంతర్గతంబున, 273

ఉ. కంగటికాలు పుచ్చుకొని ఖంగనఁ గాలు కిరీట కూటమున్
లొంగఁ గొనంగ లేరు, రవి నోరుఁ దటాలనఁ దన్నలేరు, క
న్నింగల మూని దర్పకుని నేర్చఁగ లేరు, లలాట పట్ట కో
త్సంగము చేరునే యహహ! తక్కటి వేల్పులకై మ
దంజలుల్. 274

వ. అనుచు శివార్చనంబు దీర్చి, సుఖాసీనుండై టిట్టిభునితో నిట్లనియె: 275

మ. వద నాంభోరుహ పూర్ణిక్రియా పవన నిర్వాణ ప్రదీపంబు
.... .... .... .... .... .... .... .... .... .... .... .... .... .... .... .... 276

మంచనశర్మ కామమంజరిని తలంచి వలవంతల పాలగుట

చ. పొదలిన చీకువాల నడు ప్రొద్దున, యౌవన గర్వ విక్రియా
మదమున, వింజ మా కిడిన మాడ్కిఁ బురంబు జనంబు నిద్దురం
గదిరినవేళ, నా యెదకుఁ గామిని రా నలవాటు సేఁతకై
.... .... .... నిమిలి తాక్షియై. 277

ఉ దట్టపు నీలి చేల గడితంబుగఁ గచ్చ బిగించి, ద్రిండుగాఁ
గట్టి, కటారి కోల కర కంజమునం ధరియించి, గుబ్బ చ
న్కట్టునఁ దోఁపుటంగి తొడి, గ్రక్కున నన్నడురేయి వచ్చి, నా
కట్టెమరం జొహారు లనుఁ, గాంత భటుం డయు
నవ్వుటాలకున్. 278

వ. అనుచుం బెక్కు ప్రకారంబుల నా కాముకుండు పూర్వ వృత్తాంతంబు కట్టనుంగుఁ జెలికాఁడైన కిరాట టిట్టిభ సెట్టితో నుబ్బున నుగ్గడింపుచుఁ, గామమంజరీ సందర్శ నోత్కంఠాతి సంకులం

బైన చిత్తంబు మన్మథాయత్తంబై యుండఁ, గొండంత యాశతో ధార్మిక ధర్మపతి యెప్పుడు వచ్చునో యని యువ్విళ్లూరుచుం దృణంబు చలించినం, జీమ చిటుకన్నను, జెవి ప్రాలం బెట్టి యాలించుచు, భామినీ విశోక నోత్సవం బాసన్నం బగుటం జేసి.... .... .... .... ....

.... .... దీపంబునుం బోలెఁ బరితాపంబు వహించుచుండ,నంతఁ జంద్రుండు పురందర హరి ద్దరీ కుహర గర్భాంతరాళంబున నుండి కంఠీరవంబునుం బోలె మింటికి లంఘించి, మయూఖ నఖరంబులం దిమిర కుంభి కుంభంబులు వ్రచ్చి వందఱలాడి, నభః క్రోడంబు ననుడు గణంబు లను ముత్తియంబుల వెదఁజల్లె, నా వేళ నిండు వెన్నెల కాయఁ, బ్రాణనాయకుండు వచ్చుటఁ గని, విని, పరమ హర్షోత్కర్షంబున. 279

తే. వీరభద్రేశ్వ రార్చనా విధి నెపమున

.... .... .... .... 280

## కామమంజరీ సమాగమము

మ. కర పద్మంబునఁ బైఁడి పళ్లెరమునం గంధాక్షతల్ పచ్చక
వ్పురముల వీడెము గొంచుఁ, గ్రొత్త మడుఁగుం బొన్పట్టు నీరంగితో
మురిపెం బొప్పఁగ వచ్చెఁ, జౌర్య రత సంభోగార్థమై కామమం
జరి గోవిందుని యొద్దకుల, శివ నమస్కార చ్ఛలం బొప్పఁగన్. 281

క. మోదంబున రాకా చం
ద్రోదయ దేవతయుఁ బోలె నొయ్యనఁ జని, శా
తోదరి గోవిందుని శ్రీ
పాదంబుల కెఱఁగె భక్తి భయ లజ్జలతోన్. 282

ఉ. మచ్చికయున్, బ్రమోదమును మన్ననయున్, నయమున్, విలాసమున్,
మెచ్చను, నేర్పడం దనకు మేయిడి మ్రొక్కిన కామమంజరిన్
గ్రుచ్చియుఁ గౌఁగిలించె, సరి గుబ్బ చనుంగవ రెండు క్రేవలన్
బచ్చని వింటి జోదు పయిపైఁ బులకంబుల నారు వోయఁగన్ 283

వ. అనంతరం బాస నాసీనులైన, న గ్గోవిందుండు కామమంజరిం జూచి, 284

మ. అరవిందాస్య! తలంచి చూడ నిది యత్యాశ్చర్యమో కాని, నీ
సర సాలాపము లాదరించి వినఁగా సంభావనం జూడఁగన్,
ఖర పాకంబయి కర్ణ రంధ్రముల కంగారంబుగా, బిట్టు ని
ష్ఠురముల్ పల్కెడు రాజ కీరములు గండుం గోయిలల్ వీణియల్.

టిట్టిభసెట్టికి తమ్మడిసాని తోడి సాంగత్యము

వ. అని జార దంపతులు పూజరివారి యింటి ముంగిట, వెన్నెల బైట నుండి, టిట్టిభునకుం గట్టాణి ముత్తియంబునుం బోని తమ్మడి [1]సానిం గూర్చు నేర్పు విచారించి, సన్నపు టెలుంగునం బూజరి సానిం బిలిచి, కనక నిష్కంబుతోడఁ గూడఁ గర్పూరంబు వీడియం బ చ్చేడియ చేతిలోనం బెట్టి, యాపాద మస్తకంబు వీక్షించి, శిరః కంపంబుసేసి, 286

సీ. బంగారు తలుపులు పాయంగ ధట్టించి
లావణ్య విత్త మేలా వ్రయించె?
లావణ్య విత్త మేలా వ్రయించును గాక!
యతిమాత్ర మేలా వ్రయాసపడియె?

---

1. సానితూటుం.

నతిమాత్ర మాయాన మనుభవించుము గాక!
విట జనంబుల నేల వెడ్డుకొలిపె,
విటజనంబుల కారవేరంబు సేయఁగా
నేల నిర్మింపఁడో యెనయు మగని?

తే. సొమ్ము పోక, మహా ప్రయాసమ్ము రాక,
ప్రజల బాధ, నిరర్థ కారంభణంబు
ళెలమి సిద్ధింప నేమిగాఁ దలఁచె నొక్కొ
పరసిజాసనుఁ డీ తలోదరి సృజించి? 287

చ. దొరసెమునందుఁ జుట్టుకొని తోరకణక్కట్టె నురో విభాగమున్,
నిరుదు పయోజకోశ రమణీయతఁ దాల్చెను, వర్తమాన వ
త్సరమున నొప్పె హేమ కలశంబుల బాగున, ముంద ఉటికిం
గరిసిభయాన చన్నుఁ గవ కౌఁగిలిపట్టులు గాక యుండునే? 288

గీ. సన్న చూపుఁ బూజరిపానిఁ బిలిచి,
పసిఁడి టంకంబు పరిరంభ పణముసేసి,
టిట్టిభునితోడ నేఁడు కూడింపు కూఁతు
నేక శయ్యా సహాయ శ్రీకై రమింప. 289

క. కన్నెటి* ము[illegible] చేతే
సొన్నాటంకములు రెండు, చుట్టంబులలోఁ
గన్ను మొఱంగెకు నేర్పును
విన్నాణము మాకుఁ గలదు పెఱ పేమిటికిన్? 290

వ. అని యనుమతింపం జెప్పి, బొమలమీఁద వెంద్రుకలు వ్రాలు
పూజరిసాని బిడ్డను వెడ్డుపెట్టి, టిట్టిభునిచేతి కిచ్చి, యచ్చ వెన్నెలలం

* ముడుపు.

బొరపొచ్చెంబు లేని మచ్చికల......చంద్ర మండలంబుమీఁద
దృష్టినిలిపి, టిట్టిభుండు విన నిట్లనియె: 291

చంద్రునకు జార దంపతుల సమర్చ

సీ. కలశ పాథోరాశి గారాపు నందన!
కల్యాణములు మాకుఁ గలుగఁజేయు,
కుసుమ కోదండుని కూరిమి మామ! సౌ
ఖ్యాభ్యుదయంబు మా కాచరింపు,
రాకా విభావరీ రమణీ మనోహర!
సంతోషములు మాకు నవదరింపు,
శౌరి పట్టపుదేవి కూరిమి నయిదోడ!
యైశ్వర్యములు మాకు నాచరింపు,
తే. మనుచు గొజ్జంగి నీరను నర్ఘ్య మిచ్చి,
పచ్చకప్పుర మందంద బడసివైచి,
మ్రొక్కి రనురాగ సంపద మూరిఁబోవ
జార జాయాపతులు నిందు చందురునకు. 292

ఉపసంహారోక్తి (భరత వాక్యము)

క. నటులది దోరసముద్రము,
విటులది యోరుగల్లు, కవిది వినుకొండ, మహా
పుటభేదన మీ త్రితయము,
నిటఁ గూర్చెను బ్రహ్మ రసికు లెల్లను మెచ్చన్. 293

చ. ముదమున ముల్కినాటి పుర మోహన శైల సువర్ణ కందరా
పదనుఁడు, కాలభైరవుఁడు, శంభుని పట్టి సమగ్ర వైభవా

భ్యుదయ పరంపరా విభవముల్ గృపసేయుఁ, గవీంద్ర కాంక్షిత
త్రిదశ మహీరుహంబునకుఁ, దిప్పయ వల్లభరాయ మంత్రికిన్. 294

వ. అని యందఱును యథాసుఖంబుగ నిజస్థానంబుల కరిగి, సుఖి
యించుచుండిరి. 295

## ఆశ్వాసాంత గద్యము

ఇది శ్రీమన్మహామంత్రిశేఖర వినుకొండ తిప్పయామాత్యనందన
చందమాంబాగర్భపుణ్యోదయ సుకవిజనవిధేయ
వల్లభరాయ ప్రణీతంబైన క్రీడాభిరామంబను
వీథి నాటకంబున సర్వంబు
నేకాశ్వాసము.

సంపూర్ణము

# అనుబంధము

శ్రీనాథుని వీథి నాటక మను పేర చాటు పద్య సంకలన గ్రంథ మొండు బహుళ ప్రచారములో నున్నది. ఇది కేవల మొక ముక్తక గ్రంథము. ఇందు పాత్రములు, కథ, వీథీ లక్షణము - ఇత్యాదులు మృగ్యములు. ఇంచలి రెండు మూఁడు పద్యములు మాత్ర మెట్లో ప్రచారములో నుండు వల్లభరాయని క్రీడాభిరామమునఁ జోటు సంపా దించుకొన్నవి. ఈ యుభయ వీథీ గ్రంథముల విభిన్న రచనా విధానము, తీరుతీయములు చదువరుల యవగాహన సౌలభ్యమునకై క్రీడాభిరామమునకు అనుబంధముగా ఈ శ్రీనాథుని 'వీథిని'ని గూడఁ బొందుపఱచి యున్నారము. దీనికి సహాయపడిన గ్రంథములు :

1. శ్రీనాథుని వీథి నాటక మను శృంగార పద్యములు,
వంకాయల కృష్ణస్వామిశెట్టిగారి
శ్రీరంగవిలాస ముద్రాక్షర శాలయందు
ముద్రితము; చెన్నపురి, (1908).

2. వీథినాటకము - శృంగార పద్యములు,
వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
చెన్నపురి; (1924),

3. అప్పకవీయము,
వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
చెన్నపురి; (1934).

4. సర్వలక్షణసారసంగ్రహము,
కూచిమంచి తిమ్మకవి ప్రణీతము,

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి,
హైదరాబాదు-4; (1971).

5. చాటు పద్యమణిమంజరి,
శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారిచే సంపాదితము,
వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
చెన్నపురి; (1949).

6. శ్రీనాథ కవితా సమీక్ష,
రచయిత :
శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు
పాపులర్ ప్రెస్,
కాకినాడ; (వికారి, మకర సంక్రాంతి).

7. చాటుపద్యములు,
బ్రౌను దొరచే సంపాదితమైన వ్రాతప్రతి(డి.నం.2884 )
మదరాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత గ్రంథాలయము,
మదరాసు.

శ్రీ

## శ్రీనాథుని వీథి నాటక మను శృంగార పద్యములు

సీ. దీనార టంకాల తీర్థ మాడించితి
దక్షిణాధీశు ముత్యాల శాల,
1వాక్కు తోడై తాంధ్ర భాషా మహా కావ్య
నైషధ గ్రంథ సందర్భమునకు,
పగులఁగొట్టించి తుద్భట వివాద ప్రౌఢి
2గాఢ డిండిమ భట్టు కంచు ఢక్క,
చంద్రభూషక్రియాశక్తి రాయల యొద్ద
పాదుకొల్పితి సార్వభౌమ 3బిరుదు,
తే. నెటుల మెప్పించెదో నన్ను నింక మీఁద
రావు 4సింగన భూపాలు ధీ విశాలు
నిందు కొలువున నెలకొనియుండి నీవు,
సరస సద్గుణ నికురుంబ! శారదాంబ! 1

శా. అక్షయ్యం బగు సాంపరాయని తెలుం గాధీశ! కస్తూరికా
భిక్షా దానము సేయురా! సు కవిరాడ్ బృందారక శ్రేణికిన్,
ద్రాక్షారామ 5పురీ విహార వర గంధ ర్వాప్సరో భామినీ
వక్షోజ ద్వయ కుంభి కుంభములపై వాసించు న వ్వాసనల్. 2
శా. ధాటీ ఘోటక రత్న ఘట్టన మిళద్ధాత్రీ ఘృష్ట కల్యాణ ఘం
టా టంకార వితంత లుంఠిత మహోన్మత్తాహిత క్షోణిభృ
త్కోటీ రాంకిత కుంభినీధర సము త్కూటాటవీ యూట క
ర్ణాటాంధ్రాధిప! సాంపరాయని తెలుంగా! నీకు బ్రహ్మాయు వౌ! 3

---

1. పలుకు; 2. గౌడ; 3. బిరుద మెటుల;
4. సింగమహీపాలు; 5. చళుక్యభీమ;

ఉ. కందుక కేళి సల్పెడు ప్రకారమునం, 1బురుషాయిత క్రియా
తాండవ కేళి సల్పెడు విధంబున, 2వానరభాను లేఁత 3నీ
రెండ ప్రభాత వేళ రచియించెను 4గుబ్బలమీఁది హారముల్
కుండలముల్ కురుల్ గవల గోమయ పిండము లింటి
ముందటన్5. 4

చ. గురు 6కుచముల్, ప్రియోక్తులును, గ్రామ్యతియున్, నిట
లాలకంబులన్
మురిపెపు మాటలున్, నగవు, ముద్దు మొగంబును, గల్గఁ
గాని, యా
7సురతపు నేర్పు మాటలును, సూక్ష్మ విభీషణ భూషణంబులున్,
బరువడితో విభుం గవయు భావము పట్టదు విప్ర భామకున్. 5

చ. 8గురు కుచ యుగ్మ, మాననము, కోమలికంబులు, ముద్దు
మాటలన్
అలుపు, లతి ప్రసంగములు, నప్పట నప్పట మేలుమాట, లం
తరిత కళా నిధానములు, తాడన పీడన భూషణంబులన్,
బరువడి నొంప 9నేర్పు, ప్రియ భాషలు గల్గు నరేంద్ర
భామకున్. 6

చ. పురుషుఁడు గూడు వేళఁ బెడ బుద్దులు సుద్దులు, కాని చేఁతలున్,
పరగున మేని కంపు, చెడు చందపు రూపము, నేహ్య
వస్త్రముం,
బరగు నిరంతరంబు, నెడఁబాయని సౌఖ్యము, లేని ప్రేమయున్
విరహపుఁ జాడ్యు, లమ్మలిక పీసము, బుల్లలు వైశ్య
భామకున్. 7

1. ఘనపేషణ; 2. పామరభామ;
3. యూరెండ 4, మాటికిఁ గంఠ 5(చూ. కీడా. ప. 82)
6 తమమో; 7 సురుచిరమైన;
8 గురుతర సుందరాననము;9 నేర్పు;

మ. వర గంభీర *పయోధరంబులు, గు ణాభావ ప్రవీణత్వము,
న్నరవిందాస్య సుగంధ గంధ పటు వే ణ్యత్యంత సౌందర్య, ము
ద్ధుర తంత్రాణ వివేక సంపదయు, మాధు ర్యాది గాంభీర్యముం,
దరుణీ రత్నము. శూద్ర భామ గుణముల్ తథ్యంబె
వర్ణింపఁగన్? 8

సీ. హరి నీలముల కప్పు లణఁగించు నునుకొప్పు
విరి పువ్వు దండ దా వీఁకఁబారఁ,
గోటి చందురు డాలు గోటుసేయఁగఁ జాలు
మొగము కుంకుమ చుక్క సొగసు గులుక,
వల జక్కవల జక్కు లణఁగఁ ద్రొక్కఁగ నిక్కు
పాలిండ్ల పై నాచు పైట జాఱ,
నిసుక తిన్నెల మెట్టు పసిఁడి చెంపలఁ గొట్టు
పిఱుఁదుపై మొలనూలు బెళుకుదేరఁ,

తే. జిగురుఁ గెమ్మోవిఁ బగడంపు బిగియు మెఱయ
మాటలాడఁగఁ, గను దోయి తేట లమరఁ,
జెమట లూరంగ, సింహాద్రిఁ జేరవచ్చె
భోగ గుణ ధామ, యాంధ్ర నియోగి భామ. 9

క. బంగారు వంటి మేనును,
శృంగారము లొలుకు కుఱుచ, చిక్కని చన్నుల్,
బంగారపు నెఱ చీరలు,
చెంగటి చూపులు నియోగి చేడెల కొప్పున్. 10

శా. రాపాడం గల గుబ్బ చన్నుఁ గవతో, రాకేందు బింబంబుపైఁ
దూపేయుంగల ముద్దు నెమ్మొగముతోఁ, దోరంపు మై చాయతోఁ,
జూపున్ మద్దుల బాల సంఘములతో, సొంపారు లే నవ్వుతో
వేపార్యంగన వచ్చెఁ గాసె బిగితో, వేణీ భర చ్ఛాయతోన్. 11

* మనోరథంబులు;

సీ. విడిన కొప్పున జాజి విరు లొప్పుగా వ్రాలఁ,
జిట్టి కుంకుమ చుక్క బొట్టు చెదరఁ,
జక్కఁగా బటువారు సందెకు కుచ్చెళ్ళు
చెలఁగు మెట్టియలపైఁ జిందులాడఁ,
గోదమ గుబ్బలఁ బైట కొంగు చయ్యన జాఱ,
ముక్కున త్తొక వింత ముద్దుఁగులుక,
మొల గంట లిమ్మగు మ్రోతఁతో రంజిల్లఁ,
గనకంపు టందియల్ ఘల్లు రనఁగఁ,

తే. బొసఁగు 1కర్పూర వీడ్యముల్ పొందు పఱిచి,
యనుఁగుఁ జెలితో ముచ్చ టాడికొనుచు,
నలరు సింహాద్రిపై కెక్కి హర్షమునను
వచ్చెఁ, గలకంఠి వేసారి మచ్చెకంటి. 12

మ. కుసుమం బద్దిన చీర కొంగు వాలయం, గ్రొవ్వారు పాలిండ్లపైఁ
ద్రిసరంబుల్ పొలుపార, వేణి యవటూ దేశంబుపై రాయఁగాఁ
బస నెవ్వాఁడొ యొకండు రాత్రి 2రతులన్ బల్గాపి గావింపఁగా
3నసియా ల్వాడుమ వచ్చుచున్నయది కర్ణాటాంగనల్ గంటిరే.*13

ఉ. పీనపు ముక్కునత్తు, నర పీసపు మంగళసూత్ర, 4మెంతయున్
గాసుకు రాని కమ్మ, లరకాసును గానిది పచ్చ పూసలున్,
మాసిన చీర గట్టి, యవమాన మెసంగఁగ నేఁడు రాఁగ, నా
కాసలనాటివారి కనకాంగిని జూచితి నీళ్ళ రేవునన్. 14

సీ. ఒక చెంప కొరగా నొనఁగూర్చి దిద్దిన
తురుమునమంది క్రొవ్విరులు 5జాఱ,

---

1 కర్పూరంపు వీడెముల్;
2 సురత క్రీడం దక్కుం దన్పినన్ (సర్వలక్షణ)
3 వసివాళ్వాడుచును (అప్ప: సర్వం) *(చూ. క్రీడా. ప. 88)
4 మమ్మిలనన్ గాసుకు; 5 జాలః

రాత్రి యెవ్వాఁడొ బల్ రతుల గాసి యొనర్ప
   బడలిక నడుగులు తడఁబడంగ,
వింతవారలఁ జూచి వెస నవ్వినను కప్పు
   గల దంతముల కాంతి వెలికి *జాఱఁ,
జడిముడి నడచుటఁ జెలరేగి గుబ్బల
   పైఁ దాకి యొక్కింత పైట జాఱఁ,

తే. జెమటచేఁ దిరు నామంబు చెమ్మగిల్ల,
హాళి దా చేత విడియంబుఁ గిఱకొలిపి,
రంగపురి రాజవీథిఁ గానంగ నయ్యె,
నాదు మదిఁ గోర్కె లూర వైష్ణవ వధూటి. 15

క. రంభా స్తంభము లూరువు,
అంభోరుహ నిభము లక్షు లతను శరంబుల్,
జంభాసురారి మద గజ
కుంభము, లీ నంబివారి కోడలి కుచముల్, 16

సీ. మీఁగాళ్ళ జీరాడు మేలైన కుచ్చెళ్ళ
   తీరున మడి చీరఁ దీర్చి కట్టి,
బిగువు గుబ్బల మీఁద నిగనిగల్ దళుకొత్తు
   నోర పయ్యెద కొంగు జాఱవైచి,
వలపుల కొక వింత గలుగఁగా గొప్ప లౌ
   కురులు నున్నగ దువ్వి కొప్పు పెట్టి,
నెలవంక నామంబు వలలితంబుగ నుంచి
   తిరుచూర్ణ మా మీఁదఁ దీర్చుచేసి,

తే. యోర చూపుల విటులఁ దా మూరడించి,
గిల్కు మెట్టెల రవ రవల్ గుల్కరింపఁ

జికిలి చేసిన తామ్రమంష్(? ) జెంబుఁ బూని,
వీథి నేఁతెంచె సాతాని వెలఁది యొకతె. 17

క. పూజారివారి కోడలు
తా జాఱఁగ, బిందె జాఱి దబ్బునఁ బడియెన్,
మై జారు కొంగు తడిసిన,
బాజారే తిరిగి చూచి పక్కున నవ్వెన్. 18

ఉ. వాసన గల్గు మేను, నిడు వాలుఁ గనుంగవ, 1గబ్బి గుబ్బలున్,
గేసరి మధ్యమున్, మదన కేళికి నింపగు బాహుమూల వి
న్యాసముఁ గల్గినట్టి యెలనాఁగను, భోగముదానిఁ జేయ, కా
దాసరిదానిఁ జేసిన విధాతను నే మనవచ్చు నీశ్వరా? 19

ఉ. చీరయు, ముక్కు ముంగరయుఁ, జెంపల గంధము, చుక్క బొట్టు, మం
జీర ఝణంఝణా రవముఁ, జేతులఁ గంకణ నిక్వణంబు, నొ
య్యారపు జాఱుగొప్పును, గయాళితనంబును గాని, లోన శృం
గార మొకింత లే దనుటఁ గంటిని నీ పురి వార కాంతలన్. 20

ఉ. బంగరు లింగమూర్తి చను బంతుల మధ్య నటింపుచుండఁగాఁ,
జెంగులు జాఱ, మే ల్వలువ చీరయు వీడ, మ దీప్సితంబు లు
ప్పొంగఁగ, వామ హస్తమునఁ బొల్పగు నీవిని బట్టి, వేడ్కతోఁ
జంగున గోడ దాటు నగసాలె శిరోమణిఁ జూచితే సఖా? 21

ఉ. తల్లియుఁ గొండపల్లి నొక తామర గండికి నీళ్ళ కేఁగఁగాఁ;
దెల్లని చీర కొంగు నెగఁదీసుక నవ్వుచు నీళ్ళు ముంచగాఁ,
గొల్లల లింగకాయ 2చను గుబ్బల సందున నాట్య మాడఁగాఁ,
జలని మాటలాడు నగసాలె శిరోమణిఁ జూచితే సఖా? 22

1. నన్మృదూక్తులున్;
2. కడుగోమునఁ బయ్యెద.

క. అగసాలిది కాఁబోలును
సొగసైన మిటారి, యోర చూపులతోడన్
జగమెల్లను వలపించుచు
మగఁటిమితో వచ్చెఁ బురము మార్గము వెంటన్. 23

సీ. బొలుపొందఁగ విభూతి బొట్టు నెన్నొసలిపైఁ
దళుకొత్త చెమట కుత్తల పడంగ,
సొగసుగాఁ బూ దండ జోపిన కీ ల్గొప్పు
జాఱఁగా నొక చేత సరుదుకొనఁగ,
బిగి చన్నుఁ గవ మీఁద బిరుసు పయ్యెద చెంగు
దిగిజారి శివసూత్ర మగపడంగ,
ముక్కున హొరుముంజి ముత్యాల ముంగర
కమ్మ వాతెర మీఁద గంతు లిడఁగఁ,

తే. గొను జవ్వాద, మెట్టియల్ గదిపి మ్రోయఁ,
గమ్మవిలుకాని జాళువా బొమ్మ యనఁగ,
మెల్లమెల్లన సింహాద్రిమీఁది కేఁగెఁ
గన్నె పూఁబోడి, యగసాలి వన్నెలాడి. 24

ఉ వాలగు కన్ను దోయి, బిగి వ్రతుప గుబ్బలు, కాఱు చీఁకటిం
జాల హసించు కొప్పు జిగి, సారసమున్ నగు మోము గల్గు నా
బాలికఁ, గూలి కమ్మకొన బట్టలు నేసెడువాని కిచ్చె, హా!
సాలెత గాదురా! కుసుమ సాయకు పట్టపు దంత, యింతయే? 25

ఉ. కుమ్మరివారి బాలిక, చకోర విలోచన ముద్దుగుమ్మ, యా,
వమ్ము దరిన్ ర సామలిన వస్త్రము చుంగులు జాఱఁగట్టి, తాఁ
గమ్మని మ్రోఁతతోఁ, గర నఖమ్ముల భాండము లంగజాప్రపా
త మ్మనఁ ద్రోవఁ దీసె, విట తండము గుండియ లారవిచ్చఁగన్.

ఉ. ముంగురు లంటఁ జుట్టి, తన మోమున మోము నమర్చి,చీర ముం
గొంగు వదల్చి, మన్మథుని గోప్యపు గేహము చెమ్మగిల్లఁగా,

నంగజకేళిఁ బల్లవుల నార్పుటలం గరగింపనేర్చు పీ
జంగమువారి కాంత, రతి రాణ *ఖామణి, యెంచి చూడఁగన్. 27

సీ. తళుక్కు తళుక్కను కాంతి బెళుక్కు కెంపుల ముంగ
రందమై కెమ్మోవియందుఁ గుల్క,
ధగ ధగ ద్ధగఁ జేఁ దనరారు బంగారు
గొలుసు లింగపుఁగాయ కొమరుమిగుల,
నిగ నిగ న్నిగిలచే నెగడు కల్వపు గుబ్బ
పేరు మిన్నందున మెలఁగుచుండ,
రాజహంస విలాస రాజితం బగు యాన
మందు, పెట్టెలు రెండు సందడింప,

తే. సరస దృక్కుల విటులను గరఁగఁ జూచి,
పొంకెకై నట్టి మోమున భూతి రేఖ
రాజ కిళ లొప్ప. నడ్డంకి రాజవీథిఁ
బొలిచె నొక కొమ్మ, గాజుల మద్దుగుమ్మ. 28

ఉ. శ్రీకర భూషణంబులును పిబ్బెపు గుబ్బలు, ముద్దు చెక్కులున్,
గోకిలవంటి పల్కులును గొల్పఁ జేఁలఁ గేరు కన్నులున్,
ప్రాకట దేహ కాంతియును, బంగరు చాయకు హెచ్చువచ్చు పీ
చాకలివారి సుందరికి, సాటిగ రా దిఁకఁ బొంటి జవ్వనుల్. 29

సీ. మకరధ్వజుని కొంప యొక చెంత కనుపింపఁ
జీర కట్టినదయా చిగురుఁబోఁడి,
యుభయ *పక్షములందు నును దీర్ఘ తరము లౌ
నెరులు పెంచినదయా నీలవేణి,
పసుపు వాసన గ్రమ్మ పైట చేలము లెస్స
ముసుకుఁ బెట్టినదయా ముద్దుగుమ్మ,

---

*కక్షము

పూర్ణ చంద్రుని బోలు పొసఁగు సిందూరంపు
బొట్టు పెట్టినదయా పొలఁతి నుదుట,

తే. నెమ్మొ మిఱుంగ నిత్తడి సొమ్ము లలర,
నోర చూపులఁ గుల్క సింగార మొల్కఁ,
గల్కి యేతెంచె మరుని రాచిల్క యనఁగ
వలపులకుఁ జేవ, యొక యొడ్డె కుల వధూటి. 30

చ. విడిబడి నిట్ట వేగి, యట బిఱ్ఱున వ్రాలిన నంతలోనఁ, దా
వడిసెల చేతఁ బట్టుకొని, వట్రువ గుబ్బలఁ బైట జాఱఁగా,
నడుము వడంకఁగాఁ, బిఱుఁదు నాట్యము సేయఁగఁ, గొప్పు వీడఁగా,
దొర దొర యంచు నెక్కె నటు దొడ్డ మిటారపు రెడ్డి కూఁతురున్. 31

చ. తొలకరి మించుతీఁగె గతిఁ దోప దుకాణముమీఁద నున్న యా
యలికులవేణితోఁ దములపాకుల బేరము లాడఁబోయి నే
వలచుట కేమి! శంకరునివంటి మహాత్ముఁడు లింగ రూపమై
*కలికి మిటారి గుబ్బ చను గట్టుల సందున నాట్యమాడఁగన్. 32

క. నిబ్బరపుఁ గలికి చూపులు,
జబ్బించుక లేని పిఱుఁదు, సన్నపు నడుమున్,
మబ్బు కురు, లుబ్బు కుచములు,
బిబ్బిలకుఁ గాక కలవె పృథివీ స్థలిపై? 33

సీ. హరి నీలముల కప్పు లదలించు నును కొప్పు
చెంగావి ముసుకులోఁ జిందులాడఁ,
చక్రవాకముల మెచ్చని బలు సిబ్బెపు
బిగువు చందోయి పింపిళ్ళుకూయ,

* కులుకు మిటారి గబ్బి చనుగుబ్బల

ధవ ళాబ్జ రుచులు నాఁ దళుకు లీనెడు నవ్వు
  వెన్నెల నిగ్గుతో వియ్యమంద,
గొంతు కూర్చొని, రసికుల దర్శన స్పర్శ
  నంబుల మోహ ద్రవంబు జాఱ,

గీ. నెడమ కుడి హస్తముల సన్న లెసఁగ, విటుల
రమ్ము రమ్మని పిలుచు గారవము దోఁప,
నుర్వి మెఱయించు కాన్పాస పర్వతంబు
చేరి మర్దించె, నొక్క పింజారి తరుణి. 34

క. ఆ కదురునఁ బిక రవము,
న్నా కదురున భృంగ రవము, నాత్మ రవంబున్
ఏకీకృతముగ, నేకు ల
నేకులు విన, వడికె ముదిర, యే కులముదిరా? 35

ఉ. తెల్ల మడుంగు గట్టి, యరుదెంచెడు పాంథుల తెప్పలార్పఁగా
నొల్లక చూచుఁ గాని, మది నున్న విధంబు విలాస వైఖరిన్
దెల్లమిచేసి, గాఢ రతి నేలు నుపాయ మొసంగదయ్యె, నా
కల్లరి బొమ్మ యించుక విఘట్టన శూన్య పయోధ రాగ్ర జా
గ్ర ల్లసమాన తైక్ష్ణ్య లగు ద్రావిడ భామల కెంత వెట్టియో! 36

చ. విట కర పీడ నాది పరివేదన కోడి, శరీరజన్మ హృ
త్పుటమున వ్రాలి, శోషి-గను బోవఁగఁ బోవఁగ నాళిఁ గాంచి, య
చ్చటఁ బటు దీర్ఘ దండ హతిచేత విరోధ మటంచుఁ దెల్పినన్,
దటుకునఁ బోక నిల్చిన విధంబున నుండెఁ, గుచంబు లింతికిన్. 37

ఉ. వన్నెల గాగరా జిలుఁగు వస్త్రువ కుచ్చిళులందుఁ బాదముల్
సన్నపు వారి [1]భంగము లసంబున పీగెడు బాల కూర్మముల్
గన్న తెఱంగు దోపఁ, గర కంజములన్ ముసుకున్ బిగించి, ప్ర
చ్ఛన్న ముఖాబ్జయై నడచెఁ జంగున, బొందిలి భామ గోమునన్. 38

1. భంగముల సందున.

మ. విమ లాంభోరుహ పత్ర జైత్రములుగాఁ బెంపారు నేత్రమ్ములం
గమనీయం బగు కజ్జలం బునిచి, రేఖా సౌష్ఠవం బొప్ప, నా
గముతోఁ జేసిన సిందురంబు నుదుటం గాన్పింపఁ,
బయ్యంటయున్,
యమునా రైకయు దాఁటి, పూప చను లొయ్యారంబు
చూపన్, దుకా
ణముపై బొందిలి దోర్తు నిల్చె, ముఖ చంద్ర స్ఫూర్తి
శోభిల్లఁగన్. 39

శా. [1]పొచ్చెం బింతయు లేని [2]హంస నడతోఁ, బొల్పొందు
లే నవ్వుతోఁ,
బచ్చల్ దాపిన [3]గుల్కు ముంగరలతో, బాగైన [4]నెమ్మోవితో,
వచ్చఁబైన [5]ముసుఁగు వెట్టి, చెలితో నా మాటలే చెప్పుచున్,
వచ్చెం బో! కుచ కుంభముల్ గదలఁగా వామాక్షి తా సీక్మకున్. 40

శా. హంసీయానకుఁ గామికి న్నధమ రోమాళుల్ నభః పుష్పముల్,
సంసారద్రుమ మూల పల్లవ గుళుచ్ఛంబైన యచ్చోట, వి
ధ్వాంసుల్ రాజమహేంద్ర పట్టణమునన్ ధర్మాసనం బుండి, ప్ర
ధ్వంసాభావము ప్రాగభావ మనుచుం దర్కింతు
[6]రాత్రైవ్రిక్రమున్. 41

ఉ. హా జలజాక్షి హా కిసలయాధర! హా హరిమధ్య! హా శర
ద్రాజ నిభాస్య! హా సురత తంత్ర కళానిధి! యెందుఁ బోయితే?
రాజమహేంద్ర వీథిఁ గవిరాజు ననుం గికురించి, భర్గ కం
ఠా జిత కాలకూట ఘుటి కాంచిత మైన యమాన చీఁకటిన్. 42

చ. గొరియల, మేఁకపోతులను, గొఱ్ఱె పొఱేశ్ళను, కోడి పుంజులన్
బరిపరి వీథులం దిరిగి భక్షణఁ జేసెద వింతె కాని, నీ

1. పొచ్చెంబింతయు లేక హంస నడతో నొయ్యారముం జూపుచున్ (సర్వల); 2. యంచనడతో (?); 3. కిల్కు డెంపు నగతో 4. నెమ్మోముతో (సర్వల); 5 ముందుగు గట్టి (సర్వల). 6. రక్రాంతమున్

చరణము లంటి రాని, యల చాకలి పైదలి మర్మ జావళిన్
బిరిగొనలేవు, పీవు నొక భీకర మూర్తివె కాళికేశ్వరీ! 43

చ. గొరియలు, మేఁకపోతులను, గొమ్మపొదళ్ళను గావుగొందు నీ
వరయఁగ, సందెకాడఁ దగ వత్తు నటంచు బిడ చ్చిరంబుపైఁ
గర మిడి పోయినట్టి తిలఘాతుకురాలి తదీయ కష్టముల్
పెఱుకఁగలేవు, [1]నీవుఁ గడు భీకరమూర్తివె కాళికేశ్వరీ? 44

శ్రీనాథుఁ డొక ప్రథమ రజస్వలా గృహమునకుఁ బోయి
భోజన సమయమందుఁ జెప్పిన పద్యము

ఉ. దుష్పరివార శూన్య గతితో, మెఱుఁగై, నర సోది తోల్లన
త్పుష్పశరాసన క్రియకుఁ బొల్పెసలారి మనోహరంబు నౌ
పుష్ప సుగంధ్యనంగ గృహ పుణ్యమునన్ భుజియింపఁ గల్గె, వా
స్తోష్పతి కెప్పి యున్న నరి తూగనవే యొక శోభనంబుతోన్? 45

గీ. [2]కాల కంధర! యీశాన! గరళ కంఠ!
విసము మెసవిన గలుగు న క్కసబు వోవఁ
గొమ్మ మేడూరి కమ్మ చకోరనేత్ర
[3]పనిగొనఁగ రాదె యల యొంటి పనస తొలను. 46

క. ముది విటులు, విధవ లంజలు,
పద కవితలు, మారు బాన బాపనవారల్,
చదువని పండితవర్యులు,
[4]కద నార్భట వీర వరులు కడిది పురమునన్. 47

శా. కల్లా [5]యెత్తితిఁ, గోకఁ జుట్టితి, మహా కూర్పాసముం దొడ్గితిన్,
వెల్లుల్లిన్ దిలపిష్టమునఁ [6]విఃకితిఁ, విశ్వస్త వడ్డింపఁగా,

1. నీవు నొక; 2 కాలకంధర! యీశాన! ఫాలనేత్ర!
నీదు విష మారగించిన చేదు పోవ; 3 పనస తొన వంటి భగము
చుంబనముసేయు 4, కదనాస్థిర. 5యియుంచితి, 6 మెసవితిన్

చల్లా యంబలిఁ ద్రాగితిన్, రుచుల దోసం బంచుఁ బోనాడితిన్,
దల్లీ! కన్నడ రాజ్యలక్ష్మి! దయలేదా? నేను శ్రీనాథుఁడన్. 48

సీ. బొమ వింటఁ దొడిగిన పూ విల్లు దొర ముల్కి
వోల్కి కస్తురి సోగ బొట్టు దిద్ది,
చకచక లీను తారకల తళ్కులు వోలెఁ
గొలుకులు వెడలఁ గజ్జలము దీర్చి,
పొదుపు గుబ్బలి మీఁదఁ బొడము నీరెండ నా,
రంగు చందురు కావి రైక దొడిగి,
పిఱుఁదు పొక్కిలి యను మెరక పల్లము గప్పఁ
బాల వెల్లువ మించు చేలఁ గట్టి,

గీ. యంచ కొదమల గమి బెదరించు లాగు
నందె చప్పుళ్ళ ఘల్లు ఘల్లనుచు మొరయ,
నడుము జవజవ లాడ, కీల్జడ చలింప,
వచ్చె ముక్కంటి సేవకు మచ్చెకంటి. 49

చ. పరసుఁడు గాఁడొ? జాణ; రతి సంపద లేదొ? సమృద్ధి; రూపమో?
మరుని జయించు; మోహ? మసమానమె; యిన్నియుఁ గల్గి జారవై
తిరిగెద వేల బాల' యని దీరవు, ప్రౌఢవు నీ వెఱుంగవే?
నెర గృహమేధి యన్ పలుకు నీచము దోఁచెఁ, గొఱంతదే సుమీ! 50

మ. అరవిందాననః యెందుఁ బోయెదవు? మత్ప్రాణేశు ప్రాసాద మం
దిర దేశంబునకో లతాంగి! బహు శాంధీభూత మార్గంబునన్
దిరుగ న్నీ కిది లొంటి గాదె? శుక వాణీ! మాట లింకేటికిన్,
మరుఁ డాకర్ణ ధనుర్గుణాకలితుఁడై మా వెంట రా, నొంటియే? 51

ఉ. శ్రీమ దనత్య మధ్యకును, జిన్ని వయారికి, ముద్దులాడికిన్,
సామజ యానకున్, మిగులఁ జక్కని యింతికి మేలు గావలెన్.
మే మిట క్షేమ మిపరకు, మీ శుభ వార్తలు వ్రాసి పంపుమీ!
నా మది నీదు మోహము క్షణంబును దీరదు స్నేహ బాంధవీ! 52

ఉ. మొన్నటి రేయి నా కలను మోహము లొల్కఁగ వచ్చి, యంతలో
నన్నపు వల్వ దీసి, బిగి చన్ను లురమ్మున నొక్కుచు న్నచే
కన్నులు విప్పి చూచి, నినుఁ గానక, హా! యని చింత నొందితిన్,
దిన్నగ వచ్చి నా వలపు దీర్చి కూడవె ప్రాణ నాయికా! 53

ఉ. కామిని! యేమె! నీ వయసు కావరమా? మొగమెత్తి చూడవే!
ప్రేమను ముద్దుగుమ్మ! యని పిల్చినఁ బల్కవి దేటి గర్వమే?
కోమల మైన నీ కులుకు గుబ్బలమీఁదట నున్న యట్టి నా
ప్రేమ మరుం దెఱుంగు నిఁక వే యన నేరను ప్రాణనాయికా! 54

శా. పచ్చల్ దాపిన తార హారములతోఁ బాలిండ్లు గన్పించి, నే
మెచ్చన్ బైఁబడి కౌఁగి లియ్య, విరి యేమే? మేటి పంతంబుతో
వచ్చెం జూడవె పచ్చవిల్ దొర యదే, ప్రాణంబు రక్షింపవే!
కుచ్చె ళ్ళొప్పఁగ నూడఁ దియ్యనియవే! కొమ్మా! జగ న్మోహినీ!

ఉ. కన్నులు చల్లఁగా నిను సుఖంబున నెన్నఁడు చూతునో చెలీ!
యిన్నిటి కేలనే! మనల యిద్దఱి వాంఛలు దీర, హాయిగాఁ
జిన్ని కుచంబు లానుచును, జెక్కిలి నొక్కుచు, ముద్దు లాడఁగా
నెన్నటి కబ్బునో? మన యదృష్టము స్పష్టము సేయరాదటే? 56

శ్రీనాథుని వీథి నాటకము

సమా పము

## శ్రీనాథుని చాటు పద్యములు

సీ. వలుతెలుంగుల రంగు వద్మరాగల వీణె
చక చక ప్రభల సాక్షాత్కరింప,
సొంపుతో రవ చెక్కడంపు ముంగర చాయ
పవడంపు మోవిపైఁ బరిఢవిల్ల,
విరిపి యోసరిలి క్రిక్కిఱిపిన ఎను దోయి
బిగువున నెఱ రైక పిక్కటిల్ల,
నొసపరి యొయ్యారి ముసుఁగులో నెఱి వేణి
కొమరాలి మూఁపున గుసిపియాడ,

తే. విరుల తావియు, నెమ్మేని వెనుక కచ్చ,
ఫెళ ఫెళక్కను చిఱుఁ దొడల్, బెళుకు నడుము,
వలుఁద పిఱుఁదులు, కలికి చూపుల బెడంగు,
లొలయఁ గన్గొంటి, వేపారి కలువకంటి. 57

క. అద్దిర కులుకులు బెళుకులు!
నిద్దంపు మెఱుంగుఁ దొడల నీటులు గంతే?
దిద్దుకొని యేల వచ్చును,
ముద్దియ యీ నంబి పడుచు ముచ్చట దీఱగా. 58

చ. వడిసెల చేతఁ బట్టుకొని, వావిరి చక్కని పైఁట జాఱఁగా,
వడుము వడంకఁగాఁ, బిఱుఁదు నాట్యము సేయఁగఁ, గొప్పవీడఁగా,
దుడదుడ మంచె యెక్కె నొక దొడ్డ మిటారపుఁ గమ్మ కూఁతురుగా,
దొడదొడ మంచ మెక్కె నొక దొడ్డ మిటారపు రెడ్డి కూఁతురున్

ఉ. అంగడివీథిఁ బల్లవుల కానగ మామిడిపండు లమ్ముచుఁగా
జంగమువారి చిన్నది పిసాళితనంబునఁ జూచెఁ జో! నిశా
తాంగజ బాణ కైరవ పి తాంబుజ మత్త చకోర బాల సా
రంగ తటిన్ని కాయముల రంతులు వేసెడు వాఁడి చూపులన్. 60

సీ. బాలేందు రేఖ సంపద మించి విలపిల్లు
నొసటి తళ్కు_ల నీటు నూఱు సేయు,
భ్రమరికా హరి పిల చమర వాలముఁ బోల్
వేణీ భరము చాయ వేయి సేయు,
దర్పణ ద్విజరాజ ధాళధళ్య ప్రక
లపన బింబ స్ఫూర్తి లక్ష సేయుఁ,
గోట హాటక శైల కుంభి కుంభారాతి
కుచ కుంభ యుగళంబు కోటి సేయు,

తే. జఘన సీమకు విలువ లెంచంగ వశమె?
దీని సౌందర్య మహిమంబు దేవుఁ డెఱుఁగుః
నహహ యె బ్బంగి సాటి సేయంగ వచ్చు?
భావజుని కొల్వు, జంగము భామ చెల్వు. 81

క. సర్వజ్ఞ నామధేయము,
శర్వునకే, రావు సింగ జనపాలునకే,
యుర్విం జెల్లును, ద క్కొ_రు
సర్వజ్ఞుం డనుట, కుక్క_ సామజ మనుటే! 82

సీ. కవిరాజు కంఠంబుఁ గౌఁగిలించెను గదా
పుర వీథి నెదురెండ పొగడ దండ!
యాంధ్ర నైషధ కర్త యంఘ్రి యుగ్మంబునఁ
దగిలియుండెను గదా నిగళ యుగము!
వీరభద్రారెడ్డి విద్వాంసు ముంజేత
వియ్య మందెను గదా వెదురు గొడియ!
సార్వభౌముని భుజా స్తంభ మెక్కె_ను గదా
నగరి వాకిట నుండు నల్ల గుండు!

తే. కృష్ణవేణమ్మ గొనిపోయె నింత పలము,
బిలబిలాక్షులు తినిపోయెఁ దిలలుఁ బెసలు,

బొడ్డుపల్లెను గొడ్డేటి మోసపోతి,
నెల్లు చెల్లింతుఁ దంకంబు లేదు నూర్లు? 63

సీ. కాశికా విశ్వేశుఁ గలిసె వీరా రెడ్డి,
రత్నాంబరంబు లే రాయఁ డిచ్చు?
రంభఁ గూడెఁ దెనుంగు రాయ రాహుత్తుండు,
కస్తూరి కే రాజుఁ బ్రస్తుతింతు?
స్వర్గస్థుఁ డయ్యె విస్సన మంత్రి, మఱి హేమ
పాత్రాన్న మెవ్వని పంక్తిఁ గలదు?
1కైలాస గిరిఁ బండె మైలార విభుఁ డేగి,
దినవెచ్చ మే రాజు దీర్పఁగలఁడు?

తే. భాస్కరుఁడు మున్నె దేవుని పాలి కరిగెఁ,
గలి యుగంబున నిఁక నుండఁ గష్ట మనుచు,
దివిజ కవివరు గుండియల్ దిగ్గు రనఁగ,
నరుగుచున్నాఁడు శ్రీనాథుఁ డమర పురికి. 64

సీ. తాటంక యుగ ధగ ద్ధగిత కాంతి చ్ఛటల్
చెక్కుటద్దములపై జీరవార,
నిట లేందు హరి నీల కుటిల కుంతలములు
వన్నారి మోముపైఁ జిందులాడ,
బంధుర మౌక్తిక ప్రకట హారావళుల్
గుబ్బ పాలిండ్లపై గునిసియాడఁ,
గర కంకణ క్వణ క్వణ నిక్వణంబులు
పలుమాఱు రాతిపైఁ బరిఢవిల్ల,
తే. నోర చూపుల విట చిత్త మూఁగులాడ,
2బాహు కుశలతఁ జక్కని మోహనాంగి

1. కైలాసమునఁ బంట మైలారవిభుఁ డుండె
దినవెచ్చ మెవ్వఁడు దీర్పఁగలఁడు? (సర్వల)
2బాహుమూల చ్ఛవిన్ వెల్గు మోహనాంగి

పాటఁ బాడుచుఁ గూర్చుండి; రోటిమీఁదఁ
బిండి రుబ్బంగఁ గన్నులపండు వయ్యె. 65

సీ. జగ దొబ్బ గండాంక! సంగ్రామ నిశ్శంక!
జగతీశ రాయ వేశ్యా భుజంగ!
అఖిల కోటల గొంగ! యరి రాయ మద భంగ!
మేలందు ధరణీశ మీన జాల!
మూరు రాయర గండ! మురియు రాజుల మిండ!
యభివృద్ధి మీఱు చౌహత్త మల్ల!
గోవాళ ఘన గాయ! కామినీ పాంచాల!
బ్రహ్మయు శశి వంశ పరశురామ!

తే. దండి బిరుదుల సురతాణి గుండె దిగుల!
బళిర యల్లయ వేముని పగఱ మిండ!
రమణ మించిన మేదిని రాజు బిరుద
వంగ రాటోప! మాదయ లింగ భూప! 66

సీ. రాజనందన రాజరా జాత్మజులు సాటి
తలఁప నల్లయ వేమ ధరణిపతికి,
రాజనందన రాజ రా జాత్మజులు సాటి
తలఁప నల్లయ వేమ ధరణి పతికి,
రాజనందన రాజ రాజాత్మజులు సాటి
తలఁప నల్లయవేమ ధరణిపతికి,
రాజనందన రాజరాజాత్మజులు సాటి
తలఁప నల్లయవేమ ధరణిపతికి

తే. భావ భవ భోగ సత్కళా భావములను,
భావ భవ భోగ సత్కళా భావములను,
భావ భవ భోగ సత్కళా భావములను,
భావ భవ భోగ సత్కళా భావములను. 67

ఉ. వీర రసాతిరేక! రణ విక్రమ! వేమ నరేంద్ర! నీ యశం
బారభమాన తార కర హార విలాసము, నీ భుజా మహం
బారభమాన తార కర హార విలాసము, నీ పరాక్రమం
బారభమాన తార కర హార విలాసము, చిత్ర మారయన్. 68

క. రసికుఁడు పోవఁడు పల్నా,
డెసఁగంగా రంభ యైన నేకులె వడుకున్,
వసుధేశుఁ డైన దున్నును,
గుసుమాస్త్రుండైన జొన్న కూడే కుడుచున్. 69

ఉ. ఫుల్ల సరోజ నేత్ర! యల పూతన చన్నుల చేఁదు ద్రావి, నాఁ
డల్ల దవాగ్ని మ్రింగితి నటంచును నిక్కెద వేల? తింత్రిణీ
పల్లవ యుక్తమౌ నుడుకు బచ్చలి శాకము, జొన్న కూటితో
మెల్లన యొక్క ముద్ద దిగమ్రింగుమ! నీ పస కాన నయ్యెడిన్.

మ. కవితల్ సెప్పినఁ, బాడ నేర్చిన, వృథా కష్టంబె, యీ బోగపుం
జవరాండ్రే కద భాగ్యశాలినులు? పుంస్త్వం బేల పో పోఁచకా?
నవరంగా సొగ పిచ్చి, మేల్ యువతి వేషం బిచ్చి పుట్టింతువే,
నెవరున్ మెచ్చి ధనంబు లిచ్చెదరు గాదే పాపపుం దైవమా? 71

సీ. సొగసు కీల్జడదాన! సోఁగ కను లదాన!
వజ్రాల వంటి ప ల్వరుసదాన!
బంగారు జిగిదాన! బటువు గుబ్బలదాన!
నయమైన యొయ్యారి నడలదాన!
తోరంపుఁ గటిదాన! తొడల నిగ్గులదాన!
పిడికిట నడఁగు నెన్నడుముదాన!
తళుకుఁ జెక్కులదాన! బెళుకు ముక్కరదాన!
సింగాణి కను బొమ చెలువుదాన!

తే. మేలిమి పసింది రవ కడియాలదాన,
మించి పోనేల రత్నాల మించుదాన!
తిరిగిమాడవె ముత్యాల సరులదాన!
చేరి మాటాడు చెంగావి చీరదాన! 72

మ. వనజాతాంబకుఁ డేయు సాయకముల న్వారింపఁగా రాదు, నూ
తన బాల్యాధిక యౌవనంబు మదికిన్ ధైర్యంబు రానీదు, ది
ట్లనురక్తిన్ మిముఁబోంట్లకు న్దెలుప నాహా. సిగ్గు మైకోదు, పా
వన వంశంబు స్వతంత్ర మీయదు సఖీ వాంఛ ల్తుద ల్ముట్టునే?

ఉ. అంగడి యూర లేదు, వరి యన్నము లేదు, శుచిత్వ మేమి లే
దంగన లింపు లేరు, ప్రియమైన వనంబులు లేవు, నీటికై
భంగపడంగఁ బాల్పడు, కృపాపరు లెవ్వరు లేరు, దాత లె
న్నంగను సున్న, గానఁ బలనాటికి మాటికిఁ బోవ నేటికిన్? 74

ఆ. ఊరు వ్యాఘ్ర నగర, మురగఁబు కరణంబు,
కాఁపు కపివరుండు కసవు నేఁడు,
గుంపు గాఁగ నిపట గురజాల సీమలో
నోగు లెల్లఁ గూడి రొక్క చోట. 75

క. కుంకుమ లేదో? మృగమద
పంకము లేదో? పటీర పాంసువు లేదో?
సంకుమదము లేదో? యశు
భంకర మగు భస్మ మేల బాలా! నీకున్? 76

సీ. ఖండేందు మౌళిపైఁ, గలహంస పాళిపైఁ,
గర్పూర ధూళిపైఁ, గాలుద్రవ్వు;
మిన్నేటి తెఱలపై మించు తామరలపై,
మహి మంచు నురులపై మల్లరించు,

జంభారి గజముపైఁ, జం'దికా రజముపైఁ,
జందన ధ్వజముపైఁ జౌకళించు;
ముత్యాల సరులపై, మొల్ల క్రొవ్విరులపై,
ముది కల్ప తరువుపై మోహరించు;

తే. వెండిమల యెక్కి, శేషాహి వెన్నుదన్ని,
తొడరి దుగ్ధాబ్ధి తరఁగలతోడ నడరి,
నెఱతనం బాడి నీ కీర్తి నిండె నహహ!
విజయ రఘురామ! యల్లాడ విభుని వేమ! 77

క. గరళము మ్రింగితి ననుచుం
బురహర! గర్వింపఁ బోకు, పో పో పో! నీ
బిరు దింకఁ గానవచ్చెడి,
మెఱసెడి రేనాఁటి జొన్న మెతుకులు తినుమీ! 78

క. గిట గిట నగు నెన్నడుములు,
పుట పుట నగు గన్నుఁ గవలు, పున్నమ నెలతోఁ
జిట పొట లాడెడు మొగములు,
కటి తటముల కొమరు, శబర కాంతల కమరున్. 79

క. గుడిమీఁది క్రోతితోడను,
గుడిలోపలి నంబివారి కోడలితోడన్,
నడివీథి లంజతోడను,
నడిగొప్పుల హోరు గాలి నడిగితి వనుమీ! 80

ఉ. గుబ్బలగుమ్మ, లేఁ జిగురుఁ గొమ్మ. సువర్ణపుఁ గీలుబొమ్మ, బల్
గబ్బి మిటారి చూపులది, కాఁపుది, దానికి వేల యొక్కనిన్
బెబ్బులి నంటఁ గట్టితివి? పెద్దవు నిన్ననరాదు గాని, దా
తబ్బ! పయోజగర్భ! మగనాలికి నింత విలాస మేఁటికిన్? 81

ఉ. గొంగడి, మేలుపచ్చడము, కుంపటి, నల్లులు, కుక్కిమంచముల్,
జెంగట వాయుతైలము లజీర్ణపు మందులు, నుల్లిపాయలున్,
ముంగిట వంటకట్టియలు మోపులు, దోమలు, చీపోతులున్
రంగ! వివేకికి మసరరాజ్యము కాంపుర మెంత రోతరా! 82

ఉ. గోష్పద రూపమై, మిగుల కోమలమై, గణుతింపరానిదై,
కష్ట విహీనమై, మనుపు చాలఁగఁ గల్గి, ద్రవం బపారమై,
పుష్పిణియైన నీ భగము పుణ్యమునన్ భుజియింపఁ గల్గె, వా
క్ప్రోష్పతి కైన నో ద్రవిడ సుందరి! నిన్ను వచింప శక్యమే? 83

ఉ. గ్రామము చేత నుండి, పరికల్పిత ధాన్యము నింట నుండి, శ్రీ
రామ కటాక్ష వీక్షణ పరంపరచేఁ గడతేఱెఁ గాక, మా
రామయమంత్రి భోజన పరాక్రమ మేమని చెప్పవచ్చు, నా
స్వామి యెఱుంగుఁ దక్కఁబల చాతురి తాళ ఫల ప్రమాణమున్.

ఆ. చిన్న చిన్న రాళ్లు, చిల్లర దేవళ్ళు,
నాగులేటి నీళ్ళు, నాపరాళ్ళు,
సజ్జ జొన్న కూళ్ళు, సర్పంబులును, దేళ్ళు,
పల్లెనాఁటి సీమ పల్లెటూళ్ళు. 85

మ. జననాథోత్తమ! దేవరాయ నృపతీ! చక్రేశ! శ్రీవత్సలాం
ఛన సంకాశ! మహాప్రభావ! హరి! రక్షా దక్ష! నాబోంట్లకిన్
గున్నప స్తోత్ర సముద్భవం బయిన వా గ్దోషంబు శాంతంబుగాఁ
గనక స్నానము చేసి గాక, పొగడంగా శక్యమే దేవరన్? 86

క. జొన్న కలి, జొన్న యంబలి,
జొ న్నన్నము, జొన్న పిసరు, జొన్నలు తప్పన్
స న్నన్నము, సున్న సుమీ!
పన్నుగఁ బలినాటిసీమ ప్రజ లందఱకున్. 87

శా. జోటీ! భారతి! యార్చటి న్మెఱయుమీ! చోద్యంబుగా నేను గ
ర్ణాటాధీశ్వరుఁ బ్రౌఢదేవ నృపతిన్, నాసీర ధాటీ చమూ
కోటీ ఘోటక ధట్టికా ఖుర పుటీ కుట్టాక సంఘట్టన
స్ఫోటీ ధూత ధరా రజ శ్ఛటికి శాంభోటిన్ బ్రశంసించెదన్. 88

సీ. డంబు సూపి ధరాతలంబుపైఁ దిరుగాడు
కవిమీఁదఁ గాని నా కవచ మేయ,
దుష్ప్రయోగంబుల దొరకొని చెప్పెడు
కవి శిరస్సునఁ గాని కాలు చాప,
చదివి చెప్పఁగ నేర్చి సభయందు విలపిల్లు
కవి నోరు గాని వ్రక్కలుగఁ దన్న,
సంగీత సాహిత్య సరస విద్యల నేర్చు
కవుల రొమ్ములఁ గాని కాల్చి విడువ,

తే. దంట కవులకు బలువైన యింటి మగఁడఁ,
గవుల వాదంబు విన వేడ్క గలిగె నేని
నన్నుఁ బిలిపింపు మాస్థాన సన్నిధికిని,
లక్షణోపేంద్ర! ప్రౌఢ రాయ క్షితీంద్ర! 89

ఉ. తక్కక, రావు పింగ వసుధావరుఁ దర్థుల కర్థ మిచ్చుచో,
దిక్కుల లేని కర్ణుని, దధీచిని, ఖేచరు, వేల్పు మ్రాకుఁ, బెం
పెక్కిన కామధేనువు, శిబీంద్రుని నెన్నెదు బట్టు! దిట్టవై,
కుక్కవా? నక్కవో? ఫణివా? క్రోఁతివాఁ పిల్లివా?
బూత పిల్లివో? 90

క. తేలా కాయెను బోనము,
పాలాయెను మంచి నీళ్ళు, పడియుండుటకున్
నేలా కలవాయె, నిసీ!
కాలిన గురిజాల నిష్ట కామేశ! శివా! 91

సీ. దండయాత్రా ఘోష తమ్మట ధ్వనులచే
గంతులు వేయించెఁ గప్పకొండ,
కితవ కా లాభీల కీలానలముచేత
నేల పొం గడఁగించెఁ బాలకొండ,
అరట్టజా ధట్ట హయ ధట్టములచేత
మట్టి తూర్పెత్తించెఁ బొట్టునూరు,
భూరి ప్రతాపాగ్నిఁ బుటములు పెట్టించె
విద్వేషులను గళా (కాళ) వెండి పురము,

తే. అనఁగ నుతి కెక్కితౌర! కేళాదిరాయ!
అరుల పండువ మండువా యవన హరణ!
బళియ ధూళియ మాళువ బందికార!
విజయ రఘురామ! అల్లాడ విభుని వేమ! 92

శా. దాయాదుల్వలె గుబ్బ చన్ను లొఱయన్, ధావళ్య నేత్రాంబుజ
చ్ఛాయ ల్తాండవ మాడఁ గేరి, పురుష స్వాంతమ్ముల న్మన్మథుం
దేయం, జంగమువారి చంద్రముఖి విశ్వే శార్చనా వేళలన్
వాయించెం గిరిగిండ్లు, బాహు కుళల వ్యాపార పారీణతన్. 93

ఉ. దోసెడు కొంపలోఁ బసుల త్రొక్కిడి, మంచము, దూడ రేణముల్,
బాసిన వంటకంబు, పసిబాలుర శౌచము, విస్తరాకులున్,
మాసిన గుడ్డలున్, దలకు మాసిన ముండలు, వంట కుండలున్,
రాసెఁడు కట్టెలున్ దలఁపరాదు పురోహితు నింటి కృత్యముల్.94

సీ. పంపా విరూపాక్ష బహు జటా జూటి కా
రగ్వధ ప్రసవ సౌరభ్యములకు,
తుంగభద్రా సముత్తుంగ వీచీ ఘటా
గంభీర ఘుమ ఘు మారంభములకు,
కళసాపుర ప్రాంత కదళీ వనాంతర
ద్రాక్షా లతా ఫల స్తబకములకు,

కర్ణాట కామినీ కర్ణ హాటక రత్న
తాటంక యుగ ధాళధళ్యములకు,

తే. నిర్ని బంధ నిబంధమై నెనయు కవిత
తెలుఁగునను, సంస్కృతంబునఁ బలుక నేర్తు,
ప్రౌఢ దేవేంద్ర రాయ భూపాలవరుని
సమ్ముఖంబున దయ చూడు ముమ్మ సుకవి! 95

చ. పస గల ముద్దు మోవి, బిగి వ్రటువ గుబ్బలు, మందహాసమున్,
నొసట విభూతి రేఖయుఁ, బసుపగున తావి, మిటారి చూపులున్,
రసికులు 'మేలు! మేలు! బళిరా! యని మెచ్చఁగ, రావవీటిలోఁ
బసిఁడి సలాక వంటి యొక బల్జె వధూటిని గంటి వేడుకన్.

ఉ. పువ్వులు కొప్పునం దుఱిమి, ముందుగఁ గొ
నసియాడుచుండఁగాఁ,
జెవ్వనఁ జంగ సాఁచి, యొక చేతను రోఁకలిఁ బూని,
యొయ్యనన్
నవ్వు మొగంబుతోడఁ దన నందనుఁ బాడుచు, నాథుఁ జూచుచున్,
"సువ్వియ సువ్వి" యంచు నొక సుందరి బియ్యము
దంచె ముంగిటన్. 97

ఆ. మంద రాద్రి సములు మానవు లందఱు,
చందమామ కూన లిందు ముఖులు,
కందు లేని మౌక్తికంబులు జొన్నలు,
కుందనంపు బెడ్డ, కుందుగడ్డ. 98

ఉ. వంకర పాగలున్, నడుము వంగిన కత్తులు, మైల కోకలున్,
వంకటి ముద్దలున్, జనుప శాకములున్, బులు పచ్చడంబులున్,
దెంకగు నోరచూపులును, దేఁకువ దప్పిన యేస బాసలున్,
రంకుల బ్రహ్మ యీ మసర రాజ్యము నెట్లు సృజించెనో కదా! 99

ఉ. వీరులు దివ్య లింగములు; విష్ణువు చెన్నుఁడు; కల్లిపోతురా
జారయఁ గాలభైరవుఁడు, సంకమ శక్తియ యన్నపూర్ణయున్;
గేరెడి గంగ ధార, మడుఁగే మణికర్ణికగాఁ జెలంగు నీ
కారెమపూఁడి పట్టణము కాశి గదా పలినాటివారికిన్! 100

సీ. శ్రీరస్తు, భవ దంఘ్రి చికురంబులకు మహో
    భూ ర్యబ్దములు పి తాఁభోజ నయన!
వర కాంతి రస్తు, తావక నఖ ముఖముల
    కాచంద్ర తారకం బబ్జ వదన!
మహి మాస్తు, నీ కటి మధ్యంబులకు మన్ను
    మిన్ను గలన్నాళ్ళు మించుబోఁడి!
విజయోఽస్తు, నీ గాన వీక్షల కానీల
    కంఠ హరిస్థాయిగా లతాంగి!

తే. కుశల మస్తు, లస చ్ఛాతకుంభ కుంభ
జంభభి త్కుంభి కుం భాభిజృంభమాణ
భూరి భవదీయ వక్షోజములకు మేరు
మందరము లుండు పర్యంత మిందు వదన! 101

మ. శ్రుతి శాస్త్ర స్మృతు లభ్యసించుకొని విప్రుం డంత నానాధ్వర
వ్రతుఁడై పోయి కనున్, బురందర పురారామ ద్రుమానల్ప క
ల్పతరు ప్రాంత లతా కుడుంగ సుఖ సుప్త ప్రాప్త రంభా భగ
ప్రతి రోమాంచకర పాటన క్రమ కళా పాండిత్య శౌండీర్యమున్.

సీ. సప్తమాదియ రాయ చంద్ర బింబాననా
    చికుర వల్లరులపైఁ జిన్ని పువ్వు,
ఝూడె జంతుర్నాటి జననాథ శుద్ధాంత
    కుచ కుంభములమీఁది కుంకుమంబు,
బారుహద్దోంతి భూపాల లీలావతీ
    గండ స్థలంబులఁ గలికి నవ్వు,

కలువ పల్ల్యోడ్డాది కటకాధిపతి వధూ
సీమంత వీథులఁ జేరుచుక్క,
తే. యల్లడాధీశు వేమ క్షమాధినాథు
ఘోరి నిష్ఠుర ధాటీ విహార చటుల
సైన్య నాసీర తుక్ఖార శఫ పుటోత్థ
వింధ్య పార్శ్వ వసుంధరా విపుల ధూళి. 103

క. సిరి గలవానికిఁ జెల్లును
దరుణులఁ బదియాఱు వేలఁ దగఁ బెండ్లాడన్,
దిరిపెమున కిద్ద ఱాండ్రా?
పరమేశా! గంగ విడుము, పార్వతి చాలున్. 104

సీ. నీ లాలకా జాల ఫాల కస్తూరికా
తిలకంబు నేమిట దిద్దువాఁడ?
నంగ నాలింగ నానంగ సంగర ఘర్మ
శీకరం బేమిటఁ జిమ్మువాఁడ?
మత్తేభగామినీ వృత్త స్తనంబుల
నెలవంక లేమిట నిల్పువాఁడ?
భామామణీ కచాభరణ శోభిత మైన
పాపట నేమిటఁ బాపువాఁడ?
తే. ఇందు సఖులను వేప్రొద్దు గ్రిందు పఱిచి,
కలికి చెంగల్వ ఱేకుల కాంతిఁ దనరి,
.... .... .... .... ఆహహా!
పోయె నా గోరు! తన చేతి పోరు మాని. 105

ఉ. ఇంగల మంచు వచ్చి, 'యదియే'నని కొత్తమసాని మ్రొక్కఁగాఁ
గొంగు బిరాల్నఁ బట్టి, తిరుకొం గటు దీసి, జలారి చెంతనే

వంగగఁ బెట్టి, యోనిఁ దిరువట్టఁ గొట్టఁగఁ, జాలుఁజాలు వీ
........లటంచు నిన్ను మఱి తిట్టెనుగా శఠకోప జియ్యరూ!

ఉ. *మీన విలోచనంబులును, మీటిన ఖంగను గుబ్బ చన్ను, లిం
పైన వచో౽మృతంబు, సొగసైన మదాలస మందయానమున్
గా నొనరించి, దీని గణికామణిఁ జేయక, నిర్దయాత్ముడై
గాసులదానిఁ జేసిన వికార విధిం దల గొట్టఁగా వలెన్. 107

ఉ. జంగమురాలిఁ బట్టి, యొక జంగము వంగగఁబెట్టి, యోనిలో
లింగముఁ బెట్టి, క్రుక్కి యదలించుచు, నొక్కొక తాఁకు
తాఁకినన్,
లింగ! నమశ్శివాయ! గురులింగ! మహేశ్వర! జంగమయ్య! యో
యంగజ భంగ! సాంబ! గురుఁడా! యనుఁ దాఁకిన తాఁకు
తాఁకుకున్. 108

చ. ఉలిమిడి చెక్కయున్, మిగుల నుక్కయుఁ, జప్పని రొట్టె
ముక్కయున్,
మలినపు గుడ్డలున్, నులక మంచపుఁ గుక్కియుఁ, జీకటిల్లునుం,
దలఁచిన రోఁత వచ్చు, నొకనాఁటి సుఖం బొక యేఁటి దుఃఖ, మి
పలివెల వారకాంతల యుపస్థలకున్ బది వేల దండముల్. 109

సీ. జిలుగైన చెంగావి జిగి మీఱు కుచ్చెళ్ళు
చిన్ని మెట్టెలమీఁదఁ జిందులాడ,
నీటైన రత్నాల తాటంకముల కాంతి
తుళుకు గుబ్బెమీఁద గునిసియాడ,
గుఱుతైన యపరంజి గొప్ప ముత్తెపు నత్తు
మోవిపై నొక వింత ముద్దు గుల్క,
తీరైన ముత్యాల హారముల్ మేలిమై
మెఱుఁగుఁ జెక్కులతోడ మేలమాడ,

* ఈ పద్యము క్రీడాభిరామమందును గలదు (ప.104). ఇది శ్రీనాథుని వీథిలోనిదని బ్రౌను పేర్కొనెను.

తే. గంధకస్తురి వాసనల్ గమ్మనంగ,
నలరు విలుకాని చేతి పూ వమ్మనంగ,
కాళ్ళ నందెలు గలు గల్లు గల్లనంగ,
సొగసు గుల్కంగ, వేపారి సుదతి వచ్చె. 110

ఉ. కూటమి నొక్క నాఁటికిఁద్రికోణ సహస్రములం బగుల్చ నీ
ధాటికిఁ! జల్లడంబులును, దారుణ గోణము, లంచుగోచులున్,
కాటులు నోర్వఁగాఁ గలవె? చాలును నీదు విజృంభణం, బయో!
యేటికి లేవఁ బాఱితివి యీ సరిప్రొద్దు కడం బ్రజాపతీ! 111

ఉ. మాపటి కొండవీటి కసుమాలపుఁ దొత్తులఁ జూచి యేల యు
త్థాపనశక్తి చూపెదవు దబ్బఱ శిశ్నమ! వారి సౌమన
శ్చాప గృహాంతరాళ తల జాగ్ర దుదగ్ర నిరర్గళ వ్రణో
ద్దీపిత కాలకూట విష దిగ్ధ శరీరుల మున్నెఱుంగవే? 112

సీ. పర రాజ్య పర దుర్గ పర వైభవ శ్రీలఁ
గొనకొని విడనాడు కొండవీడు,
పరిపంథి రాజన్య బలముల బంధించు
కొమరు మించిన జోడు కొండవీడు,
ముగురు రాజులకును మోహంబు పుట్టించు
గుఱుతైన యుక్కిత్రాడు కొండవీడు,
చటుల విక్రమ కళా సాహసం బొనరించు
కుటిలాత్ములకు గాడు కొండవీడు,

తే. జవన ఘోటక సామంత సరస వీర
భట నటానేక హాటక ప్రకట గంధ
సింధు రారవ మోహన శ్రీలఁ దనరు
కూర్మి నమరావతికి జోడు కొండవీడు. 113

క. నీలాటిరేవు లోపల
మేలిమితోఁ దీర్చినట్టు మెఱసి నిలుచుచుఁగా,

దాలిమిని వాలుఁ జూపుల
బాలామణి గుట్టు బైటఁ బడఁగాఁ జూచెన్. 114

క. నెమలిపురి యమ పురముగా,
యముఁ డాయెను బసివిరెడ్డి, యంతకు మిగులన్
యమదూత లైరి కాఁపులు,
క్రమ మెఱుఁగని దున్న లైరి కరణా లెల్లన్. 115

ఉ. ఆదరణంబు సున్న, వినయంబు హితంబును బొంకు, సత్యమా
లేదు, దయారసం బది హుళిక్కి, పపాపడు వేళ పంక్తిలో
భేదపుఁ బెట్టు దిట్ట, బలి భిక్షముఁ.................త
త్వాదులఁ బుట్టఁ జేసిన విధాత ప్రజాపతి గాక యుండునే! 116

శా. దస్త్రాలన్, మసిబుడ్లలున్, గలములున్, దార్కొన్న చింతంబులిల్,
పుస్తుల్ గారెడు దుసులున్, జెమట కంపుం గొట్టు నీర్కావులున్
అస్తవ్యస్తపుఁ గన్నడంబును, భయంబై తోఁచు గడ్డంబులన్,
'వస్తూ చూస్తిమి రోస్తిమిన్' బఠమటన్ వ్యాపారులం గ్రూరులన్.

తే. వీనులకు విందులై తేనె సోన లెనయ,
ముందు రాగంబునను జగన్మోహనముగఁ
బాడె నొక జాలరి మిటారి. యీడు లేని
కాకలీ నాదమున నోడ గడపు పాట. 118

తే. మేఁతఁ గరి పిల్ల, పోరున మేఁకపిల్ల,
పారుఁబోతుతనంబునఁ బందిపిల్ల,
యెల్ల పనులను జెఱుపంగఁ బిల్లిపిల్ల,
యందమునఁ గ్రోఁతి పిల్ల, యీ యబవ పిల్ల. 119

సీ. కూడు తలఁపఁ జోళ్లు, కూర కారామళ్ళు,
చెవులంత వ్రేలాళ్ళు, చేలు మళ్ళు,

దుత్తెఁడే నాగళ్ళు, దున్నపోతుల యేళ్ళు,
  కలవు మాపటి వేళ గంజి నీళ్ళు,
మాట మాటకు ముళ్ళు, మఱి దొంగ దేవళ్ళు
  చేఁదైన పచ్చళ్ళు, చెఱకు నీళ్ళు,
వంట పిడకల దాళ్ళు, వాడ నూతుల నీళ్ళు,
  వెన విరుద్ధపుఁ బేళ్ళు, వెడఁద నోళ్ళు,
పఖుల చన్నుల బైళ్ళు, చల్లని మామిళ్ళు,
  పరుపైన వావిళ్ళు, పచ్చ పళ్ళు,

తే. దళ మయినయట్టి కంబళ్ళు, తలలు బోళ్ళు,
పయిఁడికిని జూడఁ బయిఁడెత్తు ప్రత్తి విళ్ళు,
చలముకొని వెదకిన లేవు చల్ల నీళ్ళు,
చూడవలసెను ద్రావిళ్ళ కీడు మేళ్ళు. 120

సీ. తొలుతనే వడ్డింత్రు దొడ్డ మిర్యపుఁ జారు
  చెవులలోఁ బొగ వెళ్ళి చిమ్మిరేఁగఁ,
బలు తెలుంగులతోడఁ బచ్చళ్ళు చవి గొన్న
  బ్రహ్మరంధ్రము దాఁకఁ బారు నావ,
యవిసాకు వేఁచిన నార్నెల్లు నపి లేదు
  పరిమళ మెంచినఁ బఁడ్లు సొగచు,
వేపాకు నెండించి వేసిన పొళ్ళను
  గంచానఁ గాంచినఁ గ్రక్కు వచ్చు,

తే. నఱవ వారింటి విం దెల్ల నాగడంబు,
చెప్పవత్తురు తమ తీరు సిగ్గులేక,
.... .... .... .... .... ....
చూడవలసెను ద్రావిళ్ళ కీడు మేళ్ళు. 121

సీ. నడివీథిలో రాళ్ళు, నాగులే దేవళ్ళు,
  పరగట సావిళ్ళు, పాడు గుళ్ళు,

ఐదు వన్నెల కూళ్ళు, నంబటి కావిళ్ళు
నూరూర జిల్లేళ్ళు, నూట పీళ్ళు,
నడుముకు వడదోళ్ళు, నడువీథి కల్ రోళ్ళు,
కరుణాల వడిసెళ్ళు, కాఁపు ముళ్ళు,

తే. ..............నేరెళ్ళ వాగుపీళ్ళు,
పిరులఁ జెలువొందు మారెళ్ళ సీమయందు. 122

ఉ. మా కలిదిండి కామయ కుమారకుఁ డన్నిటఁ దండ్రి వైఖరే
కాక, త దన్యుఁ డెట్లగును? గాడిదకుం దురగంబు పుట్టునే?
చేకొని కొంకినక్కకును సింగము పుట్టునె? మాలకాకికిం
గోకిల పుట్టునే? చిఱుత కుక్కకు మత్త గజంబు పుట్టునే? 123

సీ. చక్కని నీ ముఖ చంద్ర బింబమునకుఁ
గల్యాణ మస్తు, బంగారు బొమ్మ!
నిద్దంపు నీ చెక్కుటద్దంపు రేకకు
నైశ్వర్య మస్తు, నెయ్యంపు దీవి!
మీటినఁ బగులు నీ మెఱుఁగుఁ బాలిండ్లకు
సౌభాగ్య మస్తు, భద్రేభయాన!
వలపులు గులుకు నీ వాలుఁ గన్నులకు న
త్యధిక భోగోఽస్తు, పద్మాయతాక్షి!

తే. మధురిమము లొల్కు నీ ముద్దు మాటలకును
వైభ వోన్నతి రస్తు, లావణ్యసీమ!
వన్నె చిన్నెలు గల్గు నీ మన్ననలకు
శాశ్వత స్థితి రస్తు, యోషా లలామ! 124

# క్రీడాభిరామ పద్యానుక్రమణిక

# శ్రీనాథుని వీథీ పద్యానుక్రమణిక

పద్య సంఖ్య

# క్రీడాభిరామము          లఘుటీక

.... .... .... .... .... .... .... .... .... .... .... .... .... .... .... .... ....

పద్య-గద్య సంఖ్య

1 రూపకము = దృశ్య కావ్యము

దశ రూపకములు:- 1 నాటకము, 2 ప్రకరణము, 3 భాణము 4 ప్రహసనము, 5 డిమము, 6 వ్యాయోగము, 7 సమవాకారము, 8 వీథి, 9 అంకము, 10 ఈహామృగము.

వీథి = దృశ్యకావ్య ప్రభేదములలో నొకటి

2 త్రైశంకవము = త్రిశంకు సంబంధము
సైకతములు = ఇసుక తిన్నెలు
మేలము + ఆడె = రమించెను
ఆమ్నాయ మాత = వేదమాత
కాల కంధర కోదండ ఖండనుఁడు = శివుని వింటిని విఱిచినవాఁడు,

3 ద్యావా పృథ్వీ + అంతరాళములు = భూమ్యాకాశ మధ్య ప్రదేశములు
చంద్రాతప శ్రీ = వెన్నెల శోభ

4 ప్రాలంబ నైపథ్యము = భూషణ మగు కంఠ హారము

5 అభ్యర్ణుఁడు = ఉత్తముఁడు, హితుఁడు
ఠంఖణ = ధ్వని

సాహిత్య సౌహిత్యమై = ఆహ్లాదము గూర్చు సారస్వతము గలదై

8 వాచస్పతి = బృహస్పతి

9 అద్రి రాజ నందన = పార్వతి

10 త్రిపురమా = తిప్పమ్మ
రోహిణీ వల్లభుఁడు = చంద్రుఁడు
పుష్పభల్లుఁడు = కుసుమాయుధుఁడు (మన్మథుఁడు)

12 మందారము = కల్పవృక్షము
తారాచలము = కైలాసము
భావ సంభవుఁడు = మన్మథుఁడు
దేవేంద్ర సూనుఁడు = జయంతుఁడు
సూర్య తనయుఁడు = కర్ణుఁడు
భార్గవుఁడు = శుక్రుఁడు
గీష్పతి = బృహస్పతి
గంగా + ఆత్మజుఁడు = గంగకొడుకు (భీష్ముఁడు)

13 సురధుని = గంగ
పన్నగ + అలంకారుఁడు = శివుఁడు
పన్నీరజ (పత్ + నీరజ) = పాద పద్మముల
ప్రత్యగ్ర = నూతనమైన
గంధకి = మల్లెను బోలిన తెల్లని పూవు
గంధసారము = చందనము

14 కనక + అద్రి = బంగారు కొండ (మేరువు)
ప్రతిమాన = సాటియైన
అహిమ + అర్కుఁడు = చండ సూర్యుఁడు

15 జగత్ + ఉదీర్ణ వితీర్ణుఁడు = లోకప్రసిద్ధ దాత
ఉద్వాహము = పెండ్లి

హరిణ+అంకుఁడు=చంద్రుఁడు

16 అయుగ నయనుఁడు=బేసి (మూడు) కన్నులు గలవాఁడు (శివుఁడు)

పుండరీక + ఈక్షణుఁడు = తెల్లని తామర వంటి కన్నులు గలవాఁడు (విష్ణువు)

సీమా దంతావళము=దిగ్గజము

17 రారాజు=దుర్యోధనుఁడు

రైరాజు=కుబేరుఁడు

భద్రుఁడు=ఉత్తమ జాతి శృంగార పురుషుఁడు

రత్న భండారము=బొక్కసము

18 దంభోళి=వజ్రాయుధము

తపనీయ+అచలము=బంగారు కొండ (మేరువు)

ఉద్ది=సాటి (ఉద్దులు—బ. వ)

19 చక్రవాళము=లోకాలోక పర్వతము

20 గంధవతి=ఒక నదిపేరు

పుర ఘస్మరుఁడు=శివుఁడు (త్రిపురాంతక దేవుఁడు)

పుష్పంధయము=తుమ్మెద

శ్రుతపర్వతము=వినుకొండ (ఒక నగరము)

22 కరతల + ఆమలకము = అర చేతియందలి యుసిరిక కాయ (స్పష్టమని భావము)

సారస్వతశ్రీ=కవితా సంపద

23 అహరవధి (అహస్+అవధి)=సాయంకాలము

తుహిన+అంశు ధరుఁడు=చంద్రశేఖరుఁడు (శివుఁడు)

అభ్రధుని=గంగ

లహరి=అల

24 హాటక గర్భ వధూటి = సరస్వతి
పీటి = పీడెము
విసృమర = వ్యాపించు
సౌరభ్యము = పరిమళము

25 హల్లీసకము = మండలాకార నృత్యము (గొంత్లి)

26 పయః పయోధి = పాల సంద్రము

27 చాప జ్యా వల్లి = వింటి త్రాఁడు
28 హల్లకము = చెంగలువ
వాక్ + డంబరము = ప్రౌఢ వాక్యము

29 ధారాధరము = మేఘము
తపనజుఁడు = కర్ణుఁడు
రై రాజు = ధనాధిపతి (కుబేరుఁడు)
రాజు = చంద్రుఁడు
ధారా నగర + అధిపుఁడు = భోజరాజు
ధారాధరవాహుఁడు = జీమూతవాహనుఁడు

30 ఈవి = త్యాగము
నిర్జర పరివృఢ మణి = చింతామణి
ధనదుఁడు = కుబేరుఁడు
జలదుఁడు = మేఘుఁడు
బలి = బలిచక్రవర్తి
ఖచర = సూర్యుఁడు
నిశాకరుఁడు = చంద్రుఁడు
సుర తరువు = కల్పవృక్షము
సుర ధేనువు = కామధేనువు

31 ధౌరంధర్యము = సామర్థ్యము
వేరీ = ఎక్కడఁగలరు?

32 మందార వారుణి = కల్పవృక్షపు కల్లు
వెడఁద = విశాలమైన
వడువు = బ్రహ్మచారి
కుర్కురము = కుక్క
వెలఁది కోఱ = తెల్లని కోఱ
ఖట్వా + అంగము = మంచపు కాలు
ఈప్సితము = కోరిక
అహరహము = ఎల్లకాలము

36 జే = నమస్కారము

39 షట్చరణ = ఆఱు కాళ్ళు గల,
మధువ్రత = ఓ తుమ్మెదా!
వికచ + అరవింద వనవాటిక = విప్పారిన తామరల కొలను
ప్రాఁబడిపోవు = నశించు

40 మాయ లేడి = బంగారు జింక

41 పునర్భువు = ద్వితీయ వివాహమాడిన వనిత
ప్రేమ సంధుక్షణా గర్భము = లోపలఁ బ్రజ్వరిల్లువలపు

42 గొజ్జంగి పూ నీరు = పన్నీరు
గంగమట్టి = విభూతి
బంగారు జలపోసనము = బంగారు మలాము
ప్రసన్నని = మనోజ్ఞమైన
పట్టు తోరము = పట్టుతోఁజేసిన వ్రత సూత్రము
జటిగొన్న = సరిగ చుట్టిన
బింగ + అంటుల + పాయంగన్ = చిక్కు, ముడికి తొలఁగఁగా

ఒనపరి = అందగాఁడు

43 ఆంధ్ర నగరము = ఓరుఁగల్లు

45 ఇరుచంబడన్ = కుదియఁబడునట్లు
అక్కలఁజేయున్ = ముడుచుకొనఁజేయును
గుమ్మడిమూట = గుమ్మడికాయ ఆకృతిలోఁ గట్టిన మూట
దువాళిచేసి = విజృంభించి

46 కుమ్ములు = పొట్టునిప్పు
గుత్తము + సుగ్గడితము = బిగువైౖ తఱచు నేఁతగల.
తోఁపు రెంటము = జంటనేఁత గల యెఱ్ఱని దుప్పటి
నఖంపచము = గోరువెచ్చని
తుషారము = మంచు

47 ద్విత్రిపటము = బొంత
ప్రాలేయము = మంచు
ఊష్మము = వేడి

48 ఉపగూహము = ఆలింగనము
గర్భ నికేతనము = నట్టిల్లు

49 ప్రస్థానము = ప్రయాణము

50 బలసూదను దిక్కు = తూర్పు
కోటఁడు = గ్రుడ్లగూబ

51 మాఁగిలి మాఁగిలి + ఉండియుండి
షడ్జము = షడ్జ స్వరము (షడ్జం మయూరో వదతి-అని
అమరము)

52 ఏట్రింత = భారద్వాజ పక్షి
కొంకనక్క = గుంటనక్క (చిన్నజాతి నక్క)
శాకునికులు = శకున శాస్త్రజ్ఞులు
కొంగు బంగారము (జా) = సులభ లభ్యము
వల తీరు = కుడివైపు గమనము

54 ధర్మదార = యుద్ధ విరమణ సంకేతముగ నూదఁబడు బాకా
కుక్కుట కంఠ కాహళి = కోడి కంఠ మనెడు బాకా

56 కడి మాడ+చేయు = మాడ (ఒక నాణెము) విలువ చేయఁగల భోజనము

తేపాడి = ఉదయము

పిచ్ఛిలము = పేరుకొని గడ్డకట్టిన

57 గోత్ర స్ఖలనము = ప్రియురాలి యెదుటఁ బొరపాటున అన్య కాంత నామముఁ బలుకుట

58 వేసడము = పీచమైన

59 లాంగలీ కుసుమము = తరిగొట్టు పూవు

పిశంగిక = తెలుపు పసుపు వన్నెగల

హట్టము = భాగము

ప్రావృట్కాలము = వర్ష ఋతువు

ప్రవాసము = పర దేశ వాసము

60 ఝంఝు = గాలివాన (తుపాను)

ఉత్ = తృణ+ఆలయము = కప్పుపై గడ్డి ఎగిరిపోయిన యిల్లు

కంకటి = మంచము

ముచ్చముడిఁగి (ముడిఁగి + ముడిఁగి) = బాగుగాముడుఁగుకొని

వియోగ గ్లాని = విరహ బాధ

ఎక్కటి = ఒంటరి

ధారాధర శ్రేణి = మేఘమాల

62 త్రస్తరించు = పరిహసించు

సొబగువీడు (జా) = వెలుఁగుమాయు

కడు+ఎఱ్ఱ = కట్టెఱ్ఱ = మిక్కిలి యెఱుపు

63 దిశావ్యోమ+అవకాశంబులన్ = దిగంత ప్రదేశములయందు

64 ఈరెండ = లేఁతయెండ

స్వారాజ ప్రమద = ఇంద్రుని భార్య (శచి)

కాశ్మీర క్షోదము = కుంకుమ పొడి
ఆశ్లేషము = ఆలింగనము

65 ముఖ మజ్జనము = మొగము కడుగుకొనుట
గో ధూళి లగ్నము = ఆవులు మందకేఁగునపుడు దుమ్ము రేఁగు కాలము (ప్రభాతము)
ఉషఃకాలము = ఉదయము
ప్రయోజనము = కార్యము

66 మనః ప్రసాదము = చిత్త నైర్మల్యము

67 కటకార కుటీ వాటిక = చాప అల్లువారుండు వీథి (మేదరవాడ)

68 పచరించు = చక్కదిద్దు
అలఁతి = చిన్ని
దిస్సువాఱఁగన్ = దిస్సను సన్నని ధ్వని సాగునట్లు
ధవళ తాళ పలాశ తాటంకములు = తెల్లని తాటాకు కమ్మలు
వైణవ కాష్ఠ పీఠము = వెదురు పీట
తంగేటి జున్ను (జా) తంగేడు చెట్టులోని తేనెపట్టు (సులభ్యము)
బరిగోల = వెదురుకోల (ఒక ఆయుధము)

69 పుటభేదనము = పట్టణము (ఓరుఁగల్లు)
ఆరకూట కటకము = ఇత్తడి కడియము
కటకార కుల వధూటి = మేదర పడఁతి
కుటిక + అగారము = కుటీరము
గరిడి = సాముచేయుచోటు

70 గిసిన వెదురు సలాకలన్ = నునుపుచేసిన వెదురు కమ్ములతో
కట కుటీర విలాసిని = మేదర వెలయాలు

71 పల్లవ తస్కరుండు = దొంగ విటుఁడు
తారము = నాలుగు కాసుల నాణెము

వల్లవము = వరహాల సంచి
పటీ పల్లవ కోణము = కోక చెఱఁగు కొన (కొంగు)

72 చేడియ = వనిత

73 గండ + ఆభోగము = చెక్కిళ్ళ భాగము
పిసాళింపఁగా = వ్యాపింపఁగా
ఇక్షు కోదండుఁడు = మన్మథుఁడు (చెఱకు విలుకాఁడు)
ఏర్చిన = ఎక్కు పెట్టఁబడిన

75 కౌఁదీఁగ (కౌను + తీఁగ) = తీఁగవంటి సన్నని నడుము
విమల + అర్ణఃపూర్ణము = మంచినీళ్ళతో నిండిన
కర్ణాటి = కన్నడదేశ కాంత
క్రాల్గన్నులు = చంచల నేత్రములు
పటితాళింపుచున్ = అల్లార్చుచు
నీల కబరీ భారము = నల్లని కురుల మొత్తము

76 హట్ట మార్గము = అంగడి వీథి

77 డా చేయి = ఎడమ చేయి
మైల సంత = ఊరి వెలుపల నిమ్నజాతులకు నియమితమైన సంత
జోటి = వనిత

79 అసమశర + ఆలయము = మారునిల్లు
సమీరణము = గాలి

80 దైత్యారి (దైత్య + అరి) = విష్ణువు
చరమ భాగము = పై భాగము
కపటు = మాలిన్యము
గంగమట్టియ = విభూతి
సాంగత్యము = సంపర్కము
మునిమిట్ట = ఎత్తైన

సజ్జికము + చాయ = నిద్దమైన కాంతి
విలసనము = సొబగు
పంచబాణ మందిరము = మారునిల్లు

81 నిర్యాసము = జిగురు
కామ నిలయము = మారునిల్లు
పాటలగంధులు = వనితలు
హేలిక వాటి = కొంపులవాడ
తొగరు + కట్టులు = ఎఱ్ఱని చాలులు
ఒల్లియ = చీర
చాంపేయ కుసుమ + ఛద = సంపంగి పూ రేకుల

82 కందుక కేళి = బంతియాట
పురుషాయిత క్రియ = ఉపరతి (మగపోఁడిమి)
గోమయ పిండములు = పేఁడ యుండలు

84 విలాసములు = విలాసములు
మౌగ్ధ్యము = అమాయికత, అందము

85 విటంకము = మధ్య భాగము
కృకాటిక = పెడతల
చేటిక = నెచ్చెలి

86 కుసుమన్ + పెట్టిన చీర = ఎఱ్ఱ రంగు అద్దకము చీర
త్రిసరంబులు = మూఁడు పేటల హారము
అవటూ దేశము = పెడతల భాగము
వసివాళ్వాడు = మిక్కిలి వాడిపోవు

87 వాహకుఁడు = రౌతు
వారువము = గుఱ్ఱము

88 నోవులఁబెట్టు = నొప్పి కలిగించు (బాధించు)
కుసుమసాయక తంత్రము = సురతము

90 పంచారించిన = ఉన్నతములైన
అస్ఫాలింతునో = చఱతునా?
బొమ్మ + అంచు + కెంపు + చిగురు + ఆకు మోవి = వస్త్రము
లలో బొమ్మంచు ఒకటి, దానివలె ఎఱ్ఱనై, చిగురువంటి
యధరము

91 ణిపిధాత్వర్థము = చుంబనము
కాంచీ దామ పదము = కటి
తాటంకిని = వనిత

92 పిసాళము = పరిహాసము
హాటక నిష్కములు = బంగరు నాణెములు
జంఝూటము = ప్రగల్భము
కటారిక త్తియలు = కత్తిని బోలిన కాంతలు
టాటాలు గుణించు (జా) = దంభములు పలుకు

93 దిట్ట బాఁపడు = గడుసరి బ్రాహ్మణుఁడు
నవరగా = అందముగా
పుంజాల దండ = కంఠహారము

95 కులుకరించు = చిందించు
జీరువాఱు = వ్యాపించు
దిచ్చరించు = వెలికివచ్చు
బయలుపడు = కనఁబడు
పిసాళించు = వంచించు

97 కదంబకము = గుంపు
అపలాప ప్రౌఢి = కపట వాక్కులలో నేర్పు

98 పాప ద్యూతము = పాప కార్యమగు జూదము
పన్నిదము = పందెము
కౌపీనము = గోచి

99 నెమకి = వెదకి
ముగుదలు+అగువారిన్ = కపట మెఱుఁగని వారిని
పశ్యతోహరుఁడు = చూచుచుండఁగనే దొంగిలించువాఁడు

100 శతానంద గేహిని = బ్రహ్మ యిల్లాలు (వాణి)
పాణింధమము = విస్తరింపఁజేయు

101 విజ్జోడుపడన్ = విడఁబారి పోవఁగా
వెంబ్రుక జందెము = జందెమువలె వ్రేలు వెంబ్రుకలు
మొరవంక = అందె వలె వంపైన
జంగశము = నిడువాటు
విచ్చుటాకుల దుద్దులు = తాటాకుఁ గమ్మలు
క్రంత = సందుత్రోవ
కొనరినట్లు = అతిశయించినట్లు

102 జళుకు = తళుకు

103 తిరుపుటెద్దు = గానుగెద్దు
ప్రతోదము = మునికోల
తిమి ధామము = సముద్రము

104 గణిక = వేశ్య
సంపద చేడియ = లక్ష్మి
గానులదాని = తెలికదాని

105 దాత్యూహము = వానకోయిల (చాతకపక్షి)
మోహరివాడ = సైనికులవాడ

106 ఎగడిగ్గఁ = పైకిఁ గ్రిందికి
కక్షము = చంక
కలికితనము = విలాసము
సౌచికుఁడు = కుట్టుపని (దర్జీ) వాఁడు

పల్లవుఁడు = విటుఁడు
కంచెల = రైక
విషయ+అభిలాషి = కామాసక్తుఁడు

108 ఈరు = పేనుగ్రుడ్డు
ఈరుచు = క్రుక్కు
గోరఁట యెఱ్ఱలు = గోరంటుచే నెఱ్ఱనైనవి
సీత్కృతుల్ = సీత్కారములు

110 ఉపరతి = పురుషాయితము
హరిద్ర = పసుపు
కాచ భూష = తొడుగుకొన్న గాజులు

112 మహాప్రస్థానము = మహాయాత్ర
ఘంటాపథము = రాజమార్గము
కరటి యూథము = ఏనుఁగుల గుంపు
సంబాధము = త్రొక్కిడి
ఓసరిలు = ప్రక్కకుఁ దొలఁగిపోవు

114 అక్కలవాడ = వంటలక్కలుండు చోటు

115 ఆలువరి = కోటకొమ్మ

116 ఫీట్కారము = ఈల

117 కుంతము = ఈటె

120 వీరసంబెట = వీరులు బిరుదుగా ధరించు చరణాభరణము
రవణము = భూషణము

121 నాగరికల్లు = నాగుల రాయి

122 చాపకూడు (జా) = ఏకాసన భోజనము
నిప్పుల యేఱు = అగ్ని గుండము

ఐతిహ్యము = పూర్వగాథ
జనప పెద్దలు = జానపద వృద్ధులు

124 పుంభావ ప్రసంగము = పురుషాయిత సన్నివేశము

125 త్రికూటి = త్రిభుజము
నాసీరము = సేనాముఖము; సేనాపతి

126 నింబ పల్లవము = వేప చివురు

127 జమదగ్ని గారాపు సతి = రేణుకాదేవి
గోష్ఠము = ముంగిలి

128 ముయ్యేడు సారె = ఇరువదియొక్కసారులు
గవడ పేరు = గౌడ సరము (చూ. కళా. 7-66)

129 బవనీఁడు = జాతరయందు సుద్దులు చెప్పుచు బవని యాడు వాఁడు (బవినీఁడు—అని శ. ర). బవినీని సుద్దికి బారి సాలువ జోడు - అని లోకోక్తి.
జవనిక = ఒక తంత్రీవాద్యము
త్రుళ్ళాడు = అతిశయముగ చిందులు త్రొక్కు

131 జనంగమ ప్రమద = మాలెత
వలరాజు = మన్మథుఁడు

133 వ్రీళ = సిగ్గు
శంభళి = తార్పుడుకత్తె

134 చిఱుత చౌకంబుల = చదరపు గళ్ళుగల,
తొగరు పుట్టము = ఎఱ్ఱని చీర
ఓలగందము = కుంకుమబొట్టు చెరగిపోకుండుటకై ముందు పెట్టుకొను గందము

136 జీవగఱ్ఱు = బిరడా (సారె)
కింకిణీ గుచ్ఛము = చిఱు గంటల గుత్తి
కైటభ + అరి = విష్ణువు

137 వి త్తరింప = వి స్తరింపఁగా
అతకరించు = తొలఁగించు
నెఱిక తూలు = కుచ్చెళ్ళు తొలగిఁపోవు

138 తను + అవలగ్నము = సన్నని నడుము

139 అవ్యాక్షేపము = నిర్విఘ్నము

140 శృంగనాదము = కొమ్ము (ఒక వాద్యము)

142 చంద్రమల్లెలు = చంద్ర నిప్పులు
హాొన్నాళము; హొన్ను + నాళము - బంగారు పిడి
మిపిమింతులు = శ్రమగొన్నవారు
నారసము = ఇనుప కోల (నారాచము)

143 గొండ్లి = మండలాకార నృత్యము
నెట్టికసీల = అడ్డిగసీల (చిన్నది)

144 పిన్ననువు = నేర్పు

145 మంచు కుంచాలఁ గొలుచు,
మాయలేళ్ళఁ బట్టి కట్టు (జా) = అసాధ్యమును సుసాధ్యము చేయు; ఇది - ఇసుకలోఁ దైలముఁ దీయవచ్చును అనునట్టిది

146 నింబ దళ మాల్యా తోరణము = వేపాకు మండలు గల తోరణము

151 మనాక్ + కంపము = ఇంచుక కదలిక
తిమి = నూఱు యోజనముల పొడవుగల చేఁప
ధుళి = తాఁబేలు

153 అర్కోపలము = సూర్యకాంత శిల
కోయష్టులు = కొక్కెర పక్షులు
రోలంబము = తుమ్మెద
మైరేయము = మద్యము
అబ్జ మైరేయము = కమలమందలి మధువు

155 మోసాల = నగరి తలవాకిటి చావడి (ముఖశాల)

157 బంధకి = అంకుటాలు

159 తేఁడఁగ = వెదుకఁగ (అ.దే)
బాఁడు = బ్రాహ్మణుఁడు
పణము = డబ్బు
ఉపహార పరిపాటి = భోజన క్రియము

161 ఘరట్టము = తిరుగలి

166 కప్పురభోగి వంటకము = కర్పూరభోగము లను బియ్యపు టన్నము
లప్పలు = పెద్ద దొన్నెలు

168 అఱుగౌను = సన్నని నడుము
కుఱుబోద = జుట్టు లేని పొట్టిది
బఱిపోవఁగ = మేరమీరి వర్తించునట్లు
జే జే = వందనము

169 విశ్వస్త = విధవ
వైదగ్ధ్యము = నేర్పు
నవ లక్ష + అధీశుఁడు = తొమ్మిది లక్షల ధనుర్ధరులకుఁ బతి (ప్రతాపరుద్ర మహారాజు)
సుషమ = శోభ

170 క్రోల్చిన = ఆలాపించిన
అచ్యుత జాగర వేళ = ఏకాదశి రాత్రి

173 గాలాము = గాలము
కీకసము = సన్నని పుర్వు
జిడ్డలు చేసి = తుడిచివైచి
అన్న = పై భాగము
సంవర్తికా పలాశము = మధ్యనున్న రేకులు
చిచ్చుఱకన్ను = అగ్నిమయమైన కన్ను
వెచ్చిన = కాలిన
గేదంగి = మొగలి

175 పెరుమాళ్ళు (అ. దే) = విష్ణువు

176 త్యాగము = ఈవి

178 ఇందు రజము = కర్పూర చూర్ణము

185 ఢిల్లి సురతాణి = ఢిల్లి సుల్తానుని ప్రేయసి

188 కటకము = రాజధాని

190 అసమ నేత్రుఁడు = శివుఁడు

192 మయ్యెర = కుంచె

193 పిందువారము = వావిలి
అడియాలము (అ. దే) = గుర్తు
గాంధర్వి = వేశ్య (గంధర్వ జాతిది)

196 యాయజూకుఁడు = యాగముచేసినవాఁడు

197 దర్పణము = అద్దము
వివర్త వాదము = అద్వైతములో ఒక వాదము

205 కారవేల్లము = కాఁకర తీఁగ
దేవ వేశ్యా భుజంగుఁడు = దేవతలనెడు వేశ్యలకు విటుఁడు
(దేవతా సార్వభౌముఁడు)

206 పసిఁడి కోర = బంగారు గిన్నె
పుల్లసిలు = అరుచి పుట్టు

207 ఈరసము = రస హీనము
లేఁబడు = పేద యగు

209 వ్యాప గ్రాహ్య = బారల నేఁ బట్టఁదగిన
మాంధాళలు = ఉగ్ర కామశక్తి గలవారు
తెమల్చు = సంతృప్తి పఱచు

210 ఉప్పరము + ఎత్తి = మీఁదికెత్తి
తిరునాళ్ళు (అ. దే) = ఉత్సవ దినములు

211 ముంజె పదను = తాటి ముంజె వలె నును పు

212 నాడింధముఁడు = అగసాలెవాఁడు
చిచ్చులకోల = అగ్నిమయ బాణము

213 వితంతువు = విధవ

214 మాచకమ్మ = పురుష లక్షణము గల స్త్రీ
చెడిపె = కులట
విశ్వస్త = విధవ
తెంపి = వితంతువు
మైథునము = సంయోగము

216 వక్షః కుట్టనము = చంటి పోటు

217 లవ లవన్ = ఇంచుకించుక

221 వ్యగ్రహము = వగ్గము

223 గంధసారము = గందము
స్థాసకము – కుంకుమ పూఁత

226 కరసాన = గంధము తీయు చిన్ని సాన
కలివె = కలివి చెట్టు
తిరి కట్టుకొని = పేటులెత్తి
గుమ్మెట = తుడుము (వాద్యము)
మువ్వలత్తెము = మువ్వలు గల ముంజేతి తొడుగు
ఆవుర్ని = ఆవురని
మిడికించు = మిటకరించు
ములుగు = శబ్దించు
గడిఁడు = గడకట్టి యాడువాఁడు

227 గ్రైవేయము = కంఠాభరణము
విషాణము = కొమ్ము
రింఛోళిక = సమూహము
దువాళిగొను = గంతులు వేయు
ఉరభ్రము = పొట్టేలు

231 తట్టువాఋ = ఏపణఁగు
ఆస్కందము = యుద్ధము

232 కృపీట సంభవుఁడు = అగ్ని
క్రోష్టువు = నక్క
మేంఠము, ఉరభ్రము, ఏడకము = పొట్టేలు
మమ్మ = బలే (ఆశ్చర్యసూచక పదము)

233 దురోదరము = జూదము

234 తామ్రచూడము = కోడి

235 నారికేళ ఒక జాతి = ఒక జాతి కోడి
ఉప్పరము = ఆకాశము

విఱుగా = పాఱునట్లు
ఏకాంగ యుద్ధము = ద్వంద్వ యుద్ధము
తొగడు = గంట
కృకాటము = పెడతల
తండసము = పెంద్రుకల నూడఁబెఱుకుటకు మంగలి యుప
యోగించు సాధనము

236 ఔపవాహ్యము = వాహనము
యభనము = సంయోగము

240 రోవట్టు = వేశ్యా శుల్కము
భైరవ తంత్రము = కలయిక
సౌధ + అట్టము = మేడ పై భాగము
అనాగతము = రానున్నది

244 ఓవరి = లోపలి గది

245 ఆహి + పెట్టు = తాకట్టు పెట్టు
వృత్తము = ధనము

246 ఈఁగకుఁ బోక పెట్టుట (జా) = పోక యీఁగకు ఆస్వాద్య
వస్తువు గాదు. దూరము నందుండి చూచుచుండును. ఆ
రీతి ఎవరికి వారు ఊరకున్నారని భావము.
హెచ్చు కుందు = ఎక్కువ తక్కువ లాడుకొను

248 గొడ్డేలు = మిక్కుటమైన

249 గోళకుఁడు = వితంతువునకు జారునివలనఁ బుట్టినవాఁడు

251 హాలము = మద్యము
పర్యంకము = పడక

252 నముచిసూదనుఁడు = ఇంద్రుఁడు
కవ్వడి = అర్జునుఁడు

253 సవరతనము = చక్కదనము
మోరతీరు గలిగి = అందమైన మోము గలిగి
చేరు + అలంతి = సమీపము

256 త్రివ్వితండము (జా) = సమృద్ధి
తామరతంపర (జా) = ,,
విడిముడి = ధనము
లాతు = అధికము

257 ఘటశాసి = శాస్త్రి
కహళీ చషకము = పౌత్తులవంటి గిన్నె
కార్తాంతికుడు = జ్యోతిష్కుడు

258 పంచారించిన = అతిపీనములైన
ప్రాలంబము = కంఠహారము

259 నట్టువుడు = వేశ్యలకు నాట్యాచార్యుడు

262 పచ్చడము = పై వస్త్రము (సాలువు)
ముర్మురములు = కుమ్ములు (పొట్టు నిప్పు)
ఒలుగోయక = సరకు గొనక
సైరికుడు = హాలికుడు (రైతు)

263 దీకొను = డీకొను
ఉక్కివము = పరిహాసము

265 దీము = వేటకాడు పక్షిని బట్టుటకు సాధనముగ బెంచు కొన్న పక్షి
ననుపు పల్లవుడు = ప్రియ విటుడు
సన్నకుసన్న = రహస్య సంజ్ఞ

కై సేసి = అలంకరించి
బెడదపెట్టు = తగవులాడు
జఱభి = వృద్ధవేశ్య
గుల్లాము (అ. దే) = దాపి

267 తుండీర ద్విజుఁడు = తొండమండలము (కాంచీ) విప్రుఁడు
పరిరంభము = కౌఁగిలి
క్రోవి = గోరంటచెట్టు

271 ఘోణము = నాసా మూలము

273 తార్తీయీకము = మూఁడవ పురుషార్థము (కామము)

274 కాశ్మీర పరాగము = కుంకుమ పొడి
బొడ్డన బావి = దిగుడు బావి

275 కంగటి కాలు = మంచపు కోడు
కన్ను + ఇంగలము = నేత్రాగ్ని

278 వింజమూకిడు (జా) స్తబ్ధమైయుండు

279 గడితము = దిట్టము
జోహారు = వందనము

286 కనక నిష్కము = బంగరు నాణెము

287 పెద్దు కొలుపు = వంచించు
అరవేరము = చింతాజ్వరము

288 దొరసెము = నిరుటికి ముందటి యేఁడు (మొన్నటియేఁడు)
289 పరిరంభ పణము = కౌఁగిలికిచ్చు సుంకము

291 సొన్నాటంకములు = బంగారు నాణెములు

292 గొజ్జంగి నీరు = పన్నీరు
బడిపివైచి = వెదవల్లి
మూరిఁబోవన్ = అతిశయిల్ల

293 పుటభేదనము = పట్టణము

294 త్రిదశ మహీరుహము = కల్పవృక్షము






ప్రాచీన సంప్రదాయ
శిష్టశృంగార కావ్యావళిలో
అత్యర్వాచీన విశిష్టతా
రుచిమంతమగు వాస్తవిక
జనతా శృంగార కావ్యము
దాదాపైదుశతాబ్దుల క్రిందటి
యోరుగల్లు మహాపట్టణమును,
అందు వాడవాడల వివిధ
స్థాయుల జనుల జీవనములను,
ఆచారములను, మూఢవిశ్వాసములను
గాఢముగ రూపించు
'డాక్యుమెంటరీ' చిత్రము
వ్యంగ్యముగఁ బరిహసించు
'పేరడీ' కావ్యము
వినుకొండ వల్లభరాయుని
క్రీడాభిరామము
శ్రీనాథుని వీథినాటకము
సహితము.